# చతుర

మే 2009

రూ.10/-





. ఉదాత్త కార్మికనేత
పోరాటం
ాణిశ్రీ
ంగురాళ్లు
ే దినోత్సవ కానుక

# కాప్షన్ మీదే - 5




ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పైకార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. శ్రీధర్ ఆటోగ్రాఫ్‌సహా చక్కని బహుమతి అందుకోండి! బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

**మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈనెల 16**

చిరునామా: క్యాప్షన్ మీదే- 5, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : chatura@eenadu.net





# కాప్షన్ మీదే ఫలితాలు

## కాప్షన్ మీదే -3

ఉత్తమ వ్యాఖ్య :

**ఏ గొర్రె రావడం లేదు...**
**ఏ నాయకుడి వెంట పోయాయో?**

-కె.వి.మధుసూదనరావు,
సామర్లకోట రోడ్, కాకినాడ




**బాగున్న మరికొన్ని కాప్షన్లు**

**సాయంకాలమైనా ఒక్క గిరాకి కూడా రాలేదే**

-డా॥ జనార్దన సింగ్,
రామ్‌కోఠి, హైదరాబాద్

**రండి.. త్వరపడండి.. ఆలోచిస్తే మీరు బతికి బట్టకట్టినట్లే!!**

- తోటపల్లి సుధీర,
కోట, నెల్లూరు జిల్లా

**కోటి విద్యలు కూటి కొరకే**

- తిరుమల శెట్టి శ్రీనివాస్,
కె.పి.నగర్ కాలనీ హైదరాబాద్

**నక్కను చూసి పులి నేర్చుకున్నట్లు**

-ముమ్మిళ్ల వందన,
కిషన్‌పుర, హన్మకొండ

---

## కాప్షన్ మీదే -4

ఉత్తమ వ్యాఖ్య :

**నాగరీకం నేర్చిన నక్కబావా!**
**రాజకీయ నాయకులకు నువ్వు ఆదిగురువా?**

-తూలుగు దుర్గా సంయుక్త
ఎల్.బి.ఎస్.కాలనీ, శ్రీకాకుళం



**బాగున్న మరికొన్ని కాప్షన్లు**

**నీ కొంగ జిత్తులు నా దగ్గరా!**
**టెక్నాలజి డెవలప్ అయింది, తెలియదా?**

-వోలేటి శ్రీనివాసరావు,
విజయనగరం

**చూస్తూ ఉండటం వేస్టు**
**నక్క నీ కన్నా మోసంలో ఫాస్టు**

- ఆత్రం శశికిరణ్,
రాజారాంపల్లి, కరీంనగర్ జిల్లా

**అనుకున్న దొక్కటి**
**అయినది ఒక్కటి**

- కె.లక్ష్మీకాంతమ్మ,
నవాబ్ పేట, నెల్లూరు

**ఈ కథ మా అమ్మ నాకెపుడో చెప్పేసింది**
**కొంగబావా! అందుకే కూడా స్ట్రా తెచ్చుకున్నా..**

-కె.వి.మధుసూదనరావు,
కాకినాడ

సంపుటి -32
సంచిక - 04
మే 2009
376వ సంచిక

# చతుర



సేకరణ : కావ్య
ముఖచిత్రం : భావన
ముఖపత్రాలంకరణ : రాజుయాట



తల్లి మృతికి కారణమైన పోలీసును రాయితో కొట్టి ఊరొదిలి పారిపోయాడు ఆ బాలుడు. పెద్దవాడైన తర్వాత మళ్లీ ఊరికి వచ్చిన అతను ఆదర్శ కార్మికనేతగా బడుగుల్ని ఆదుకున్నాడు. గని యజమానులకు అది కంటగింపు కావడంతో అతన్ని దెబ్బ తీయాలనుకున్నారు. ఈ పోరులో అంతిమంగా ఎవరు గెలిచారు? ధనవంతుల అవినీతిని ఎండగట్టిన **వాణిశ్రీ** నవల

## రంగురాళ్లు

14 వ పేజీలో

బొమ్మలు: ఇ.ఆర్.రాజు





# నా అందం పుట్టుకతో వచ్చిన వరం

**ఎందరో కుర్రాళ్ల మది దోచిన అందం ఆమెది. పుట్టింది ఉత్తరాదినైనా 'ఇష్టం'తో తెలుగుప్రేక్షకుల ఎదుటకు వచ్చి, 'సంతోషం'తో ఇక్కడ స్థానాన్ని సుస్థిరం చేసుకుంది. బ్రూక్ బాండ్, రెడ్ లేబుల్ టీ, లక్స్‌సోప్, హెడ్ అండ్ షోల్డర్ షాంపులకు మోడల్‌గా ప్రస్థానాన్ని ప్రారంభించిన ఆమె 'ఠాగూర్'లో చిరంజీవి, 'శివాజీ'లో రజనీకాంత్ సరసన నటించింది. ఇప్పటివరకూ తమిళ, తెలుగు, హిందీ, ఇంగ్లీష్, కన్నడ భాషల్లో దాదాపు నలభై సినిమాల్లో నటించిన ఆమె శ్రియ అని వేరే చెప్పక్కర్లేదు. ఆమె తన అందచందాల గురించి ఎలాంటి శ్రద్ధ చూపుతుందో వివరించిందిలా..**

☆ అందం నాకు పుట్టుకతో వచ్చిన వరం. మొదట్నించీ అమ్మకు, నాకూ ఆరోగ్యంపై ధ్యాస కాసింత ఎక్కువే. లావెక్కకుండా నాజూకుగా ఎలా ఉండాలో నేర్పించింది అమ్మే. స్వీట్లు, ఐస్‌క్రీములు ముట్టుకోను. అవి ఒంటికి అస్సలు మంచివికావు. ఎంత వద్దనుకున్నా అవి బరువు పెంచేస్తాయి.

☆ ఢిల్లీలో చదువుకునే రోజుల్లో కథక్ నృత్యం నేర్చుకున్నా. ఇది నా జీవితంలో చాలామేలు చేసింది. నా ఆరోగ్యాన్ని కాపాడుతోంది ఇదే! మరోపక్క మంచి కథక్ కళాకారిణి అయ్యాను.

☆ చదువుకునే రోజుల్లో నేర్చుకున్న ఈతకూడా నా దేహ సౌష్టవానికి, ఆరోగ్యానికి దోహదం చేసింది. దాంతోపాటు యోగా చేయడం ప్రారంభించాను. అప్పటినుంచి తిరుగులేకుండా పోయింది. ఫిట్‌నెస్ సాధించడంతో నా అందం కూడా ఇనుమడించింది.

☆ షూటింగ్‌లో తలమునకలయినప్పుడు రోజూ నాట్యం చేయడం కుదరదు. అప్పుడు నా బరువులో హెచ్చుతగ్గులు తప్పవు. అలాంటప్పుడు కంగారు పడను. సంయమనంతో వ్యవహరిస్తాను.

☆ నాట్యంతో పాటు మొదలెట్టిన యోగా ఇప్పుడు నా జీవితంలో ప్రధాన భాగమైంది. పెందరాళే నిద్రలేచి యోగాకు ఉపక్రమిస్తాను. అయ్యంగార్ యోగాను, పవర్ యోగాతో మిళితం చేసి ఆసనాలు వేస్తాను. వీటివల్ల భుజాలు,

నడుము చక్కటి ఆకృతిని సంతరించుకుని, అందంగా తయారవుతాయి.

☆ రాత్రిపూట ఎన్ని పనులు ఉన్నప్పటికీ ఎనిమిది గంటలలోపే భోజనంచేయాలి. చాలా మంది దీని ప్రాముఖ్యాన్ని గుర్తించరు. ఇలా చేయడం మొదలుపెట్టిన తర్వాత నేను అత్యల్ప కాలంలోనే మూడు కిలోల బరువు తగ్గాను. ఆలస్యంగా తినడంవల్ల బొజ్జవస్తుంది.

☆ అలాగే ఉప్పు వాడకాన్ని బాగా తగ్గించాను. ఉప్పు ఎక్కువగా తీసుకుంటే దీర్ఘకాలం తర్వాత నెమ్మదిగా అది తన ప్రభావాన్ని చూపిస్తుంది. ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుంది.

☆ ఎక్కువగా నీరు, పండ్లరసాలు తాగుతాను. రోజుకు ఐదు లీటర్ల నీళ్లు తాగుతాను. వాటర్ థెరపీవల్ల చర్మం కాంతిమంతంగా ఉంటుంది. ఇదంతా గుర్తిస్తే మంచిది. అయితే పండ్లను తక్కువ తింటాను. చక్కెర పదార్థాలను తినకుండా ఉండటం మేలు. ఈ విషయంలోనే నాకు కాస్త ఇబ్బందిగా ఉంటుంది.

☆ నారింజ రసంతో నా ఉదయం మొదలవుతుంది. తర్వాత ఫిల్టర్ కాఫీ, కొబ్బరి బొండాలు తాగుతాను. నారింజ రసం కొవ్వును తగ్గిస్తుంది. అల్పాహారంలో గుడ్డులోని తెల్లసొనలు, పన్నీర్ పరోటా తింటాను. అప్పుడప్పుడు దోశలు కూడా తింటాను. ఏమాత్రం నూనె సోకని పన్నీర్ పరోటాలనే తింటాను. దీంతో లావెక్కకుండా ఉండటం సాధ్యం.

☆ బ్రేక్‌ఫాస్ట్‌కు మధ్యాహ్న భోజనానికి మధ్య సలాడ్స్, మొలకెత్తిన విత్తనాలు తింటాను. నా భోజనంలో సబ్జీ, రోటీతోపాటు దాల్ కూడా ఉంటుంది. కార్బోహైడ్రేట్లను పూర్తిగా తీసుకోకుండా ఉండను. అవి తక్షణమే శక్తిని ప్రసాదిస్తాయి. అలాగే ప్రతి రోజూ రాత్రి తప్పకుండా పాలు తాగుతాను.

☆ ఆహారం సరిగ్గా తినక కడుపు మాడ్చుకోవడం ఏమంత మంచి పద్ధతి కాదు. ప్రతి ఒక్కరూ ఆరోగ్యకరమైన ఆహారాన్నే భుజించాలి. అయితే మన తిండికి తగ్గట్టుగానే యోగ కూడా చేస్తే చాలా మంచిది.

☆ రాత్రి భోజనంలో గ్రిల్ చేసిన చికెన్, చనా కట్‌లెట్స్, కూరగాయలు తింటాను.

☆ చిరుతిళ్లు తినడం వ్యసనం లాంటిది. వాటికి అలవాటు పడకపోవడం నా అదృష్టం. అందువల్ల తప్పనిసరిగా భోజనం బాగానే చేస్తాను. హోటల్ భోజనం నాకు ఇష్టం ఉండదు. నేను బాగా ఎదుగుతున్న వయసులో ఉన్నప్పుడు మా అమ్మ ఎన్నెన్నో రుచికరమైన స్నాక్స్‌ను ఇంట్లోనే



తయారుచేసి పెట్టేది. అప్పట్లో వాటిని బాగా లాగించేదాన్ని.

☆ నాకున్న ఒకే ఒక్క బలహీనతేమంటే చాక్లేట్లు తినడం. వాటిని తినకుండా ఉండాలనుకున్నా కుదరడంలేదు. సాధారణంగా తినడానికి సంబంధించి అందరిలో ఉన్న బలహీనతల్లాంటివి నాలోను కొన్ని ఉన్నాయి. అందుకే అప్పుడప్పుడు ఆహారం విషయంలో కాస్త శృతి తప్పినా, వెంటనే చిత్తశుద్ధితో మళ్లీ జాగ్రత్తలు మొదలుపెడతాను.

☆ ఓసారి లండన్‌లో సెలవులు గడిపి వచ్చిన తర్వాత నేను బొద్దుగా తయారయ్యాను. మళ్లీ క్రమం తప్పకుండా నా అలవాట్లను కొనసాగించాను. ఆశ్చర్యకరంగా ఇరవై రోజుల్లోనే మూడుకిలోల బరువు తగ్గాను. దీంతో కృషితో సాధ్యం కానిది ఏదీ లేదనిపిస్తుంది.

☆ నా హాబీస్‌లో మొదటిది నాట్యం చేయడం. అలాగే ఇతరులతో ఎక్కువగా మాట్లాడుతాను. పుస్తకాలు చదవడం, సంగీతం వినడంకూడా నాకు అత్యంత ప్రియమైనవి. దీంతో ఎంతో ఉల్లాసంగా ఉంటాను.

☆ చర్మ సంరక్షణకోసం మంచి లోషన్లు, ఉత్పత్తులనే వాడుతాను. చర్మం నిగారింపును, బరువును తరచుగా పరిశీలించుకుంటూ తదనుగుణంగా మసలుకుంటాను. ప్రతి ఒక్కరూ తమ అందచందాలు, ఆరోగ్యం గురించి శ్రద్ధ వహించడం అవసరం.

☆ అలాగే నాకు దేవుడిపై నమ్మకం ఉంది. నేనీ స్థితికి చేరుకోవడం ఆ భగవంతుడి కరుణాకటాక్షాల వల్లనే.

**–కేఆర్‌జీ**

## అపార్ట్‌మెంటాలజీ -16

# రోజులు మారలా! బుద్ధులే గడ్డి తింటున్నయ్!



యర్రంశెట్టి సాయి

(మొన్న జరిగిన కౌన్సిల్ ఎలక్షన్‌లో గ్రాడ్యుయేట్స్ చాలామంది డబ్బు తీసుకుని ఓట్లేశారన్న విషయం తెలిశాక)

ఒకప్పుడు రాజకీయాలు చాలా గౌరవప్రదంగా ఉండేవి. ఊళ్ళో పార్టీకి ఒకరో లేక ఇద్దరో నాయకులు ఉండేవారు. వాళ్ళ మాటను పార్టీ వర్కర్స్ వేదవాక్కుగా భావించేవారు. బాగా చదువుకున్నోళ్ళు, నీతీనిజాయితీలకు పేరున్నవాళ్ళూ, ముందు నా దేశం- తర్వాతే నా ఊరు అనుకునే వాళ్ళు. కరప్షన్ మాట వినబడితే చాలు కర్ర పట్టుకుని వెంటపడే వాళ్ళూ. అలాంటి వాళ్ళకే పార్టీ టిక్కెట్లు ఇచ్చేవాళ్ళు. అధికార పార్టీతో సమానంగా ప్రతిపక్ష నాయకులూ చాలా హుందాగా, నీతీ నిజాయితీలతో ఉండేవారు. ఒకరినొకరు గౌరవించుకునే వారు. చౌకబారు ఆరోపణలు అసలు ఉండేవి కావు. దొంగలు, దోపిడీ గ్యాంగ్‌లు, మర్డరర్లు, కిడ్నాపర్లు, కులాల పిచ్చోళ్ళూ- వీళ్ళందర్నీ అన్ని పార్టీలూ ఆమడ దూరంలో ఉంచేవి. మరి ఇప్పుడో..

మొత్తం రివర్స్!

"అవతల పార్టీవాడు ఓల్డ్ సిటీలో ఎవర్ని నిలబెడుతున్నాడు?"

"వాడే చాంద్‌పాషా అని నొటోరియస్ రౌడీ షీటరున్నాడు కదా! వాడికిచ్చారు టిక్కెట్టు"

"మరి మనం ఎవర్ని నిలబెట్టాలి?"

"ఇర్ఫాన్ అనేవాడి మీద ఈ మధ్యే ఎనిమిది మర్డర్ కేసుల్లోనూ, తొమ్మిది రాబరీల్లోనూ, 14 బ్లాక్‌మెయిలింగ్ కేసుల్లోనూ పోలీస్ స్టేషన్స్‌లో కేసులు రిజిస్టర్ అయ్యాయ్- ప్రస్తుతం వాడే సిటీలో చాలా ఫేమస్ అయ్యాడు- వాడికి టెర్రరిస్ట్ లింక్స్ ఉన్నాయంటున్నారు. ఈ మర్డర్స్, లూటింగ్స్, లాండ్ గ్రాబింగ్స్‌లతో దగ్గర దగ్గర వందకోట్లు సంపాదించాడంటున్నారు. మనం వాడిని నిలబెడితే బెస్ట్. ఈజీగా గెలుస్తాడు"

"చాంద్ పాషా మీద ఎలా గెలుస్తాడు? వాడూ ఇదే టైపు కదా"

"కానీ వీడికి ఎక్కువ బుకింగ్స్ ఉన్నాయ్. మర్డర్స్, కిడ్నాప్స్‌కు 2014లోని ఎలక్షన్స్ వరకూ అడ్వాన్స్‌గా బుక్కయిపోయాడు"

"అయితే ఇంక ఆలస్యం ఎందుకు వాడిని కాంటాక్ట్ చేయకపోయారా?"

"చేశాం సార్. కానీ వాడు ఒక కండిషన్

పెడుతున్నాడు మన పార్టీ తరపున పోటీ చేయడానికి!"

"ఏమిటంటాడు? "

"మన పార్టీ పవర్‌లోకొస్తే- వాడికి హోమ్ మినిస్టర్ పోస్ట్ ఇవ్వాలంట"

"వాడికి మన స్టేట్ హోమ్ మినిస్టర్ పోస్ట్ ఇవ్వాలా? వాడికేం పిచ్చెక్కిందా? "

"తప్పేముంది సార్. ఇంతకుముందు హోమ్ మినిస్టర్లు వాడి కంటె తక్కువేముందని చేశారు? "

"నేననేదదేనోయ్. ఇంత పవర్‌ఫుల్ కాండిడేట్ కేంద్రంలో హోమ్ మినిస్టరవ్వాలి! ఈ చెత్త రాష్ట్రంలో అంత టాలెంట్ వృధా అయిపోతుంది కదా!"

"కానీ కేంద్రంలో హోమ్ మినిస్టరంటే వాడొప్పుకోవటం లేద్సార్"

"ఎందుకని? "

"వాడి గ్యాంగ్‌లో సగం మంది మన స్టేట్‌లోనే జైల్లో చాలా కేసుల్లో ఇరుక్కుని ఉన్నారు. వాళ్ళంధరినీ విడుదల చేయాలంటే రాష్ట్ర హోంమంత్రి అయితేనే కుదురుతుందంటున్నాడు"

"పిచ్చాడి లాగున్నాడే- కేంద్ర హోంమంత్రిగా ఉంటే ఉరిపడ్డ వాడి గాంగ్‌మెంబర్లు అందరినీ విడిపించుకోవచ్చుకదయ్యా? "

"పాయింట్ ఓకే గానీ.. వాడింకో ప్రాబ్లెమ్ చెప్తున్నాడు సార్"

"ఏంటిది? "

"సెంటర్‌లో ఒక పార్టీ- స్టేట్‌లో ఇంకో పార్టీ వస్తే కేంద్ర హోంమంత్రిగా వాడికేం ఉపయోగం ఉండదు కదా? "

"అవునవును, సరే.. చేసేదేముందీ? డెమోక్రసీకి వాడొక్కడే కరెక్ట్ కాండిడేట్ కనబడుతున్నాడు. వెంటనే వాడికి బి.ఫారం ఇచ్చి నామినేషన్ వేయించెయ్"

ఇది ఇవాళ పొలిటికల్ సెటప్! యధా రాజా తథా ప్రజా అనేది నూటికి నూరు పాళ్ళు నిజం కదా!

అందుకే మా నియోజకవర్గంలో




ఎవరెవరు నిలబడ్డారో వారందరికీ ఇంటర్వ్యూలు కండక్ట్ చేసి, మా టెస్ట్‌లో పాసయిన వాడికేమో రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌లో ఉన్న రెండువేల ఓట్లూ వేయాలని నిర్ణయించుకున్నాం.

మొదటిరోజు ఒక ఫేమస్ పార్టీ తరపున పోటీ చేస్తున్న గూండారెడ్డి మా కాలనీకొచ్చాడు.

గూండారెడ్డి అది వరకే రెండు మూడు సార్లు ఎమ్మెల్యేగా చేశాడు. కాలనీ వాళ్ళందరం గూండారెడ్డికి ఘన స్వాగతం పలికాం. సీతావరదరాజన్, షైనీ, అంజనీ బొపాషా, ఇంకొంతమంది లేడీస్ కలిసి అతనికి హారతి ఇచ్చి వేదికమీదకూ ఆహ్వానించారు.

మా సొసైటి ప్రెసిడెంట్ హమీద్‌మియా అతనికి స్వాగతం పలికాడు.

"గూండాధ్యక్షా! వినీతాగ్రేసరా! మా రామ్‌భరోసా అపార్ట్‌మెంట్స్‌కి మేమంతా మీది స్వాగతం చెప్తున్నయ్! 'మీట్ యువర్ ఓటర్' కార్యక్రమం లోపట మీరూ

మా అపార్ట్‌మెంట్స్ అసోసియేషన్‌కి ఇన్ వైట్ చేసి వచ్చినయ్. అందుకు మా మెంబర్స్ అన్నీ హాపీ ఉన్నయ్. ఇప్పుడు మా అపార్ట్‌మెంట్స్ లేడీస్ వింగ్ ప్రెసి డెంట్ షైనీ మీ మీదకి దండవేస్తయ్" అన గానే అందరూ తప్పట్లు కొట్టారు.

వెంటనే షైనీ, అంజని బొపాషా వేదిక మీదకెళ్ళి అతని మెడలో దండ వేశారు.

షైనీని చూసి గూండారెడ్డి కన్ను గీటాడు.

షైనీ ఉలిక్కిపడింది.

"సార్, వాడు నన్ను చూసి చిల్లరగా బిహేవ్ చేస్తున్నాడు" అంది కోపంగా హమీద్ మియాతో.

"వాడు మనక్కాబోయే ఎమ్మెల్యే వాడితో గొడవ పెట్టుకోవటమెందుకు? సైలెంట్‌గా ఊర్కో" అన్నాడు మొహిందర్‌సింగ్.

ఆ తరువాత ప్రశ్నోత్తరాల కార్యక్రమం మొదలయింది.

"గూండారెడ్డీ సాబ్.. మీ మీద ఎన్ని పోలీస్ కేస్‌లున్నాయ్? " అడిగాడు శంకర్ మూర్తి.

"మన స్టేట్‌లో రెండొందలు కేస్‌లు పెడింగ్‌లో ఉన్నయ్. పక్క స్టేట్‌లో నూట పద్నాలుగు. ఇంకో పదహారు కేసులు బుక్కయితే గిన్నిస్ రికార్డ్ బ్రేక్‌జేస్తా"

అందరూ తప్పట్లు కొట్టారు.

"నేన్చెప్పలే! చాలా గ్రేట్ ఫెలో వీడు!" అంటోంది అంజనీ బొపాషా.

"మీరెంత కాలం జైల్లో ఉన్నారు? " అడిగాడు విజయ్‌యాదవ్.

"ఇగో! బచ్‌పన్‌కెళ్ళి మనం జిందగీ అంతా జైల్లోనే గుజరాయించినాం రా భయ్! ఒకదినం మా జైలర్‌సాబ్ నా దగ్గ రకొచ్చి నన్ను చానా లైక్ చేస్తాడన్నట్లు- 'ఏంరా గూండారెడ్డి మన జైల్లో ఉన్న ఖైదీ లందరూ ఎప్పుడు ఛాన్స్ దొరికితే అప్పుడు పెరోల్ మీద బంధువుల్ని, పెళ్ళాం బిడ్డల్ని కలుసుకుని గడపనీకి రెండు మూడు రోజులు ఇండ్లకు పోతారు కదా? మరి నువ్ ఒక్కదినం కూడా మీ వాళ్ళ దగ్గరకు పోవేంరా? అనడిగిండు.

నేనేం జెప్పినానో ఎరుకనా? జైలర్ సాబ్! నా బంధువులు, నా కుటుంబం, నా దోస్తులు- అందరూ ఈ జైల్లోనే ఉన్నరు- ఇంక బయటెవడున్నడని బయటకు పోవాలె? "

అందరూ ఈలలు వేసి తప్పట్లు కొట్టారు.

"అటువంటి ఖాన్‌దాన్ మాది. మొత్తం ఖాన్‌దానంతా జైల్లోనే ఉంటూండెరా భయ్. నాకు ఇంకొక్క గిన్నిస్ రికార్డ్ కూడా ఉన్నదిరా భయ్. జైల్లో ఉండే బయట ఎనిమిది మర్డర్లు జేసినా! వరల్డ్‌లో గట్ల జేసెడిది ఎవడితోటి కాలే!"

మళ్ళా మా అపార్ట్‌మెంట్ లేడీస్, పిల్లలు, యూత్ తప్పట్లు కొట్టారు.

"నామీద మర్డర్ కేస్‌లు, రేప్ కేస్‌లు, కిడ్నాప్ కేస్‌లు, లాండ్ గ్రాబింగ్ కేస్‌లూ, బ్లాక్‌మెయిలింగ్ కేస్‌లూ.. ఇన్నున్నాగానీ కాంగ్రెసోళ్ళు, తెలుగుదేశమోళ్లు, బీజేపీ వోళ్ళు, కమ్యూనిస్టోళ్ళు జైలులో నా సెల్ ముందు లైన్ కట్టిన్రు.

అన్నా! నువ్వే వచ్చే ఎలక్షన్స్‌లో మా పార్టీ కాండేట్‌గా ఎన్నికల్లో పోటీ చేయా లని కాళ్ళమీద పడిన్రనుకో!"

మళ్ళీ మేమంతా హాపీగా తప్పట్లు కొట్టి ఈలలు వేశాం.

"నే ఆళ్ళందరికీ ఒక్కటే జెప్పినా! ఇగో- నా మీదా, నా ఖాన్‌దాన్ మీదున్న కేస్ లన్నీ మాఫ్ జేస్తానని ఎవడు నాకు రైటిం గ్‌లో ఇస్తే ఆడి పార్టీల జేర్తా- అన్నా!

అరె నీయవ్వ.. అందరూ రాసిచ్చిన్రురా భయ్! ఇంకేం జెయ్యాలో సమజ్ కాక లాటరీ ఏసినా! నేను జైల్లోపటే ఉంటినా? నా చెంచాలు ఇంటింటికీ తిరిగి చాకు

చూపించి మంచిగ ప్రచారం జేసిన్రు! అరె నీయవ్వ.. పబ్లిక్ నాలాంటి దాదాలను ఎంత లైక్ సేస్తున్రో నాక ప్పుడు సమజయింది! లక్షన్నర ఓట్ల మెజార్టీతో గెలిచినారా భయ్. అది గూడా ఎవళ్ళ మీద గెలిచినా? ఆడె వడో పెద్ద సదువులు సదివిన మేధా వంట! ఆడి మీద ఒక్క పోలీస్ కేస్‌భీ లేదంట! వాని ఖాన్‌దానంతా ఫ్రీడమ్ ఫైటర్లంట! నువ్వేమయిన జెప్పు, ఆ పాగల్‌గాడిని చూస్తే నాకు జాలేసిం దిరా భయ్. గసంటోళ్ళు ఏడనో కొలు వులు జేసుకు బ్రతకాలె. ఆళ్ళకు పాలి ట్రిక్సెందుకు?"

మళ్ళా అందరూ తప్పట్లు కొట్టాం!

"సార్! ఈ ఎలక్షన్స్‌లో మిమ్మల్ని మళ్ళా గెలిపిస్తే మీరు మాకోసం ఏం జేస్తారు?"




"ఇగో మీలో ఎవడు ఏ కేస్ మీద జైలుకి పోయినాగాని 24 గంటల్లో నేను జామీ నిచ్చి ఇడిపిస్తా! ఇదివరకే క్రిమినల్ కేస్ కింద బుక్కయినోళ్ళందరినీ సిఆర్‌ఎస్ స్కీమ్ కింద ఇంటికి పంపిస్తా"

"సిఆర్‌ఎస్ స్కీమ్ అంటే ఏంది సార్?" అడిగాడు విజయ్‌యాదవ్.

"అరె నీయవ్వ! సిఆర్‌ఎస్ అంటే ఎరు కలేదా? అన్ని పార్టీవాళ్ళూ పవర్లోకొచ్చాక పైసలు దండుకొనికి పెడతారురా భయ్ బిఆర్‌ఎస్ స్కీమ్ అని. గంటే బిల్డింగ్ రెగ్యులరైజేషన్ స్కీమ్- అంటే ఏందన్నట్లు- ప్లాన్ శాంక్షన్ లేకుండా భూమి నీదికాక పోయినా గానీ, కబ్జాచేసి ఇల్లు కట్టినా వనుకో.. దానిని రెగ్యులరైజ్ జేయాలి కదా! గట్లనే క్రైమ్ చేసినోళ్ళందరూ గూడా క్రైమ్ రెగ్యులరైజేషన్ స్కీమ్ కింద అప్లయ్ జేస్తే పైసల్దీసుకుని మొత్తం కేస్‌లన్నీ మాఫ్ జేస్తామన్నట్లు!"

అందరం మళ్ళీ తప్పట్లు కొట్టాం! మా అపార్ట్‌మెంట్స్‌లోని గాళ్స్ కొంతమంది వేదికమీదకు దూసుకెళ్ళి గూండారెడ్డి ఆటో గ్రాఫ్‌లు తీసుకుని ఫొటోలు దిగారు.

"ఇంకోముచ్చటేందంటే టెన్త్ క్లాస్‌కెల్లే కొత్త కంప్యూటర్ కోర్స్‌లు షురూ జేయిస్తా- ఆ కోర్స్‌ల్లో ఏం ట్రైనింగ్ ఇస్తరంటే- ఎటి ఎం కార్డ్ ఫ్రాడ్ ఎట్లా జేయాలె! క్రెడిట్ కార్డ్ ఫ్రాడ్ ఎట్లాజేయాలె! చేసినాక ఎట్ల పట్టుబడకుండా ఉండాలె! బాంక్ ఎకౌం ట్స్‌లో వేరేవోళ్ళ ఎకౌంట్స్‌లోని డబ్బు మన ఎకౌంట్స్‌లోకి ఆన్‌లైన్‌లో ఎట్లా ట్రాన్స్‌ఫర్ జేసుకోవాలె! ఇవన్నీ నేర్పిస్తే ఇంక మనస్టేట్‌ల నిరుద్యోగం ఏడుందిరా భాయ్"

అందరూ 'జయహో' అని అరిచాం!

అక్కడితో ఆ రోజు కార్యక్రమం ముగి సింది.

గూండారెడ్డి వెళ్ళేటప్పుడు మా ప్రెసి డెంట్ హమీద్‌మియాని పక్కకు పిలి చాడు. "ఇగో హమీద్‌భాయ్, మీ అపార్ట్

మెంట్ లేడీస్ వింగ్ ప్రెసిడెంట్ పేరు షైనీ గదా! దాన్ని నాతోటి సెటిలవమని జెప్పు! దాన్ని నాకు పర్మనెంట్‌గా సెటప్ జేసినావనుకో మీ కాలనీకి రెండు కోట్లు డొనేషన్ ఇస్తా"

హమీద్ షాకయ్యాడు.

"దేఖోసాబ్! ఇది ఫస్ట్‌టైమ్, ఎం.ఎల్.ఏ కేండేట్ గిసంటి డిమాండ్ చేసెడిది! ఇది డిగ్నిఫైడ్ పీపుల్ ఉండే కాలనీ ఉన్నయ్. గసంటి దందాలు ఎవ్వరూ చెయ్యవ్"

గూండారెడ్డి పగలబడివ్వాడు.

"ఏందిరో! నాకు లెసనిస్తున్నావ్! పైసల్దీసుకుని ఓటేయటం మన స్టేట్‌లో కాలనీలన్నింటికి ఆదత్ జేసిందెవళ్ళు? మా రాజకీయ నాయకులేకదా! మీ కాలనీలో ఉండేటోళ్ళందరూ డిగ్నిఫైడ్ పీపులన్నావ్. మేము పైసల్దీసుకోకుడా ఓటేస్తాం అని ఎవళ్ళయినా అంటున్రా! పైసల్దగ్గర బుద్ధి గడ్డి తినేప్పుడు లేని డిగ్నిటీ పడుకోనికి అడ్డమెందుకొస్తున్నదిరా భయ్"

మా అందరికీ అతని మాటలతో రక్తం ఉడికిపోయింది. అదే ఇంకొకళ్ళెవరయినా ఆ మాటంటే దుమ్ము లేపేవాళ్ళం.

కానీ వాడు మన ప్రజలందరి ప్రతినిధి! వాడికే మనం ఓట్లేసి గెలిపిస్తున్నాం. ప్రజాస్వామ్యం పేరుతో లుచ్ఛా పనులన్నీ వాళ్ళు చేయిస్తూంటే హ్యాపీగా చూస్తున్నాం. వాళ్ళు గల్లీకొక వైన్‌షాప్, రోడ్డుకొక బెల్ట్‌షాప్, లొకాలిటీకొక బ్రోతల్ హౌస్, దానిపక్కనే గాంబ్లింగ్ హౌస్- ఇవన్నీ వాళ్ళే ప్రారంభోత్సవాలు చేస్తుంటే పోటీలుపడి వెళ్ళి వాళ్ళను పూల దండలతో ముంచెత్తుతున్నాం.

ఆ మర్నాడు రెండోపార్టీ అభ్యర్థి మా అపార్ట్‌మెంట్‌కొచ్చాడు. అతని కారువెనుక వందకార్లు వచ్చి మా రోడ్లంతా బ్లాక్ చేసేశాయ్.

దండలేసే కార్యక్రమం అయ్యాక 'మీట్ యువర్ ఓటర్' కార్యక్రమం మొదలయింది.

"సార్, మీ పార్టీ అధికారంలో ఉన్నప్పుడు యాభైవేల కోట్లు అవినీతి జరిగిందని మీడియా అంటోంది" అడిగాడు చౌదరి.

"నో! యూ ఆర్ రాంగ్! యాభైవేల కోట్లు కాదు, అరవై వేల కోట్లు ఫ్రాడ్ చేశాం!"

అందరూ ఆనందంతో తప్పట్లు కొట్టి ఈలలు వేశారు.

"మరి మీరు అవినీతిలో గిన్నిస్ రికార్డ్ బ్రేక్ చేయలేదా? "

"చేశాంగానీ మా రికార్డ్‌ని మేమే బ్రేక్ చేశాంగనుక ఆ ఉత్సవాలు చేయలేక పోయాం!"

ఏదేమయినా ఈసారి అధికారంలోకొస్తే లక్షకోట్ల అవినీతిని టార్గెట్‌గా పెట్టుకున్నాం"

అందరూ చాలాసేపు తప్పట్లుకొట్టి హర్షధ్వానాలు చేశారు.

"ఎలా తయారయారు జనం! లక్షకోట్ల అవినీతిని టార్గెట్‌గా పెట్టుకున్నామని వాడు చెప్తుంటే వీళ్ళు తప్పట్లు కొడుతున్నారు" అంటూ గొణుక్కుంటున్నాడు శంకరమూర్తి.

షైనీ లేచి నిలబడింది

"గెలిచాక మీరు ప్రజలకోసం ఏం చేయబోతున్నారు? "

"చెప్పానుకదమ్మా! లక్షకోట్ల అవినీతి మా ప్రభుత్వం టార్గెట్ అని"

"అవినీతివల్ల మీకు లాభం గానీ మా ప్రజలకేమిటి లాభం? "

"ఆమాత్రం మీలాంటి ఎడ్యుకేటెడ్‌కి తెలీ లేదంటే నాకు చాలా షాకింగ్‌గా ఉంది. అవినీతి అనేది ఎలా పుడుతుంది? ఏదయినా ఒక పని చేస్తేనే కదా అవినీతి పుట్టేది? మేము లక్షకోట్ల అవినీతిని టార్గె

ట్‌గా పెట్టుకున్నామంటే కనీసం వెయ్యి కోట్ల అభివృద్ధయినా జరుగుతుంది కదా! ఆ అభివృద్ధి వల్ల లాభం ప్రజలకే కదా!"

అందరూ మళ్ళీ తప్పట్లు కొట్టారు.

"సార్, ఈసారి ఓటుకి ఎంత డబ్బివ్వబో తున్నారు? "

"ఎడ్యుకేటెడ్ ఓటర్లకయితే ఓటుకి రెండువేల రూపాయల వరకూ ఖర్చుబెట్టా లనుకుంటున్నా! అదే కూలీనాలీ జనం ఓటుకి అయిదువందల కంటె ఎక్కువ ఇవ్వదల్చుకోలేదు"

"అదేమిటి? చదువుకున్నోడి ఓటుకి అంత ఎక్కువ ఎందుకు ఇవ్వాలనుకుంటు న్నారు? "

"ఎందుకంటే చదువుకున్నోడు అందరి దగ్గరా డబ్బు తీసుకుని తనకు నచ్చిన పార్టీకి వేసే అవకాశం ఉంది! అందుకే వాడికి రెండువేలిచ్చి, ఎలక్షన్ రోజున ఉదయం వాడింటికెళ్ళి వాడి వేళ్ళన్నిటికీ ఇంక్ గుర్తులు పెట్టేస్తాం! దానివల్ల వాడి ఓటు మాకు పడదుగానీ ఎవడికీ పడ కుండా ఆపుతామన్నమాట"

అందరూ మళ్ళీ తప్పట్లు కొట్టారు.

"సార్ మీరు గెలుస్తే కిలో బియ్యం ఎంతకిస్తారు? "

"మేము గెలిచిన మొదటిరోజునుంచే కిలో బియ్యం వందరూపాయలు చేస్తాం"

అందరం షాకయిపోయాం.

"అదేంటి సార్! అందరూ కిలో బియ్యం రూపాయికీ లేదా అసలు ఉచితంగా ఇస్తా మంటూంటే మీరు వందరూపాయలు అంటారేంటి? "

"మీ అపార్ట్‌మెంట్ ఓటర్లు మరీ బ్యాక్ వర్డ్‌లాగున్నారు. వందరూపాయలకు కిలో బియ్యం ఎప్పుడు చేయగలం? ప్రజలం దరూ కూడా అవినీతిపరులయి, లక్షలు లక్షలు సంపాదించే అవకాశాన్ని మా ప్రభుత్వం కల్పిస్తుంది. మరి ప్రజల దగ్గర అంత అవినీతిసొమ్ము ఉన్నప్పుడు వంద రూపాయలు కిలో బియ్యానికి ఖర్చు చేయ డానికేమయింది? ప్రపంచంలోకెల్లా అతి పెద్ద పర్చేజింగ్ పవర్ ఉన్న దేశంగా మనది అభివృద్ధి చెందుతుంది గనుక మన ఎకానమీ కూడా బ్రహ్మాండంగా ఉంటుంది"

"కానీ ప్రజలందరికీ అవినీతి సంపాదన ఎలా వస్తుంది సార్? "

ప్రభుత్వం లక్షకోట్ల అవినీతిని టార్గెట్‌గా పెట్టుకున్నప్పుడు 'పర్ కాపిటా ఫ్రాడ్' కూడా ఆటోమేటిగ్గా పెరిగిపోతుందని మా పార్టీ ఆర్థికనిపుణులు అంటున్నారు- ఎక్స్ పెరిమెంట్ చేసి చూద్దాం! మనకు నష్టం లేదుగా. అయితే వరల్డ్‌లో నెంబర్‌వన్ అవుతాం.. లేకపోతే మరో ఇథియోపియా అవుతాం, అంతేకదా? " అందరూ మళ్ళీ తప్పట్లుకొట్టారు.

ఇలా నాలుగు రోజులు గడిచాక నలు గురు అభ్యర్థుల దగ్గర్నుంచీ మా అపార్ట్ మెంట్ వాళ్ళు యాభై లక్షలు తీసుకుని రెండువేల ఓట్లు అమ్మడానికి నిశ్చయించు కున్నారు.

ఓట్లు అమ్ముకున్న డబ్బుతో ఆ రాత్రి మా కమిటీ మెంబర్స్ అందరం మందు పార్టీ చేసుకున్నాం.

బాగా మందెక్కువయి పోయేసరికి శంక రమూర్తి ఏడుపు మొదలెట్టాడు.

'ఒరేయ్ హమిద్‌మియా! మా ఓట్లకు మంచి రేటే ఇప్పించావ్‌గానీ, ఇంకొంత కాలం మనం ఈ ప్రజాస్వామ్యాన్నే నమ్ము కుంటే మన ప్రజలందరూ తాగుబోతులు, వ్యభిచారులు, అవినీతిపరులు, దొంగలు, మర్డరర్లు, కిడ్నాపర్లుగా తయారయిపోవటం ఖాయం రా!'

అతను ఏడుస్తూ మాట్లాడుతుంటే మేమందరం ఆ స్పీచ్‌ని ఎంజాయ్ చేయటం మొదలుపెట్టాం.

ఊరిబయట బావి తవ్విస్తున్న ముట్లూరి కోటివీరయ్య - మంగమ్మ దంపతులు తమ పొలంలో నీళ్లు పడలేదని తెలిసి కుప్పకూలిపోయారు.. అప్పుడే పట్నం నుంచి వచ్చిన వెంకటేశ్వర్లు ఆ బావిని చూసి అద్భుతమైన విషయం బయటపెట్టాడు. దీంతో తాము కోటీశ్వరులు కాబోతున్నామని తెలిసి, వాళ్లు తెగ సంబరపడ్డారు. కోటివీరయ్యే కాదు.. అతనిలాంటి రైతులెందరో బాగుపడిపోయారు.. దరిమిలా ఆ ఊరి ముఖచిత్రమే మారిపోయింది.. నడమంత్రపు సిరి నరాలమీది కురుపు అన్నట్లు ఎదుగుతున్న మనుషులతో పాటు కొత్తసమస్యలూ పెరిగాయి..

ఆధునిక కాలంలో గ్రామాల తలరాతలు అనూహ్యంగా మారిపోయి, కొత్త కొత్త సమస్యలకు ఎలా ఆజ్యం పోస్తున్నాయో తెలియజెప్పే వాస్తవిక నవల వాణిశ్రీ **రంగురాళ్లు** మే చతుర కానుక!



**శి**వరాత్రి వెళ్ళిపోయింది. 'శివ శివా' అనుకుంటూ చలి పారిపోయింది. ఎండలు ముదురుతున్నాయి.

ఊరికి మైలు దూరంలో వుంది ముట్లూరి కోటివీరయ్య పొలం. అక్కడ బావి తవ్విస్తున్నాడు. పొద్దున్నే వచ్చిన వడ్డెరోళ్ళు గునపాలతో మట్టి తవ్వి, తట్టలతో ఎత్తిపోస్తున్నారు. కోటివీరయ్య పొలం గట్టున చింతచెట్టు కింద నులక మంచం మీద కూర్చుని చుట్టకాలుస్తున్నాడు.

దూరంగా ఏనుగులు బారులుతీరినట్లుగా కొండలు పడుకుని వున్నాయి. అక్కడక్కడ జొన్నచేలు ఏపుగా పెరిగున్నాయి. పత్తి, మిరపచేలు బోసిగా వున్నాయి. ముట్లూరి కోటివీరయ్య పొలానికి ఆనుకుని వున్న పొలంలో కల్లూరి కనకయ్య పత్తికట్టెలు పీకిస్తున్నాడు.

మధ్యాహ్నం కావస్తోంది. వడ్డెరోళ్ళు చింతచెట్టు కిందకొచ్చి కూర్చుని, తెచ్చుకున్న మూటలు విప్పి అన్నం తినడానికి సిద్ధమయ్యారు. అన్నంలో పండుమిరపకాయల పచ్చడి కలుపుకుంటుంటే ఆ వాసన కోటివీరయ్య ముక్కుకి తగిలి నోట్లో నీళ్ళూరాయి.

'మంగమ్మ ఇంకా రాలేదేంది? ఈపాటికి రావాలే' అనుకున్నాడు. అందరూ తింటుంటే అతనికి ఆకలి ఎక్కువైంది.

కోటివీరయ్య మంగమ్మ కోసం ఎదురు చూస్తుంటే ఇంతలో కల్లూరి కనకయ్య వచ్చి కూర్చుని క్యారేజీ విప్పాడు. పండుమిరప, గోంగూరతో తొక్కిన పచ్చడిలో నెయ్యి పోసుకుని అన్నం కలుపుకుంటున్నాడు కనకయ్య. ఆ వాసనకి పిచ్చెక్కిపోయింది కోటివీరయ్యకి.

"ఏంది మావా? అత్త ఇంకా రాలేదు? " అన్నాడు కనకయ్య.

"ఏందోరా? ఈపాటికి వొచ్చేదే? "

పత్తికట్టె పీకుతున్న కూలీలు గూడా వచ్చి కూర్చుని అన్నాలు తింటున్నారు.

"ఏరా కనకయ్యా? పత్తి అమ్మేశావా? " అడిగాడు కోటి వీరయ్య.

"ఆఁ. అమ్మేశా!"

"రేటు బాగొచ్చిందా? ఎంత మిగిలిందేం? "

"నా బొంద మిగిలింది. అప్పులు మిగిలాయి"

"అదేందిరా? గుంటూర్లో బాగానే వుందన్నారే!"

"మనం అమ్మిన తర్వాత వుంటది మావా! అక్కడంతా మోసం. కల్లాల్లో పంటున్నప్పుడు రేటుంటది. మనం తోలు కెళ్ళేటప్పటికి రేటుండదు. ఏందో? ఏమీ అర్థం కాదు" అన్నాడు కనకయ్య

అంతా అన్నాలు తిని పనుల్లో పడ్డారు. కోటివీరయ్యకి కడుపులో నకనకలాడుతోంది. ఇంకా క్యారేజీ తీసుకురాని పెళ్ళాం మీద మండుకొస్తోంది.

చాలా సేపటి తర్వాత మంగమ్మ హడావుడిగా వచ్చింది క్యారేజీ పట్టుకుని.

"ఏందే నీయమ్మ! ఇంతసేపు ఎక్కడ చచ్చావే!" అన్నాడు కోటివీరయ్య మంగమ్మ మీద మండిపడుతూ.

"ఎంకటేసులొచ్చాడయ్యా! ఆడికి అన్నం పెట్టొస్తున్నా? " అన్నది మంగమ్మ క్యారేజీ విప్పుతూ.

"ఏ ఎంకటేసులే? "

"మా గోవిందమ్మప్ప కొడుకు. మాచెర్లలో సర్కారు నౌకరీ చేస్తండ్లా! ఆడు"

"ఏంటంట? ఆడికి మనూళ్ళో ఏం పనేం? "

"రేపు ఎన్నికలంటగా! ఆడికి మనూళ్ళో డూటీ ఏశారంట. ఆడితోపాటొచ్చినోళ్ళంతా బళ్ళో వున్నారంట. పోలీసులు గూడా వొచ్చారయ్యో!"

"పోలీసోళ్ళు లేకుండా ఎన్నికలు ఎట్టా

జరుగుతాయ్! సుబ్బారెడ్డి మడుసులు మనల్ని ఓటెయ్యనిత్తారంటే నీ పిచ్చిగాని"

"సీనివాసులు నాయుడు మాత్తరం తక్కువేందీ? "

"ఎంకటేసుల్తో పాటొచ్చినోళ్ళు అన్నం యాడ తింటన్నారే పాపం? "

"చౌక దుకానం మిర్యాల నరసయ్య వొండిచ్చి పెడతాడంటలే."

"ఎందుకు పెట్టడ్లే? కిర్సనాయిలు పోసే దుందా పాడా? లారీలోళ్ళకి అమ్ముకుని సంపాదిత్తున్నాడుగా? "

"ఎవడిసావు ఆడిని సావనీ! మరి బతికే దెట్టా? "

"ఎంకటేశుల్ని ఈడకి రమ్మనకపోయావా? "

"తిని పడుకున్నాడు. ఈడకి రాడానికి లారీ ఎక్కిచ్చారంట. ఎండకి మాడాడంట. వత్తాడ్లే!" అన్నది మంగమ్మ.

కోటివీరయ్య అన్నం తిని చుట్ట కాల్చుకుని నులకమంచం మీద అడ్డం పడ్డాడు.

సాయంకాలమవుతుండగా "ఈర య్యోయ్!" అనే కేకలు వినిపించాయి బావి తవ్వుతున్న చోటనుంచి.

"బాయిలో రాళ్ళు పడ్డాయి" అంటూ వడ్డెరోళ్ళు గుంటలో నుంచి బైట కొచ్చారు.

కోటి వీరయ్య గుండెలో రాయిపడింది.

"రాళ్ళు పడ్డం ఏందిరా? నీళ్ళు పడాలి గాని" అంటూ బావి తవ్వుతున్న చోటుకి హడావుడిగా వెళ్ళాడు.

వడ్డెరోళ్ళు గుంపుగా చేరి రాతిపలకల్ని విడ్డూరంగా చూస్తున్నారు. కల్లూరి కనకయ్య చేలో పత్తికట్టెలు మోపులు చేస్తున్న కూలీలు గూడా వచ్చారు.

ఇక ముట్లూరి కోటీవీరయ్యకి ఏడుపే తక్కువ. పత్తి, మిరప పంటల్లో ఒడిదొడుకులు తట్టుకోలేకపోతున్నాడు. రోజురోజుకీ పెరిగిపోతున్న విత్తనాల రేట్లు, ఎరువులు, పురుగుమందులు ధరలతో గిట్టుబాటు కావడంలేదు. ఏయేటికాయేడు అప్పులు పెరిగిపోతున్నాయే గాని తరగడంలేదు. బ్యాంకుల్లో అప్పులు తేవడం, పంట అమ్మినప్పుడు వచ్చిందాన్ని జమచేయడం, మళ్ళీ బ్యాంక్ స్టాఫ్‌కి లంచాలు ఇచ్చి రుణాలు రీషెడ్యూల్ చేయించుకోవడం ఇదే వరస.

ఆమధ్య నాగిరెడ్డి కొడుకు పెళ్ళికి నారాకోడూరు వెళ్ళాడు. ఆ వూళ్ళో వాళ్ళంతా కూరగాయలు పండిస్తున్నారు. పొలాల్లో పందిళ్ళు వేసి కాకర, దొండ, పొట్ల పాదులు పాకించి వాటిని అమ్ముకుంటు న్నారు. గుంటూరు కూరగాయల మార్కెట్ బ్రోకర్లొచ్చి కొనుక్కుపోతు న్నారు. రైతులు ఎక్కడికీ పొయ్యేపనే లేదు. రోజూ డబ్బులే. దర్జాగా సంపాదించుకుంటున్నారు రైతులు. రెండెకరాల్లో కూరగాయలు పండించినా చాలు కుటుంబం గడిచిపోతున్నాది.

ముట్లూరి కోటి వీరయ్యని కూరగాయల సేద్యం ఆకర్షించింది. నారాకోడూర్లో రెండెకరాలున్నోడు, పల్నాడులో పాతిక ఎకరాల మెట్టపొలం వున్నోడికంటే హాయిగా వున్నాడు. నాగిరెడ్డి వియ్యంకుడు దొండ పాదులు పాకిస్తే ఐదారేళ్ళయినా పంట మార్చే పనేలేదన్నాడు. రెండు రోజుల కొకసారి తట్టలకొద్దీ కాయలు కోసుకుని అమ్ముకోవడమే అని చెప్పాడు. ఐతే నీటి వసతి వుండాలి.

ఊరి కొచ్చిన కోటివీరయ్య కళ్ళల్లో నారాకోడూరు కూరగాయల పొలాలే కళ్ళల్లో మెదులుతున్నాయి. ఇకతను పొలంలో బావి తవ్వించాలని నిర్ణయించుకున్నాడు. బ్యాంకులో అప్పు దొరికే పరిస్థితి లేదు. గ(రె చౌడయ్య శెట్టిని బతిమాలి డబ్బులు అప్పు తెచ్చాడు. బావి తవ్వించడం మొదలుపెట్టాడు. వడ్డెర్ల మేస్త్రి వీరాస్వామికి అడ్వాన్సు ఇచ్చి నీళ్ళు పడగానే మొత్తం ఇచ్చేస్తానని ఒప్పించాడు. ఇప్పుడు నీళ్ల

బదులు రాళ్ళు పడ్డాయి.

ముట్లూరి కోటివీరయ్య నులక మంచంలో అడ్డంపడ్డాడు. మంగమ్మ ఏడుస్తూ కూర్చుంది. వాళ్ళిద్దర్నీ ఓదారుస్తు న్నాడు కల్లూరి కనకయ్య. అక్కడ మూగిన వడ్డెర్లు, కూలీలు అతన్ని జాలిగా చూస్తున్నారు. పాపం వీరయ్యకి ఎంత కష్టం, ఎంత నష్టం అనుకుంటున్నారు.

అప్పుడు దూరంగా అటువైపు వస్తున్న అట్లూరి వెంకటేశ్వర్లుని చూస్తూ "ఎవరో వత్తన్నారు" అన్నాడు వడ్డెర్ల వీరాస్వామి.

"ఎవుడ్రా వచ్చేది? " అని లేచి కూర్చు న్నాడు కోటివీరయ్య.

"మనోడే ఎంకటేసులు" అన్నది మంగమ్మ.

అట్లూరి వెంకటేశ్వర్లు వస్తూనే "ఏంది బాబాయ్? బాగున్నావా? " అన్నాడు.

కోటివీరయ్య తల వూపాడు.

"ఏంది బాబాయ్ అదోమాదిరిగా వుండావ్? బావి తవ్విస్తన్నావంటనే? నీళ్ళు పడ్డాయా? " అని అడిగాడు.

"నీళ్ళు కాదురా, రాళ్ళు పడ్డాయి" విచా రంగా చెప్పాడు కోటివీరయ్య.

"రాళ్ళు పడితే ఏంది బాబాయ్! మందు పెట్టి పేలిస్తే రాయి పగిలి నీళ్ళు పడ తాయి" అన్నాడు అట్లూరి వెంకటేశ్వర్లు ధైర్యం చెప్తూ.

"పడింది కొండరాయిలా లేదండి. పల కలు పలకలుగా వున్నాయండి. నాపరా ళ్ళేమో? " అన్నాడు వడ్డెర వీరాస్వామి.

"ఏందీ నాపరాళ్ళా! పద చూద్దాం" అన్నాడు వెంకటేశ్వర్లు ఆశ్చర్యంగా.

వీరాస్వామి పలకగా వున్న మందపాటి రాయిని అందించాడు. వెంకటేశ్వర్లు దాన్ని పట్టుకుని అటూ ఇటూ తిప్పాడు. తర్వాత బావి తవ్వుతున్న గుంటలోకి దిగి పరిశీ లించాడు.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. పడమర ఎర్రబడుతోంది.

"ఇక పదండి పోదాం" అన్నాడు వెంకటే శ్వర్లు. రాతిపలక తీసుకుని బయల్దేరాడు. అంతా ఊరివైపు నడుస్తున్నారు.

"ఆ బండరాయెందుకురా అక్కడ పారేసి రాక? " అన్నాడు ముట్లూరి కోటివీరయ్య అక్కసుగా.

అట్లూరి వెంకటేశ్వర్లు నవ్వి వూరుకు న్నాడు.

ఊరి దగ్గర కొచ్చాక ఎటువాళ్ళటు వెళ్లి పోయారు.

ఇంటికొచ్చేసరికి చీకటి పడింది.

అది తాతలనాటి మట్టిమిద్దె. చుట్టు ఇంట్లో కోడలు శశిరేఖ వంట మొదలు పెట్టింది. కొడుకు పెదసాంబయ్య వాళ్ళకి ఎదురొచ్చాడు. వెంకటేశ్వర్లుని పలకరిం చాడు.

"అన్నా! శ్రీనివాసులు నాయుడ్ని గెలి పించాల" అన్నాడు.

"నాదేముందిరా వూళ్ళో వాళ్ళు ఓట్లేస్తే గెలుస్తాడు. లేకపోతే పోతాడు" అన్నాడు వెంకటేశ్వర్లు నవ్వుతూ.

"అదేందన్నా అట్టా అంటావు? నువ్వే నంటగా ఎలక్షను ఆఫీసరు? " అన్నాడు పెద సాంబయ్య.

"నేనైతే ఏందిరా? నా ఇష్టమా? ఎట్టా బడితే అట్టా గుద్దితే ఉద్యోగం ఊడుద్ది" అన్నాడు.

"నీ చేతిలో ఆ రాయేందన్నా? " అడి గాడు పెదసాంబయ్య.

"ఓరి సాంబయ్యా! నీ పంట పండిం దిరా! మీ చేల్లో రంగు రాయి పడింది" అన్నాడు అట్లూరి వెంకటేశ్వర్లు.

పెద సాంబయ్య ఆశ్చర్యపోయాడు వెంకటేశ్వర్లు చెప్పింది విని.

"అంటే ఏందన్నా! మాచెర్ల నాపరాయి లాంటిదా? "

"నాపరాయేందిరా? దాని తాత.

గ్రానైట్ రాయి రా!"

కోటివీరయ్య వచ్చి "అదేం రాయి రా? " అన్నాడు.

"బాబాయ్! గ్రానైట్ రాయి పాలిష్ చేసి పెద్ద పెద్ద బిల్డింగులకు నేల మీద పరుస్తారు. చాలా ఖరీదైందిలే" అన్నాడు.

"ఐతే మనం తవ్వుకొని అమ్ముకోవచ్చంటరా? " ఆశతో అన్నాడు కోటివీరయ్య.

"అదంతా మనకెందుకు బాబాయ్! ఎకరం ఇన్ని కోట్లు అని అమ్మేసుకుంటే సరి"

"కోట్లా? " అని నోరు తెరిచాడు ముట్లూరి కోటివీరయ్య.

"కోట్లే మరి! ఇక నువ్వు కోటీశ్వరుడివి బాబాయ్. ఇందాక ఆళ్లంతా ఉండారని చెప్పలా" అన్నాడు వెంకటేశ్వర్లు.

"ఏందన్నా! నువ్వు చెప్పేదంతా నిజమేనా? " ఆశ్చర్యపోతూ అడిగాడు పెద సాంబయ్య.

"మీకే తెలుసుద్దిలేరా! నేను హైదరాబాద్ వెళ్లి మైనింగ్ డైరక్టర్‌తో మాట్లాడతాను. వాళ్ళ మనుషులొచ్చి అంతా చెప్తారు. అదంతా తర్వాతలే. నేను స్కూల్లో పడుకోవాలి. ఇక బయల్దేరతా!" అన్నాడు వెంకటేశ్వర్లు.

"అన్నం తినకుండా ఎక్కడికన్నా, నువ్వొచ్చావని కోడిని కోస్తే! ఏమే శశిరేఖా! తొందరగా వంట కానీ! అన్న ఎల్తాడంట" అన్నాడు పెదసాంబయ్య.

★ ★ ★

మైనింగ్ అండ్ జియాలజీ డైరెక్టరేట్ నుంచి ఆఫీసర్లు కారులో మునికొండ వచ్చారు. ఊరి పంచాయతీ ఆఫీసు ముందు కారు ఆగింది.

సర్పంచ్ శ్రీనివాసులు నాయుడు, కొందరు వార్డు మెంబర్లు పంచాయతీ ఆఫీసులో ఉన్నారు.

"ముట్లూరి కోటి వీరయ్య పొలం ఎక్కడుందయ్యా? " అడిగారు.

సర్పంచ్ శ్రీనివాసులు నాయుడు వాళ్ళని పంచాయతీ ఆఫీసులోకి ఆహ్వానించి కూర్చోబెట్టాడు.

మైనింగ్ అండ్ జియోలజీ ఇంజనీర్లు విషయం చెప్పారు.

"సార్! మీరు అక్కడికి వెళ్ళడానికి దారి లేదు. డొంకదారిలో నడిచిపోవాలి. కారు వెళ్ళదు" అన్నాడు.

ముట్లూరి కోటి వీరయ్య పొలంలో గ్రానైట్ రాయి పడిందని తాటాకు మంటలా వూరందరికీ తెలిసిపోయింది.

"వీడికి కోటి వీరయ్యని పేరెవరు పెట్టారో గాని నిజంగానే కోటీశ్వరుడైపోయాడురా!" అనుకున్నారు ఊళ్ళోవాళ్ళు.

తర్వాత కోటి వీరయ్య పొలం దగ్గరికి తారురోడ్డు వేశారు. పొలంలో తవ్వకాలు మొదలయ్యాయి. ఎర్త్‌మూవింగ్ మెషినరీలు పెద్ద శబ్దం చేస్తూ పన్లు మొదలుపెట్టాయి.

కుగ్రామమైన మునికొండ రూపురేఖలు మార్చుకుని శరవేగంతో అభివృద్ధి పథంలోకి దూసుకుపోతున్నది.

మునికొండ కొండల దగ్గరున్న పోరంబోకు ఇప్పుడు ప్రభుత్వానికి బంగారమైంది. గ్రానైట్ కంపెనీలకు లీజుకిచ్చి కోట్లు ఆదాయం గడిస్తోంది.

గ్రానైట్ కంపెనీలు ముందు రేకుల షెడ్స్‌లో ఆఫీసులు మొదలు పెట్టినా తర్వాత పక్కా బిల్డింగులు కట్టుకున్నాయి.

హౌసింగ్ బోర్డ్ వంద ఎకరాలలో ఎమ్.ఐ.జి., ఎల్.ఐ.జి., ఇ.డబ్ల్యు.యస్. అని పేర్లు పెట్టి ఇళ్ళ నిర్మాణం మొదలు పెట్టింది.

మునికొండకి చుట్టుపక్కల లేబర్ కాలనీలు వెలిశాయి. మొదట్లో ట్యాంకులతో నీళ్లు సరఫరా చేసేవారు. తర్వాత పంట కాలువ నుంచి నీళ్ళు మళ్ళించి మంచినీటి



రిజర్వాయర్ ఏర్పాటు చేశారు. ఇంటింటికీ కుళాయిలు వచ్చాయి. పూరిళ్ళు, పెంకుటిళ్ళు మాయమైపోయాయి.

నేషనల్ హైవే నుంచి మునికొండకి నాలుగు లేన్ల తారురోడ్డు పడింది. కార్లు, లారీలు తీరిక లేకుండా తిరగసాగాయి.

లింబారెడ్డి కల్లు కాంపౌండ్ ఏర్పాటు చేశాడు. దానికి దగ్గర్లోనే వైన్‌షాపు, బారు లింబారెడ్డే పెట్టించాడు.

ఒకప్పుడు మునికొండ పొలాలలో పత్తి, మిరప, జొన్న, సజ్జ పంటలు పండేవని పాత తరంవాళ్లు చెప్పుకోవడం.. ఈ తరం వాళ్ళు వినడం జరుగుతోంది.

★ ★ ★

హైదరాబాద్ నుంచి వచ్చిన ఎక్స్‌ప్రెస్ బస్ మునికొండ ఆర్టీసీ బస్టాండ్‌లో ఆగింది.

చెన్నకేశవులు బస్సు దిగాడు. అతని చేతిలో ట్రావెలింగ్ బ్యాగ్ మాత్రమే ఉంది. లాంజ్‌లో డబ్బులు కట్టి తనకిచ్చిన పడక కుర్చీలో బ్యాగ్ పడేశాడు.

అప్పుడు ఉదయం ఏడు గంటలైంది.

బాత్‌రూమ్‌లో బ్రష్ చేసుకుని కాలకృత్యాలు తీర్చుకున్నాడు. స్నానం చేసి డ్రెస్ మార్చుకున్నాడు. బాగా ఆకలిగా ఉంది.

లాంజ్ కౌంటర్లో కూర్చున్న కుర్రాడిని అడిగాడు.

"ఆర్టీసీ కేంటీన్లో టిఫిన్ బాగుంటుందా? "

"చండాలం" ఒక్కముక్కలో చెప్పాడు.

చెన్నకేశవులికి నవ్వొచ్చింది.

"బైట శంకరవిలాస్‌లో బాగుంటుంది" చెన్నకేశవులు అడక్కుండానే చెప్పాడు.

ఆర్టీసీ బస్టాండ్ కాంపౌండ్ దాటి రోడ్డు మీదకు వచ్చాడు. రోడ్డుకు అటూ ఇటూ కమర్షియల్ కాంప్లెక్సులు, షాపులు ఉన్నాయి. బట్టల షాపులు, చెప్పుల షాపులు, సూపర్ మార్కెట్లు, హోటళ్ళు వెలిశాయి. రోడ్లమీద ఆటోలు, కార్లు తిరుగుతున్నాయి. అప్పుడప్పుడూ బస్సులు లోపలకొస్తున్నాయి.

పదేళ్ళ క్రితం మునికొండ ఒక పల్లెటూరు. ఇప్పుడు పట్నం. పల్లె అదృశ్యమైంది.

ఇప్పుడు ఆర్టీసీ బస్టాండ్ వున్న ఏరియా ఒకప్పుడు చెరువు. దాని ఒడ్డునే శివాలయం ఉండాలి. చెరువుని పూడ్చినట్లే శివాలయాన్ని గూడా పడగొట్టారేమో? అనిపించింది. రోడ్డు మీద నడుచుకుంటూ కొంతదూరం వెళ్ళాడు. శివాలయం సింహద్వారం కనిపించింది. ప్రహరీగోడలు పగలగొట్టి సింహద్వారానికి అటు ఇటు షాపులు కట్టారు.

చెన్న కేశవులు హోటల్లో టిఫిన్ తిని గుడిలోకి వెళ్ళాడు. క్యూలో నిలబడడానికి రెయిలింగ్ దగ్గరికి వెళ్లాడు. పెద్దగా జనం లేరు.

రెయిలింగ్ ప్రవేశం దగ్గర నడివయసు సెక్యూరిటీ గార్డు వున్నాడు.

"టిక్కెట్? " అన్నాడు.

"టిక్కెట్టా? " ఆశ్చర్యపోయాడు చెన్నకేశవులు.

సెక్యూరిటీ గార్డు బోర్డు చూపించాడు. దర్శనం పది రూపాయలు, కొబ్బరికాయకి ఐదు రూపాయలు, అభిషేకం, అష్టోత్తరం ఇలా రేట్ల పట్టిక కనిపించింది.

"మా చిన్నప్పుడు దేవుడి దర్శనానికి డబ్బులు తీసుకోలేదే? గుడికి వస్తే బాదం ఆకునిండా పులిహోర, దద్దోజనం, చక్కెర పొంగలి ప్రసాదం పెట్టేవాళ్ళు. పండగలకి భోజనాలు పెట్టేవాళ్ళు" అన్నాడు చెన్నకేశవులు.

సెక్యూరిటీ గార్డు నవ్వాడు.

"అప్పుడు దేవుడికి మాన్యం వుండేది. ఆదాయం వస్తుండేది. ధర్మకర్తలు ఇంట్లో డబ్బు గూడా తెచ్చి గుళ్ళో ఖర్చుపెట్టే

వాళ్ళు"

"ఇప్పుడేమైంది? "

"ఇప్పుడు గుడి గవర్నమెంటు నడుపుతోంది. ఆఫీసర్లు వుంటారు. ధర్మకర్తలూ ఉంటారు. వాళ్ళంతా రాజకీయ నాయకులు. గుడి మాన్యాలు ఎక్కడున్నాయో తెలీదు. ఎవరెవరో స్వాహా చేశారు. దేవుడి భూమిలో గూడా గ్రానైటు రాళ్ళు పడ్డాయని, కోట్లు వచ్చాయనీ అంటారు. ఇప్పుడు మాత్రం డబ్బిస్తేనే దేవుడి దర్శనం" అని నవ్వాడు సెక్యూరిటీ గార్డు.

తను చిన్నప్పుడు ఎప్పుడు బడితే అప్పుడు గుడికి వెళ్ళేవాడు. ఎగిరెగిరి గంటలు కొట్టేవాడు. నంది కొమ్ములమీద నుంచి శివలింగాన్ని చూసేవాడు, విభూతి పెట్టుకునేవాడు. ఇప్పుడు శివలింగాన్ని చూట్టానికి డబ్బులివ్వాలా?

ఇలా ఎందుకు మారిపోయింది?

చెన్నకేశవులు గుడిలోకి వెళ్ళదల్చుకోలేదు. మండపంలోకి వెళ్ళి స్తంభానికి ఆనుకుని కూర్చున్నాడు. తను మునిపల్లె వదిలి వెళ్ళినరోజు గుర్తొచ్చింది.

చెన్నకేశవులు ఎనిమిదో క్లాసులో వున్నప్పుడు తండ్రి సూర్యనారాయణ టి.బి. వచ్చి చనిపోయాడు. తల్లి వరమ్మ పొలం పనులకు పోయేది. మిరపనాట్లకి, పత్తి కొయ్యడానికి. అప్పుడప్పుడూ మట్టితట్టలు మోసేది. పొలాల్లో పనులు ఎప్పుడూ ఉండేవి కావు. సర్పంచ్ శ్రీనివాసులు నాయుడు ఇంట్లో పనికి కుదిరింది. కొన్నాళ్ళు బాగానే గడిచింది. తను పదో క్లాసులో వున్నప్పుడు వరమ్మను పోలీసులు పట్టుకెళ్ళారు.

శ్రీనివాసులు నాయుడింట్లో సత్యనారాయణ వ్రతం జరిగింది. చాలామంది ఆయన చుట్టాలొచ్చారు. అప్పుడే ఆయన భార్య కాసులపేరు దొంగతనం జరిగింది. వరమ్మే తీసి వుంటుందని పోలీసులకు అప్పజెప్పారు.

తల్లి స్టేషన్ బైటకు వస్తుందేమోనని అక్కడే ఎదురు చూస్తుండేవాడు. పొద్దున వెళ్ళి చీకటిపడిన దాకా వుండి వచ్చేవాడు. లోపల నుంచి తల్లి ఏడుపు వినిపిస్తుండేది. బైట తను వెక్కివెక్కి ఏడుస్తుండేవాడు.

మూడు రోజుల తర్వాత తల్లి శవం బైట పడేశారు. పెద్దమ్మ అన్నమ్మ పోలీసులు చంపేశారని గొడవ చేసింది. శ్రీనివాసులు నాయుడు ఖర్చులకు డబ్బులు ఇచ్చాడు. తల్లిని పూడ్చిపెట్టిన తర్వాత చెన్నకేశవులుకి పోలీసుల మీద కసి పెరిగిపోయింది. తల్లిని వాళ్ళే చంపారనే విషయం మర్చిపోలేకపోయాడు.

**కొసమెరుపు...**

**భూమి గుండ్రంగా ఉందా?**
**బల్లపరుపుగా ఉందా?**
**రెండూ కాదు..**
**ధనవంతుడి పరుపులా ఉంది**

*- గరిమెళ్ల నాగేశ్వరరావు,*
కొమ్మాది, విశాఖపట్నం

ఒకరోజు మోటారు సైకిలు మీద ఇన్స్పెక్టర్ వూళ్ళోకి వచ్చాడు. రచ్చబండ దగ్గర ఎందుకో జనాల్ని లాఠీతో చితకబాదుతున్నాడు. చెన్నకేశవులు ఆవేశం ఆపుకోలేకపోయాడు. పెద్ద గులకరాయి తీసుకుని ఇన్స్పెక్టర్‌కి గురిచూసి కొట్టాడు. తల పగిలి 'అమ్మా' అని అరిచి కిందపడిపోయాడు.

ఇక చెన్నకేశవులు పొలాల వెంటబడి పారిపోయాడు. రోడ్డెక్కి అక్కడ ఆగివున్న లారీపైకెక్కి దాక్కున్నాడు. తెల్లారేసరికి లారీ హైదరాబాద్ వెళ్ళి ఆగింది.

లారీలో వున్న లోడ్ దింపడానికి క్లీనర్

పైకెక్కాడు. అప్పటికి ఇంకా చెన్నకేశవులు నిద్రలేవలేదు.

"ఎవడ్రా నువ్వు? " అని లారీక్లీనర్ నిద్ర లేపాడు.

"అన్నా! మాది మునికొండన్నా! మా నాన్న చచ్చిపోయాడు. మా అమ్మని పోలీసులు చంపేశారు" అని ఏడ్చాడు.

క్లీనర్‌కి జాలి కలిగింది. అదొక ట్రాన్స్‌పోర్ట్ ఆఫీసు. మేనేజర్ దగ్గరికి తీసుకెళ్ళి చెన్నకేశవులు గురించి చెప్పాడు. 'సరే, మన ఆఫీసులో వుండనీ' అని పదిరూపాయలు ఇచ్చి టిఫిన్ తినమన్నాడు.

అది అబ్దుల్ కరీమ్ ట్రాన్స్‌పోర్ట్ ఆఫీస్. లారీలు, బస్సులు వున్నాయి. ఆఫీసులో కొన్నాళ్ళున్నాక అక్కడ ఊరకనే వుండబుద్ధి కాలేదు. లారీ మీదకి వెళ్తానన్నాడు. క్లీనర్‌గా పని చేస్తూ డ్రైవర్ ఖాదర్ దగ్గర డ్రైవింగ్ నేర్చుకున్నాడు. డ్రైవర్‌గా లైసెన్స్ తెచ్చుకుని కొన్నేళ్ళు దేశమంతా తిరిగాడు.

మునికొండ నుంచి గ్రానైట్ లోడులు హైదరాబాద్‌కి రెగ్యులర్‌గా వుంటున్నాయి. అక్కడే ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ ఆఫీసు బ్రాంచి పెట్టాల్సిన అవసరం కలిగింది. అబ్దుల్ కరీమ్ చెన్నకేశవుల్ని పిలిచి అక్కడ బ్రాంచి చూసుకోమని పంపించాడు. పదేళ్ళ నుంచి తమ దగ్గరే పనిచేస్తున్న చెన్నకేశవులంటే అతనికి గురి కుదిరింది. కొంచెం చదువుకున్నవాడు, ఆఫీసు పని, డ్రైవింగ్, మెకానిజం తెలిసిన ఆల్‌రౌండర్‌గా చెన్నకేశవులకి ట్రాన్స్‌పోర్ట్ కంపెనీలో పేరుంది. మునికొండ బ్రాంచి సమర్ధవంతంగా నడపడానికి చెన్నకేశవులే సరైన మనిషి అని అబ్దుల్ కరీమ్‌కి అపార విశ్వాసం. కరీమ్ మాట కాదనకుండా పదేళ్ళ క్రితం తను పారిపోయి వచ్చిన స్వగ్రామం తిరిగివచ్చాడు చెన్నకేశవులు. ఇప్పుడు అక్కడ గ్రామం అదృశ్యమైపోయి పది ఆమడల పట్నమైంది.

★ ★ ★

ఆ రోజు ఆదివారం

శిల్ప బార్ అండ్ రెస్టారెంట్‌కి వచ్చిన వాళ్ళని వెనక్కి పంపించి వేస్తున్నారు సెక్యూరిటీ గార్డులు. ఆ రోజు బార్‌కి సెలవు అని చెప్తున్నారు.

'అదేంటయ్యా బాబూ! ఆదివారం సెలవెందుకిచ్చారు? ఈ రోజు బిజినెస్ బాగా వుంటుంది కదా? ' అని వచ్చిన కస్టమర్లు అడుగుతుంటే 'ఏమో మాకు తెలియదని' చెప్పలేక చస్తున్నారు గార్డులు.

ఐతే లోపల బార్ నడుస్తూనే వుంది. ఆ రోజు అందులో సీట్లన్నీ పొట్లూరి సింగయ్య నాయుడు బుక్ చేసేశాడు. ఆయన ఇచ్చిన పాస్‌లు చూపించిన వారికే అందులో ప్రవేశం. అదొక ఓపెన్ సీక్రెట్ మీటింగ్.

గ్రానైట్ కంపెనీ యజమానుల మీటింగ్ జరుగుతోంది. పొట్లూరి సింగయ్యానాయుడు మునికొండలో ప్రముఖ గ్రానైట్ వ్యాపారి మాత్రమే కాదు. సిట్టింగ్ ఎమ్మెల్యే పొట్లూరి శ్రీనివాసులు నాయుడుకి స్వయానా తమ్ముడు గూడా. బార్ మొత్తం ఆ రోజుకి బుక్ చేశాడంటే కొన్ని లక్షల బిల్లు పేమెంట్ చేస్తున్నాడన్న మాట. ఎన్ని కోట్లు సంపాదించినా వూరికే డబ్బు ఖర్చు పెట్టడానికి సింగయ్య నాయుడు పిచ్చోడేం కాదు.

రాత్రి ఎనిమిదింటికంతా గ్రానైట్ కంపెనీల యజమానులంతా దాదాపు హాజరయ్యారు.

సింగయ్యానాయుడు మైక్ ముందుకు వచ్చి "ఫ్రెండ్స్, నా ఆహ్వానం మన్నించి పార్టీకి వచ్చినందుకు అందరికీ థాంక్స్. మీ అందరికీ తెలుసు ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్ రెండు వందల కోట్లు ఖరీదు చేసే గ్రానైట్ రాయికి టెండర్ పిలిచింది. మన ఇండియాలో హైదరాబాద్‌కి సమీపంలో

# పుస్తక చరిత్ర






జర్మనీలో అచ్చు యంత్రం కనిపెట్టాక, మానవజాతికి ఎంతో మేలు జరిగింది. ఈ అచ్చు యంత్రం ద్వారా మనిషి విద్యావంతుడుగా మారే అవకాశం ఎక్కువైంది. ఆసియావాసులకన్నా యూరోపియన్లు ఆ అవకాశాన్ని చక్కగా వినియోగించుకున్నారు.

అయితే అచ్చు యంత్రం కనిపెట్టకముందు కూడా పుస్తకాలు అనేకం ఉన్నాయి. ప్రపంచంలోని మొట్టమొదటి అచ్చు పుస్తకం చైనాలో మే 11న క్రీ.శ. 868లో తయారైంది. భారతదేశపు యాగ సూత్రాలకి ఇది చైనీస్ అనువాదం. ఆరు కాగితాల్లో దీన్ని ముద్రించారు. ముఖచిత్రంగా బుద్ధుడి బొమ్మని వాడారు.




పారిస్‌లోని ఓ మ్యూజియంలో అరుదైన పుస్తకం వుంది. ఈ పుస్తకంలోని కాగితాలని వెనక కాంతిని వుంచి చదువవచ్చు లేదా నల్లటి కాగితం వుంచినా అక్షరాలు కనిపిస్తాయి. 15వ శతాబ్దంలో ఫ్రెంచి చర్చి మతాధికారులు దీన్ని అచ్చువేసారు. దీన్లో క్రీస్తు బోధనలు ఉంటాయి.

మాస్కోలోని పాలిటెక్నికల్ మ్యూజియంలో ఓ అపూర్వమైన పుస్తకం ఉంది. దీని కాగితాలని సాలెగూటి దారంతో కుట్టడం విశేషం. ఆ దారం మందం 0.002 మిల్లీ మీటర్లు.

కొన్ని పుస్తకాలని అచ్చువేసే బదులు పేజీలమీద అక్షరాలని అల్లారు. 1894లో టోక్యోలో తయారైన ఇలాంటి పుస్తకం పేరు ఫేబుల్స్ (నీతి కథలు). ఇది ప్రస్తుతం మాస్కోలోని స్టేట్ హిస్టారికల్ లైబ్రరీలో ఉంది.

16వ శతాబ్దంలో జర్మనీలో చేత్తో రాసిన క్రిస్టియన్ మత గ్రంథం 'ది గాస్పెల్'లో 41 చిన్న బొమ్మలు ముద్రించారు. దీన్ని లండన్‌లో 11.8 లక్షల డాలర్లకి వేలంలో కొన్నారు.

బల్గేరియాలోని గాబ్రోవోలోహసాఫ్ సెటైర్ అండ్ హ్యూమర్ అనే జోక్స్ బుక్‌ని రూపొందించారు. ఇనుప రేకులని పేజీలుగా వాడిన అందులో 22 పేజీలు మాత్రమే ఉన్నాయి. దీని బరువు నాలుగు కిలోలు.

అమెరికాలో సువాసనలు వెదజల్లే పుస్తకాలు తయారవుతాయి. ఏదిఏమైనా ప్రపంచంలో అధికంగా అమ్ముడయ్యే పుస్తకం, ఉచితంగా ఇవ్వబడే పుస్తకం కూడా బైబిల్ కావడం విశేషం. ఇది అనేక పరిమాణాల్లో లభిస్తోంది.

వున్నది మనమే. గ్రానైట్ గూడా నాణ్యమైనది. ట్రాన్స్‌పోర్టు మనకి చౌక. రాజస్థాన్ వంటి వారికి ట్రాన్స్‌పోర్టే ప్రాబ్లమ్. మనతో ఎటూ పోటీ పడలేరు. అందువల్ల మనలో మనం పోటీ పడకుండా సిండికేట్ అవుదాం" అన్నాడు.

అంతా చప్పట్లు కొట్టారు.

"ఇప్పుడు మన గెలాక్సీ గ్రానైట్ కంపెనీ ప్రొప్రయిటర్ పోలిశెట్టి సత్యనారాయణ పాట మొదలు పెడతాడు" అని పొట్లూరి సింగయ్యనాయుడు కూర్చున్నాడు.

"నా పాట పదికోట్లు" అని పోలిశెట్టి సత్యనారాయణ మొదలు పెట్టాడు.

కాసేపటికి సింగయ్యనాయుడు పాడిన ముప్పై కోట్ల దగ్గర ఆగింది. టెండర్ వేసే అధికారం అతనిదే. ముప్పై కోట్లు మిగిలిన గ్రానైట్ వ్యాపారులు పంచుకుంటారు. తలా పాతిక లక్షలు వస్తాయని అంచనా వేసుకుని పార్టీలో మునిగిపోయారు.

మర్నాడు సింగయ్యనాయుడు హడావుడిగా అన్న దగ్గరికి పరిగెత్తాడు.

శ్రీనివాసులు నాయుడు అసెంబ్లీ సమావేశాల్లో వున్నాడు. సెల్‌ఫోన్ పనిచెయ్యడం లేదు. ఎమ్మెల్యే క్వార్టర్స్‌లో ఆఫీసుకి వెళ్ళి కూర్చున్నాడు. పర్సనల్ సెక్రటరీ చాలాసార్లు ట్రై చేస్తే లంచ్‌టైమ్‌లో దొరికాడు. సెల్ ఆఫ్ చేసి అసెంబ్లీలో కూర్చున్నానని చెప్పాడు. అక్కడే క్యాంటీన్‌లో భోజనం చేసి వుండు, నాలుగు దాటిన తర్వాత వస్తానన్నాడు.

సింగయ్యనాయుడు అన్న రాకకోసం ఎమ్మెల్యే క్వార్టర్స్‌లోనే కూర్చున్నాడు. ఐదు గంటలకు ఆఫీసుకి వచ్చాడు. అప్పటికే చాలామంది ఆయన కోసం ఎదురు చూస్తున్నారు.

తమ్ముణ్ణి చూడ్డంతోటే "ఏంట్రా అర్జెంట్? " అన్నాడు.

"ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్ టెండర్ గురించి అన్నా!"

"ఔను. చెప్పావుగా! ఏమైంది. అక్కడంతా సిండికేట్ అవ్వాలా? " అడిగాడు శ్రీనివాసులు నాయుడు.

"అందరూ ఓకే. చింతలపూడి సుబ్బారెడ్డి రాలేదన్నా" చెప్పాడు సింగయ్యనాయుడు.

"వాడితో తలనొప్పిగా ఉందిరా!"

"ఔనన్నా!"

"ఏం చేద్దాం? "

"నువ్వొచ్చి మాట్లాడితే బాగుంటది. అందుకే నేనేం కదపలా!"

"ఏమంటాడు? టెండర్ వేస్తాడంటనా? "

"వెయ్యాలనేకదా, సిండికేట్ మీటింగ్‌కి రానిది. పదిసార్లు ఫోన్ చేయించినా! రాలేదు. సిండికేట్ ఐతే మనకి బాగా మిగులుద్ది. వాడు అడ్డం వస్తే ఏమౌతుందో? టెండర్ వాడు ఎంతకేస్తాడో? కొటేషన్ తెలియదు. వాడికే టెండర్ వస్తే మనకి చాలా లాస్ అన్నా!" చెప్పాడు సింగయ్యనాయుడు.

శ్రీనివాసులునాయుడు నవ్వాడు.

"చెప్పి చూద్దాం. నేను వస్తాలే. రెండు రోజుల్లో అసెంబ్లీ అయిపోతుంది. వచ్చేటప్పుడు ఫోన్ చేస్తా!"

"ఇయ్యన్నీ ఫోన్లో చెప్పడం బాగుండదని నేనే వచ్చా"

"మంచిపని చేశావు" అన్నాడు ఎమ్మెల్యే.

★ ★ ★

తెల్లవారుజామున ఐదుగంటలు.

చెన్నకేశవులు సెల్ మోగింది. అతను గాఢ నిద్రలో ఉన్నాడు. ఆగి ఆగి మోగుతోంది. బద్ధకంగా కళ్ళు విప్పాడు. సెల్ బటన్ నొక్కి "హలో" అన్నాడు.

"భాయ్! రసూల్‌ని మాట్లాడుతున్నా!"

"ఏమైందిరా? "

"యాక్సిడెంటయింది భాయ్!"

"ఎక్కడ్రా? "

"మునికొండ క్రాస్ రోడ్డులో"

"లారీలో లోడుందా? "

"ఖాళీనే"

"అరె బేవకూఫ్. హైద్రాబాద్ నుంచి వచ్చేటప్పుడు ఖాళీగా రావొద్దని ఎన్నిసార్లు చెప్పాను? "

"ఖాళీగా రాలేదు భాయ్! మాచెర్లలో ఆటా లోడ్ దించి, అక్కడ్నుంచి ఖాళీగా వస్తున్నాను. అన్నీ మునికొండకే లోడ్ దొరకాల్నంటే ఎట్టన్నా? "

"సరే.. సరే. యాక్సిడెంట్ సంగతి చెప్పు? ఎవరైనా చచ్చారా? "

"ఏమోనన్నా! కారువెనుక వస్తున్నా! వాడు సడెన్‌గా బ్రేక్ వేశాడు. లారీ గుద్దింది. నేను బ్రేక్ కొట్టినా!"

"నువ్వెక్కడున్నావు? "

"నేను క్లీనర్ కుర్రాడు హైదరాబాద్ పోతున్నాం"

"పొద్దున్నే తలనొప్పి తెచ్చావు కదరా? " అన్నాడు చెన్నకేశవులు విసుగ్గా.

కళ్ళు మూసుకుని పడుకున్నాడు. మళ్ళీ నిద్ర పట్టలేదు. మునికొండలో ట్రాన్స్‌పోర్ట్ ఆఫీసు తెరిచి గ్రానైట్ లోడులు రెగ్యులర్‌గా హైదరాబాద్‌కి తోలుతున్నాడు. అక్కడ్నుంచి ఏదొక లోడ్‌తో తిరిగి వస్తుంటాయి.

ఎకౌంట్స్ రాయడం, బ్యాంకులో డబ్బులు వెయ్యడం, తియ్యడం లాంటివాటికి చెన్నకేశవులు తన పెద్దమ్మ కొడుకు సత్యాన్ని పెట్టుకున్నాడు. డబ్బులతో వ్యవహారాలకి నమ్మకమైన వాడిని పెట్టుకోమని కరీం సూచించాడు. చుట్టమైతే అవకతవకలు చెయ్యడని నమ్మాడు. సత్యంగూడా సిన్సియర్‌గా చేస్తున్నాడు. వాడికింకా పెళ్ళి కాలేదు. కాకపోతే అప్పుడప్పుడు కొంచెం ఎక్కువ తాగుతాడు. అటువంటప్పుడు చెన్నకేశవులు చనువుగా తిడతాడు. సత్యం 'తప్పయిందన్నా' అని ఒప్పుకుంటాడు. అదే చెన్నకేశవులుకి నచ్చింది.

ఇక లారీలకు రిపేర్లు చేయించడం, ఇంజనాయిలు మార్పించడం, రీబోర్‌లన్నీ చెన్నకేశవులు స్వయంగా పెద్దిరెడ్డి గ్యారేజీలో చేయిస్తాడు.

ఆఫీస్ ఓపెన్ చేశాక యాక్సిడెంట్ జరగడం ఇదే మొదటిసారి. అందుకే కొంచెం టెన్షన్‌గా వుంది.

తెల్లవారింది.

పోలీసుల నుంచి ఫోన్ వస్తుందేమోనని ఆఫీసులో కూర్చున్నాడు. లాయర్‌కి ఫోన్ చేసి యాక్సిడెంటయిన సంగతి చెప్పాడు.

"డ్రైవర్ పారిపోయాడన్నారుగా, బెయిలిప్పించే పని ఇప్పుడు లేదు. తర్వాత ఎప్పుడో వచ్చి లొంగిపోయాక చూద్దాంలెండి. ఇప్పుడేం వర్రీ లేదు" అన్నాడు లాయర్.

సత్యం ఆఫీసులోకి వస్తూనే "అన్నాయ్! సుబ్బారెడ్డి యాక్సిడెంట్‌లో పోయాడంట" అన్నాడు.

"ఏ సుబ్బారెడ్డిరా? "

"కనకదుర్గ గ్రానైట్ కంపెనీ సుబ్బారెడ్డి"

'కొంపదీసి సుబ్బారెడ్డికి యాక్సిడెంట్ చేసింది రసూల్ నడుపుతున్న లారీ కాదు గదా? '

చెన్నకేశవులు గుండె గుభేలుమన్నది.

మెరుపు...

**నిన్ను నువ్వు**
**కోల్పోయినప్పుడు**
**నీకు నీకన్నా శత్రువు**
**మరొకడుండడు**

-అద్దంకి శ్రీనివాస్,
హైదరాబాద్



"మన లారీ ఒక కారుకి యాక్సిడెంట్ చేసిందని డ్రైవర్ రసూల్ ఫోన్ చేశాడ్రా! ఆ కారు సుబ్బారెడ్డిదేమో?" అన్నాడు చెన్నకేశవులు.

"క్రాస్ రోడ్డు దగ్గర యాక్సిడెంటయిందని చెప్పుకుంటున్నారు. పోలీసులు బాడీని పోస్ట్‌మార్టమ్ రిపోర్టు కోసం పంపించారంట. ఈ రోజు గ్రానైట్ కంపెనీలన్నీ మూసేశారు. క్వారీల దగ్గరగూడా పని బంద్ చేశారంట. ఈ రోజు మనకి లోడులు ఉండవు" అన్నాడు సత్యం.

"లోడ్‌లు లేకపోతే కొంపలు మునగవు లేరా! అసలు సుబ్బారెడ్డికి యాక్సిడెంట్ చేసింది మన లారీనేనా, కాదా? తెలుసుకోవాలి" అని పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేశాడు చెన్నకేశవులు.

పోలీసు స్టేషన్లో రైటర్ చెప్పింది విని నిర్ఘాంతపోయాడు. అది కరీమ్ ట్రాన్స్‌పోర్ట్ లారీనే.

చెన్నకేశవులు బైక్‌మీద మునికొండ క్రాస్ రోడ్డుకి బయల్దేరాడు. యాక్సిడెంట్ స్పాట్ బీభత్సంగా వుంది. కారు నుజ్జునుజ్జయింది. అక్కడ ఇద్దరు కానిస్టేబుల్స్ మాత్రమే ఉన్నారు. సుబ్బారెడ్డితో పాటు కారు నడుపుతున్న డ్రైవర్‌గూడా చనిపోయాడని చెప్పారు.

అక్కడ్నుంచి పోలీస్ స్టేషన్‌కి వెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్ ఆఫీసులోనే తన రూమ్‌లో ఉన్నాడు. 'రంగూన్ రామారావు, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్' అని నేమ్‌ప్లేట్ గూడా ఉంది.

"నమస్తే సార్! నేను చెన్నకేశవుల్ని, కరీం ట్రాన్స్‌పోర్ట్ మేనేజర్ని" అన్నాడు.

"తెలుసు... తెలుసు... మీ ఆఫీసు ఓపెనింగ్‌కి నన్ను పిలిచారు. కూర్చోండి" అన్నాడు నవ్వుతూ.

"క్రాస్‌రోడ్డులో యాక్సిడెంట్ చేసింది మా లారీనే. కనకదుర్గ గ్రానైట్ కంపెనీ ప్రొప్రయిటర్ సుబ్బారెడ్డి పోయాడని తెలిసింది సార్!"

"ఔను కదూ! డ్రైవర్ని లొంగిపొమ్మనండి. కేసు కోర్టుకి పంపిస్తాం. తర్వాత బెయిల్ మీద రావొచ్చు"

"డ్రైవర్ పారిపోయాడు సార్!"

ఇన్‌స్పెక్టర్ నవ్వాడు.

"వాడి భయం వాడిది. ఇటువంటప్పుడు పారిపోవడం మామూలే. లారీ తీసుకుపోండి. నో ప్రాబ్లమ్." అన్నాడు.

చెన్నకేశవులుకి ఆశ్చర్యం కలిగింది. యాక్సిడెంట్ జరిగితే పోలీసులు సతాయిస్తారు. డబ్బులు ఇవ్వమని డిమాండ్



చేస్తారు. అదేం లేకుండా లారీ తీసుకుపొమ్మని అనేశాడు.

"సరే సార్! థ్యాంక్స్" అని చెప్పి వచ్చేశాడు.

ఆఫీసుకి వచ్చిన తర్వాత వేరే డ్రైవర్ని పంపించి లారీ తెప్పించి షెడ్‌కి పంపించాడు.

ఇంతలో అబ్దుల్ కరీం ఫోన్ చేశాడు.

"పోలీసోళ్లకి డబ్బులిచ్చి లారీ తెప్పించు. రసూల్ అన్నీ చెప్పాడు. ఇప్పుడు నా దగ్గరే వున్నాడు. వాడు నాదేం తప్పు లేదంటున్నాడు" అన్నాడు కరీం.

"లారీ తెప్పించాను. పోలీసులు డబ్బులేం అడగలేదు. లారీకి పెద్దగా ఏం కాలేదు. బంపర్ దగ్గర దెబ్బలు తగిలాయి. అంతా బాగానే ఉంది" అన్నాడు చెన్నకేశవులు.

"పోలీసులు డబ్బులు అడగలేదా? అట్లా వుండదే. ఎంతో కొంత ఇవ్వు. తర్వాత తలనొప్పి వాళ్లతోటి"

"మీరేం వర్రీ కాకండి. ఇన్‌స్పెక్టర్‌తో నేనే మాట్లాడాను. ఆయనేమీ అడగలేదు. అడగకుండా ఇస్తే ఆయన ఏమంటాడో? బాగుండదు కదా? "

"ఆ ఇన్‌స్పెక్టర్ పిచ్చోడా ఏం? "

"ఎవరి పిచ్చి వారికి ఆనందం. రెండు

రోజులు పోయాక రసూల్‌ని పంపండి. ఇక్కడ స్టేషన్లో లొంగిపోతాడు. వాడి ఫ్యామిలీ కూడా ఇక్కడే వుంది కదా? "

"సరే!" అన్నాడు అబ్దుల్ కరీమ్.

సత్యం టీవీలో మునిగిపోయాడు.

"అన్నాయ్! సుబ్బారెడ్డి డెడ్‌బాడీ తీసుకొస్తున్నారంట. టీవీలో చూపిస్తున్నారు" అన్నాడు.

చెన్నకేశవులు టీవీ వైపు చూశాడు.

సుబ్బారెడ్డి డెడ్‌బాడీని తెచ్చి గ్లాస్ చాంబర్‌లో వుంచారు. అతని భార్య, కూతురు రోదిస్తున్నారు. బంధుమిత్రులు మౌనంగా నిల్చుని విచారం వ్యక్తం చేస్తున్నారు.

★ ★ ★

సుబ్బారెడ్డి యాక్సిడెంట్‌లో చనిపోవడం మునికొండలో సంచలనం రేపింది. ఊళ్లో మొదటినుంచి చింతలపూడి కుటుంబానికి, పొట్లూరి కుటుంబానికి పడదు. తాతల కాలం నుంచి చెరొక కులానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. అయితే పొట్లూరి వారికి వూళ్లో కులం బలం ఉంది. చింతలపూడి వారి కుటుంబాలన్నీ స్థితిమంతులేగాని వూళ్లో కొన్ని కుటుంబాలకే పరిమితం. అందువల్ల ఎప్పుడూ పొట్లూరి వారే ఎలక్షన్లలో గెలుస్తూ వస్తున్నారు. ఆ విధంగా శ్రీనివాసులునాయుడు సర్పంచ్ నుంచి నెమ్మదిగా సమితి ప్రెసిడెంటూ ఆ తర్వాత ఎమ్మెల్యే అయ్యాడు.

ఊరి పొలాల్లో గ్రానైట్ గనులు బైటపడడంతో చాలామంది శ్రీమంతులైనారు. శ్రీనివాసులునాయుడు సర్కారు భూములు నామమాత్రపు లీజుకు తీసుకుని, సీనరేజి చార్జీలు చెల్లించకుండా మేనేజ్ చేస్తూ గ్రానైట్ బిజినెస్‌లో చక్రం తిప్పసాగాడు. వాళ్ళ కుటుంబంలో అందరి పేర్లతోనూ గనులున్నాయి. రాజకీయ అధికారం కలిసొచ్చింది.

ఐనా సుబ్బారెడ్డి ప్రతిపక్షంలో వుండి అడుగడుగునా అడ్డుతగులుతూ తన ప్రయత్నం చేస్తూనే వున్నాడు. ఏదో ఒక నాటికి అధికార పార్టీ కష్టాల్లోపడి తను అనూహ్యంగా ఎమ్మెల్యే అవుతాడని గట్టి నమ్మకం.

అందుకే సింగయ్యనాయుడికి టెండర్ల విషయంలో కలసిరాలేదు. ఎమ్మెల్యే పిలిచి చెప్పినా సుబ్బారెడ్డి ససేమిరా అనడంతో యాక్సిడెంట్ చేయించి వుంటారని ప్రతిపక్షం ఆందోళనకి దిగింది.

సుబ్బారెడ్డి శవయాత్ర సందర్భంగా వూళ్లో బంద్ జరిగింది. అంతా స్వచ్ఛందంగా దుకాణాలు, వ్యాపారసంస్థలు మూసేశారు. సినిమా హాళ్లల్లో ఆటలు నడవడంలేదు.

మెయిన్‌రోడ్డులో వూరేగింపు జరుగుతున్నప్పుడు భారీగా బందోబస్తు ఏర్పాటుచేశారు పోలీసులు.

"సుబ్బారెడ్డి అమర్ రహే!"

"శ్రీనివాసులునాయుడు నిరంకుశత్వం నశించాలి"

"యాక్సిడెంట్ గురించి సి.బి.ఐ. ఎన్‌క్వయిరీ వేయించాలి"

"దోషుల్ని కఠినంగా శిక్షించాలి"

సుబ్బారెడ్డి వర్గీయులు నినాదాలు చేసుకుంటూ ఊరేగింపులో ఉద్రిక్తత సృష్టించారు. పొట్లూరి కుటుంబానికి చెందిన సినిమా హాళ్లు, హోటళ్లు, ఆఫీసులు వచ్చినప్పుడు రాళ్ళు రువ్వారు. అద్దాలు పగలగొట్టారు.

అధికారపక్షం పార్టీ ఆఫీసు వచ్చినప్పుడు జెండా వున్న వైపును విరగొట్టి, దిమ్మెను ధ్వంసం చేశారు.

తర్వాత ఏమీ కాలేదు.

గ్రానైట్ వ్యాపారులకు సుబ్బారెడ్డికి జరిగిన యాక్సిడెంట్ గురించి అనుమానాలున్నా ఎవరూ నోరు మెదపలేదు. అప్ప

నంగా వచ్చిన డబ్బు వారి నోరు మూయిం చింది.

పొట్లూరి సింగయ్యనాయుడుకే ఇంటర్నే షనల్ ఎయిర్‌పోర్టుకి గ్రానైట్ కాంట్రాక్ట్ దక్కింది.

మరొకమారు శిల్పా బార్ అండ్ రెస్టా రెంట్‌లో తోటి వ్యాపారస్తులకు గ్రాండ్‌గా డిన్నర్ ఏర్పాటైంది. మద్యం ఏరులై పారింది. హైదరాబాద్ నుంచి వచ్చిన డ్యాన్సర్లు అర్ధరాత్రి వరకు అర్ధనగ్న, ముప్పావు నగ్న నృత్యాలు చేశారు. డబ్బుకి మంచినీళ్లకి తేడా తెలియకుండా ఖర్చయి పోయింది.

పార్టీ ఆఫీసు దగ్గర జెండాపైపు, దిమ్మె పగిలిపోయిన ముక్కలు అట్లాగే వున్నాయి. కొత్త దిమ్మె కట్టలేదు. పార్టీ జెండా ఎగరేయలేదు.

ఎందువల్ల?

సత్యాన్ని అడిగాడు చెన్నకేశవులు.

"మళ్ళీ గొడవలు జరిగేవరకూ అంతే అన్నాయ్! " అన్నాడు సత్యం.

"మళ్ళీ గొడవలు జరుగుతాయా? ఎందుకు? " ఆశ్చర్యంగా అడిగాడు చెన్నకే శవులు.

"గొడవలు ఎందుకు జరుగుతాయో తెలీదా? రోజూ టీవీ చూట్టం లేదా? పేపరు చదవడంలేదా? ప్రభుత్వాన్ని వ్యతి రేకించి బంద్‌లు చెయ్యడానికి, ధర్నాలు చెయ్యడానికి, ఆర్టీసీ బస్సులు తగలబెట్టడా నికి ఎన్నో కారణాలుంటాయి. గొంగట్లో తింటూ వెంట్రుకలు ఏరినట్టే అనుకో"

"అప్పుడేం జరుగుద్ది? "

"అపోజిషన్ పార్టీ ఆఫీసుమీద దాడి జరుగుద్ది. పార్టీ జెండా చిరుగుద్ది. దిమ్మె పగిలి ముక్కలవుతుంది. ఆ లీడర్ దిష్టి బొమ్మ తగలబెడతారు. ఆ తర్వాత ఇక్కడ కొత్త దిమ్మె కట్టి, జెండా ఎగరేస్తారు" చెప్పాడు సత్యం.

"అరే సత్యం. నీకు రాజకీయాల గురించి బాగా తెలుసురా. ఎప్పుడో నాయ కుడైపోతావేమో? " నవ్వుతూ అన్నాడు చెన్నకేశవులు.

"ఛీ.. నాకేం ఖర్మ? రాజకీయాల్లో చేర డానికి" అన్నాడు సత్యం.

"ఇందులో ఖర్మేం వుంది? అందరూ ఎందుకు చేరతన్నారు? మనం అందుకే" అన్నాడు చెన్నకేశవులు.

★ ★ ★

చెన్నకేశవులు ఆఫీసులో కూర్చుని సత్యం కోసం ఎదురుచూస్తున్నాడు. టైమ్ మూడు దాటింది. డబ్బు బ్యాంక్‌లో వేసి రావాలి. చెక్కు హైదరాబాద్ ఆఫీసుకి కొరియర్లో పంపాలి. బ్యాంక్ నాలుగింటికి క్లోజవుతుంది. కొరియర్ వాళ్లు ఏడుగం టల వరకు బుక్ చేసుకుంటారు.

అప్పుడు సెల్ మోగింది.

"అన్నాయ్! క్వారీలో యాక్సిడెంట్ జరి గింది. ముగ్గురు పోయారు. అందులో మన శివుడుగూడా వున్నాడు" సత్యం గొంతు బొంగురుపోయింది.

శివుడు సత్యం స్వంత తమ్ముడే. వాడికి చదువు అబ్బలేదని క్వారీలో పనికి పంపి చారు.

"అరెరె... ఎప్పుడు? ఎక్కడ? " అని వివరాలు తెలుసుకుని బయల్దేరాడు చెన్న కేశవులు.

క్వారీ దగ్గరికి వెళ్లేసరికి అక్కడంతా గుంపులుగా జనం మూగి వున్నారు. చెన్న కేశవులు పెద్దమ్మ అన్నమ్మ అతన్ని చూడ గానే పెద్దగా ఏడుస్తూ వాటేసుకుంది.

"శివుడు చచ్చిపోయాడ్రా కేశవులూ! చదువుకోవడంలేదని ఈ పనికి పంపిం చాడ్రా పెద్దోడు. ఈ పాడు పనికిపోయి చిక్కిపోయాడ్రా బిడ్డ! పాడైపోయాడ్రా! ఇంతకన్నా గుంటూరెళ్లి ఆటో తోలుకున్నా హాయిగా వుండేవోడురా బిడ్డ! చెట్టంత

శివుడు వల్లకాట్లోకి పోతున్నాడ్రా ఆడి బదులు నన్నన్నా తీసుకుపోలేదేరా దేవుడు"

అన్నమ్మ ఏడుస్తుంటే చెన్నకేశవులుకి దుఃఖం కలిగింది. కళ్లు తుడుచుకుని పెద్దమ్మని ఓదార్చాడు.

సత్యం క్వారీలో జరిగిన యాక్సిడెంట్ గురించి చెప్తున్నాడు. రాత్రి పెద్ద వర్షం కురిసి క్వారీపైన మట్టి, రాళ్లు బాగా తడిసిపోయాయి. క్వారీలో నిలబడిపోయిన నీళ్లు ఇంజన్‌తో తోడి పని మొదలుపెట్టారు. గట్టుపైన మట్టి జారి కింద పనిచేస్తున్న కూలీల మీద పడింది. కూరుకుపోయిన వాళ్లు చనిపోయారు. రాళ్ళదెబ్బలు తగిలిన వాళ్లు ప్రాణాలతో బైటపడ్డారు.

క్వారీ బైట అంబులెన్సులు నిలబడి వున్నాయి. దెబ్బలు తగిలిన వాళ్లని ఎక్కించి హాస్పటల్‌కి పంపిస్తున్నారు.

మట్టిపెళ్ల కింద ఇంకా ఎవరైనా వున్నారేమోనని తవ్వుతున్నారు. క్వారీలలో ఎవరూ పనిచేయడంలేదు. కటింగ్ మిషన్లు, పాలిషింగ్ యూనిట్లు మూతపడ్డాయి. అంతా విషణ్ణ వదనాలతో నిలబడిపోయారు.

ఆ క్వారీ సింగయ్య నాయుడి కంపెనీదే. తను హైదరాబాద్‌లో వున్నాననీ, పొద్దునకంతా వస్తానని చెప్పాడంటున్నారు. అక్కడ హడావుడి చేస్తున్న పొట్టి మనిషి బ్రహ్మయ్య అని సత్యం చెప్పాడు.

బ్రహ్మయ్య అన్నమ్మ దగ్గరికి వచ్చి అంబులెన్సులోకి ఎక్కిస్తుంటే చెన్నకేశవులు అడిగాడు ఎక్కడికి పంపిస్తున్నారని.

"శివుడి శవం ఇంటికి పంపిస్తున్నాం. పాపం ముసలామె ఇక్కడ్నుంచి ఎట్లా వెళ్తుంది? అందుకే ఆమెను అంబులెన్స్‌లో ఎక్కిస్తున్నా" అన్నాడు బ్రహ్మయ్య.

"అదేంటి? శవాన్ని ఇంటికెట్లా పంపిస్తారు? "

బ్రహ్మయ్య అదోలా చూసి "మరి ఎక్కడికి పంపిస్తారు? ఇటునుంచి ఇటు శ్మశానానికి ఎట్లా పంపిస్తారు? ఏవో ఫార్మాలిటీస్ వుంటాయిగా" అన్నాడు.

"యాక్సిడెంట్ జరిగితే శవాన్ని పోస్టుమార్టమ్ చెయ్యరా? హాస్పటల్‌కి పంపరా? " ప్రశ్నించాడు చెన్నకేశవులు.

బ్రహ్మం నవ్వాడు.

"యాక్సిడెంట్ ఎట్లా జరిగిందో ఇక్కడ అందరికీ తెలుసు. మళ్లీ హాస్పటల్‌కి పంపించి శవాన్ని ముక్కలు చేసి పోస్టుమార్టమ్ చేయడం అవసరమా? "

"అవసరమే, లేకపోతే పోస్టుమార్టమ్ రిపోర్టు ఎట్లా వస్తుంది? ఇన్సూరెన్స్ క్లెయిమ్ ఎలా చేస్తారు? "

"అవన్నీ వస్తాయండీ. డాక్టర్ పోస్టుమార్టమ్ రిపోర్ట్ ఇస్తాడు. ఇన్సూరెన్స్ డబ్బు ఎక్కడికీపోదు"

"అదెలాగండీ? "

"మీరు ఈ వూరికి కొత్తనుకుంటాను. ఈ క్వారీ సింగయ్య నాయుడి గారిది. ఎమ్మెల్యేగారి తమ్ముడు. అన్నీ సజావుగా జరుగుతాయి"

"జరుగుతాయో.. జరగవో? ఇప్పుడు శవాల్ని ముందు హాస్పటల్‌కి పంపాలి. ఆ పని పోలీసులు చేస్తారు"

"నేను యూనియన్ ప్రెసిడెంట్‌ని. మీకు తెలీదెమో? "

"పోలీసైతే కాదుగా" అన్నాడు చెన్నకేశవులు.

ఇంతలో జర్నలిస్టులు, టీవీ యాంకర్లు, కెమేరామేన్ వ్యాన్ దిగి వచ్చేశారు.

వాళ్ళకి అంతకుముందే బ్రహ్మయ్య యూనియన్ లీడర్‌గా పరిచయం వున్నట్లుంది. అతని ముందు మైక్ పెట్టారు.

"బ్రహ్మయ్యగారూ! క్వారీలో యాక్సిడెంట్ ఎలా జరిగింది? "

బ్రహ్మయ్య చెప్పిన తర్వాత ఏడుస్తున్న

# శాంతిదూత స్టాంప్

ఓ భారతీయుడి తపాలాబిళ్లని 62 దేశాలు ముద్రించటం ఒక్క మహాత్మాగాంధీ విషయంలోనే జరిగింది. శాంతిప్రవక్తగా ప్రపంచం అంతా గాంధీ గుర్తింపబడడమే ఇందుకు కారణం. ఇంతదాకా వెలువడ్డ ఆ స్టాంపులన్నింటిలో బ్రిటన్‌దేశం ముద్రించిన స్టాంపు అత్యున్నతమైంది. బ్రిటన్‌లో స్థిరపడ్డ విమల్ మల్లిక అనే చిత్రకారుడు ఈ స్టాంపుని డిజైన్ చేసాడు. ఒక పౌండు ఆరు షిల్లింగుల విలువ చేసే దీన్ని ఇంగ్లండ్ తపాలా బిళ్లలు ముద్రించే హారిసన్ కంపెనీవారు ముద్రించారు. ఒక్క మహాత్మా గాంధీ స్టాంప్ తప్ప ఇంగ్లాండ్ ఇతర దేశాల నాయకుల తపాలా బిళ్లలని ముద్రించలేదు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించిన గాంధీ చిత్రాన్ని స్టాంప్ మీద ముద్రించడాన్ని బట్టి ఆ దేశానికి గాంధీ అంటే ఎంత గౌరవమో బోధ పడుతుంది.




మహాత్మాగాంధీ తపాలబిళ్లని విడుదల చేసిన తొలి పరాయి దేశం అమెరికా. 1961లో నాలుగు, ఎనిమిది సెంట్లు విలువ గల రెండు గాంధీ స్టాంపులని మన రిపబ్లిక్ డే రోజు అమెరికా విడుదల చేసింది. నాలుగు సెంట్ల స్టాంపులని 12 కోట్లు, 8 సెంట్ల స్టాంపులని 4 కోట్లు ముద్రించారు. ఇంతదాకా ఏ దేశం 12 కోట్ల గాంధీ స్టాంపులని ముద్రించలేదు.

గాంధీ శత జయంతికి భారత దేశంతోపాటు భూటాన్, సిరియా, మరికొన్ని అరబ్ దేశాలు ఆయన తపాలా బిళ్లలని ముద్రించాయి.

గాంధీజీ హత్యానంతరం 1948, ఆగస్ట్ 15న భారత ప్రభుత్వం నాలుగు గాంధీజీ స్టాంపులని విడుదల చేసింది. వాటిలో పది రూపాయల విలువగల స్టాంప్ కూడా ఉంది. నెహ్రూ సూచన మేరకు




హిందీ, ఉర్దూ భాషలలో 'బాపు' అన్న పేరు ఆ స్టాంప్ మీద రాసింది. మరే ఇతర భారత దేశపు స్టాంపు మీద కూడా ఈ రెండు భాషలూ కలిసి చోటు చేసుకోలేదు. 10 రూపాయల స్టాంపు విలువ మార్కెట్‌లో ఇప్పుడు 12,750 రూపాయలు. అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా కూడా 1979 మార్చిలో ఇండియా మహాత్మాగాంధీ స్టాంప్‌ని విడుదల చేసింది. ప్రపంచం అంతా బాపూజీకి తపాలా బిళ్లల ద్వారా నీరాజనం పలికింది.

అన్నమ్మ, మిగిలిన ఇద్దరి కుటుంబీకులతో మాట్లాడించారు.

బ్రహ్మయ్య ఇన్‌స్పెక్టర్‌తో గుసగుసలాడాడు. ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు వచ్చి చెన్నకేశవుల్ని పలకరించాడు.

"చనిపోయిన వాళ్ళల్లో మీ బ్రదర్ గూడా వున్నాడటగా! ఐయామ్ వెరీసారీ" అన్నాడు.

చెన్నకేశవులు "ఇన్‌స్పెక్టర్‌గారూ! శవాల్ని పోస్ట్‌మార్టమ్‌కి పంపించి, ఆ కార్యక్రమం తొందరగా ముగిస్తే ఆ తర్వాత జరగాల్సిన ఏర్పాట్లు చేసుకుంటాం" అన్నాడు.

"ఎందుకండీ టైమ్ వేస్ట్? " అని ఇన్‌స్పెక్టర్ అంటూ వుండగా అతని దగ్గరికి టీవీ యాంకర్, కెమెరామేన్ వచ్చేశారు.

"ఇన్‌స్పెక్టర్‌గారూ! యాక్సిడెంట్ గురించి మీకు ఎప్పుడు తెలిసింది. మీరు ఎలా రియాక్టయ్యారు? మీరు వచ్చాక ఇక్కడ ఎన్ని యాక్సిడెంట్లు అయ్యాయి? "

ఇన్‌స్పెక్టర్ మాట్లాడుతున్నాడు.

అవతల అంబులెన్స్‌లోకి అన్నమ్మను ఎక్కించడం చూసి చెన్నకేశవులు విసురుగా వెళ్ళాడు.

"పెద్దమ్మా! నువ్వు ఇందులో వెళ్ళకు" అని చెయ్యిపట్టుకుని ఇవతలకు లాగాడు.

బ్రహ్మయ్య అతని వంక కొరకొర చూశాడు.

"చూడండి బ్రహ్మయ్యగారూ! మీరిక్కడ యూనియన్ లీడరై వుండి ఫార్మాలిటీస్ జరపకుండా అడ్డుతగులుతున్నారు. నాకేం అర్థం కావడం లేదు" పెద్దగా అన్నాడు చెన్నకేశవులు.

"పనికి మాలిన ఫార్మాలిటీస్ ఎందుకండీ? నాయుడిగారితో మాట్లాడాను. చనిపోయిన వారికి లక్ష రూపాయలు ఎక్స్‌గ్రేషియా ఇస్తానన్నారు. ఇంకేంటి? " బ్రహ్మయ్య గూడా గట్టిగా చెప్పాడు.

"లక్ష కాదు. ఒక్కొక్కరికి పది లక్షలివ్వాలి" గట్టిగా అరిచాడు చెన్నకేశవులు.

సత్యం బిత్తరపోయి "అన్నాయ్!" అన్నాడు. చెయ్యి పట్టుకుని వెనక్కి లాగుతూ.

చెన్నకేశవులు అతనివైపు సీరియస్‌గా చూసి "నువ్వూరుకో. నీకు తెలీదు" అన్నాడు.

సత్యం వెనక్కి తగ్గాడు. చెన్నకేశవులు యూనియన్ లీడర్‌తో ఘర్షణ పడడం ఎందుకో అతడికి అర్థం కాలేదు. క్వారీలలో ఎప్పుడు యాక్సిడెంట్ జరిగినా లక్ష రూపాయలివ్వడం ఎప్పుడూ జరుగుతున్నదే. ఇప్పుడు గూడా అంతే జరుగుతుంది. దీనికి గొడవపడి లాభం ఏమిటి? అనుకుంటున్నాడు.

బ్రహ్మయ్య ఎవరితోనో గొడవ పడుతూ వుండడం చూసి యాంకర్లు, టీవీ కెమేరా వాళ్ళు వచ్చేశారు.

"మీ పేరు? "

"నా పేరు చెన్నకేశవులు. చనిపోయిన వారిలో మాపెద్దమ్మ అన్నమ్మ కొడుకు శివుడు వున్నాడు."

"మీ డిమాండ్ ఏమిటి? "

"శవాల్ని పోస్ట్‌మార్టమ్ చేయించి సర్టిఫికెట్ కాపీ మాకు ఇవ్వాలి. క్వారీ యాజమాని చనిపోయిన వారికి పదేసి లక్షలు ఎక్స్‌గ్రేషియా ఇవ్వాలి."

"పోలీసులు శవాల్ని పోస్ట్‌మార్టమ్‌కి పంపడం లేదా? "

"పంపరట. దండగ అంటున్నాడు ఈ యూనియన్ లీడర్. పైగా నాయుడుగారు చనిపోయినవారికి లక్ష ఇస్తారట అని వుదారంగా చెప్తున్నాడు"

"మీరు పోస్ట్‌మార్టమ్ రిపోర్టు అవసరం లేదంటారా బ్రహ్మయ్య గారూ? " మైక్ బ్రహ్మయ్య ముందుకు వెళ్ళింది.

బ్రహ్మయ్య నీరుగారి పోయాడు.

"నేనలా అనలేదు. పోలీసులు ఆ ఫార్మాలిటీస్ చూస్తారని మాత్రమే" అని తప్పించుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ రంగూన్ రంగారావు అసహనం వ్యక్తం చేశాడు.

"అన్నీ ఫార్మాలిటీస్ ప్రకారమే జరుగుతాయి" అని శవాలను అంబులెన్స్‌లో ఎక్కించి హాస్పటల్‌కి పంపమని హెడ్ కానిస్టేబుల్ని పిలిచి చెప్పాడు.

ఇంతలో సింగయ్య నాయుడి నుంచి క్వారీ ఇన్‌చార్జి మేనేజర్‌కి ఫోన్ వచ్చింది.

"అన్నీ సక్రమంగా జరుగుతున్నాయా? ఏ గొడవలూ లేవుకదా? ముఖ్యంగా సుబ్బారెడ్డి మనుషులు ఇదే సందని రంగంలోకి దిగుతారేమో? చూస్తుండండి"

"సార్! గొడవగానే వుందండీ. ఎవడో చెన్నకేశవులంట. యూనియన్ లీడర్ బ్రహ్మయ్యతో గొడవ పడుతున్నాడు. పది లక్షలు ఇప్పించాలంటున్నాడు. వాడు సుబ్బారెడ్డి మనిషేమో?" అన్నాడు మేనేజర్.

"చెన్నకేశవులా? వాడెవడు; వాడికేం సంబంధం? ఆ పేరెప్పుడూ వినలేదే?"

"చచ్చిన వాళ్ళలో శివుడని ఒకడున్నాడు సార్! వాడికి అన్నవుతాడంట"

"సరే! నేను కనుక్కుంటాలే" అన్నాడు సింగయ్యనాయుడు.

తర్వాత ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావుకి ఫోన్ చేశాడు సింగయ్యనాయుడు.

"ఎవడయ్యా చెన్నకేశవులు? పది లక్షలు డిమాండ్ చేస్తున్నాడంట?"

"వాడే సార్! కరీం ట్రాన్స్‌పోర్టు మేనేజర్. ఈమధ్యే ఇక్కడ ఆఫీసు పెట్టారు. వాడు చాలాకాలం హైదరాబాద్‌లో వుండొచ్చాడు. తెలివి తేటలు ఎక్కువే. అందుకే అట్లా మాట్లాడుతున్నాడు. నేను చూసుకుంటాలెండి. మీరెందుకు వర్రీ అవుతారు. ఇది చాలా చిన్న విషయం. పది లక్షలా పాడా? వాడేదో వాగుతున్నాడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

★ ★ ★

అన్నమ్మ ఇంటిముందు షామియానా వేశారు. శివుడి శవాన్ని పోస్ట్‌మార్టమ్ తర్వాత అప్పజెప్పారు. షామియానా మధ్యలో చాపమీద శవాన్ని పడుకోబెట్టారు. పూలమాలలు వేశారు. తల దగ్గర దీపం పెట్టారు. అగరుబత్తీలు వెలిగించారు.

అన్నమ్మ ఏడుస్తుంటే ఇరుగుపొరుగు ఆడవాళ్ళు ఆమె పక్కనే కూర్చుని ఓదారుస్తున్నారు.

గత పదేళ్లుగా మునికొండ పల్లెనుండి పట్నంగా మారినా ఆ పేట మాత్రం పెద్దగా మారలేదు. కొన్ని పూరిళ్ళు డాబాలుగా మారాయి. ఇప్పటికీ అధికంగా పూరిళ్ళు, పెంకుటిళ్ళు, రేకుల షెడ్డులే వున్నాయి.

అక్కడ నివాసం వుండే వాళ్ళంతా లారీ డ్రైవర్లు, క్లీనర్లు. క్వారీలలో పనిచేసే కూలీలు, కార్మికులు. వీధులు వెడల్పయ్యాయి. రోడ్లు సిమెంట్‌తో వేశారు. మురికి కాలువలు యథాతథంగా వున్నాయి. పందులు, కుక్కలు యథేచ్ఛగా తిరుగుతుంటాయి. వీధి కుళాయిల దగ్గర పెద్ద పెద్ద క్యూలు వుంటాయి. నీళ్ళకోసం ఆడవాళ్ళు తిట్టుకుంటారు, కొట్టుకుంటారు.

మినీకవి...

**అవినీతి గురించి**
**నడి బజార్లో మీటింగ్ పెడ్తాడు**
**నజరానాలు మాత్రం**
**ఇంటివద్ద భార్యే**
**అందుకుంటుంది**

– ఎం.ఆర్.వి.సత్యనారాయణ మూర్తి,
పెనుగొండ, ప.గో.జిల్లా

అదంతా మామూలే.

ఇప్పుడా ఏరియాని పాత మునికొండ అంటారు. చెన్నకేశవులు అక్కడే పుట్టిపెరిగాడు. అతనికి చిన్ననాటి సంగతులన్నీ గుర్తొస్తున్నాయి. తండ్రి చనిపోవడం, తల్లి పొలాల్లో కూలీపనులకు పోవడం, శ్రీనివాసులు నాయుడింట్లో దొంగతనం నేరం మోపి పోలీసులకు పట్టించడం, అందులో నుంచి శవంగా బైటపడడం కళ్ళముందు కదులుతున్నాయి.

చెన్నకేశవులు కళ్ళలోనుంచి కన్నీళ్ళు ధారాపాతంగా కారుతున్నాయి.

మునికొండ పొలాల్లో గ్రానైటు రాయి పడి అంతా బాగుపడిపోయారు. కోట్లకి పడగలెత్తారు. పెంకుటిళ్ళు సుందరభవనాలుగా లేచాయి. కార్లలో తిరుగుతున్నారు. ఇంటినిండా బంగారం. వాళ్ళ జీవనశైలి మారిపోయింది. పిల్లలు అమెరికాలోనో, లండన్లోనో సెటిలైపోయారు. విమానాల్లో పోయి చూసొస్తున్నారు. అప్పుడప్పుడు వాళ్ళ పిల్లలు ఇక్కడికొచ్చి వాళ్ళడాబు, దర్పం చూపిస్తున్నారు.

బాగానే వుంది. మరి అదే మునికొండలో బీదవాళ్ళుండే ప్రాంతం అట్లాగే వుంది. అప్పుడు పొలాల్లో కూలీలుగా, తోటల్లో మాలీలుగా, గొడ్లకి కాపలా కాస్తూ బతికారు. ఇప్పుడు లారీ డ్రైవర్లుగా, క్లీనర్లుగా క్వారీలలో కూలీలుగా బతుకుతున్నారు. వీళ్ళెప్పుడు బాగుపడతారు?

"అన్నాయ్! ఏసోబు, హనుమంతు వచ్చారు" అన్నాడు సత్యం.

చెన్నకేశవులు కళ్లు తుడుచుకుని వాళ్ళని కూర్చోమని సైగచేశాడు.

"రేపు ఊరేగింపుగా వెళ్ళి శవాల్ని సింగయ్యనాయుడి ఇంటిముందు పెడదాం. కంపెనీ వాళ్ళ నిర్లక్ష్యం వల్లనే ప్రమాదం జరిగింది. పోయిన ప్రాణాలు ఎటూ రావు. మా శివుడికి పెళ్ళికాలేదు కాబట్టి వాడిమీద ఆధారపడి బతికేవాళ్ళు ఎవరూ లేరు. మీ పిల్లలకు పెళ్ళిళ్ళయి పిల్లలున్నారు. వాళ్ళ గతేంటి? ఈ రోజుల్లో వాళ్ళివ్వజూపిన లక్షకు విలువేంటి? పది లక్షలు ఇచ్చేవరకు శవాల్ని కదిలించవద్దు" చెప్పాడతను.

"అయ్యా! నువ్వు చెప్పేది బాగానే వుంది. నాయుడి కంపెనీ వాళ్ళు మొదట్లో ఇట్లా చచ్చిపోయినవాళ్ళకి పదివేలు ఇచ్చేవాళ్లు. అట్టట్టా ఇప్పుడు లక్ష ఇస్తున్నారు. మనం ఎంత గొడవచేసినా వాళ్ళు అంతకంటే ఇయ్యరయ్యా! మన ఖర్మ ఇంతేనను కోవాలి"

"ఊరుకుంటే మన బతుకులు ఎప్పుడూ ఇట్టాగే వుంటాయి పెద్దయ్యా! నువ్వు చూస్తున్నావుగా వాళ్ళెన్ని కోట్లు మూటగట్టుకుంటున్నారో? ఊరంతా ఎంత మారిపోయిందీ మీరు చూడ్డం లేదా? మన పేట మాత్రమే ఇంత దరిద్రంగా వుందెందుకు? ఎక్కడెక్కడి నుంచో వచ్చిన వాళ్ళు కాలనీలు కట్టుకుని దర్జాగా వున్నారు. మన వాళ్ళకి గుడిసెలు గూడా లేవు. కుటుంబాలు పెరుగుతున్నాయి. ఇరుకింట్లో మగ్గుతున్నారు. వీటికే అద్దెలు కడుతున్నారు. చాలా మందికి స్వంత ఇళ్ళు లేవు. ఇటువంటప్పుడే కంపెనీ మెడలు వంచాలి"

ఏసోబు, హనుమంతు ముఖాలు చూసుకున్నారు. వాళ్ళిప్పుడు సందిగ్ధంలో పడిపోయారు. యూనియన్ లీడర్ ధర్మంగా వుందని చెప్పిన లక్ష తీసుకుని రాజీపడటమా? లేకపోతే చెన్నకేశవులు మాట మీద కంపెనీ వాళ్లని ఎదిరించడమా?

కొంతమంది యువకులు కలిగించుకుని 'చెన్నకేశవులు మాట మీద నిలబడదాం.. పోయేది ఏమిటి? ' అన్నారు.

'సరే' అనుకున్నారు.



## చతురలో ఇదే తొలి నవల

ఇప్పటివరకూ 500 కథలు, 10 నవలలు వివిధ పత్రికల్లో వచ్చాయి. గతంలో 'చతుర కతలు' చాలా వచ్చాయిగానీ, 'చతుర'లో నవల రావడం మాత్రం ఇదే తొలిసారి. గుంటూరు హిందూ కాలేజీ-హైస్కూల్‌లో 1958లో 9వ తరగతి చదువుతున్నప్పుడు రాసిన తొలి కథ 'రచయిత ఎవరు?' సైనిక సమాచార్ వారపత్రికలో అచ్చయింది. దానికి పది రూపాయలు పారితోషికం అందుకోవడం తీపి జ్ఞాపకం. అప్పట్లో రాజమండ్రి నుంచి వచ్చే 'నవ్వులు పువ్వులు', మద్రాసు నుంచి వచ్చే 'చిత్రగుప్త', బెంగళూరు నుంచి వచ్చే 'ప్రజామత'లో కథలు రాశాను. 1966లో 'ప్రజామత'లో 'కాగితం పడవ' సీరియల్‌గా వచ్చింది. ఆదర్శ గ్రంథ మండలి ద్వారా 'తరగని తరంగాలు' డైరెక్ట్ నవల, 'ఉగాది అతిథి కథల సంపుటి' ప్రచురితం అయ్యాయి. 1964లో రచనలు మానేసి మళ్లీ 74 నుంచి 96 వరకు రాశాను. 91లో 'విషంకురిసిన రాత్రి' కథాసంపుటి, 2002లో పిల్లల కథల సంపుటి వచ్చాయి. 95లో స్వాతి, 96లో ఆంధ్రప్రభ వారపత్రికల్లో సీరియల్స్ వచ్చాయి. పదవీ విరమణ (నాగార్జునసాగర్ ప్రాజెక్టు, సూపరింటెండెంట్) తర్వాత 2007 నుంచి రచనా వ్యాసంగంపై తిరిగి దృష్టిపెట్టాను.

చిరునామా: సిహెచ్.శివరామ ప్రసాద్, (వాణిశ్రీ) స్వగృహ అపార్ట్‌మెంట్, 'సి'బ్లాక్, ఫ్లాట్ నెం.2, భాగ్యనగర్ కాలనీ, కూకట్‌పల్లి, హైదరాబాద్-500072

తెల్లవార్లూ శవజాగారం చేశారు.

ట్రాక్టర్లలో శవాల్ని ఎక్కించి వూరేగింపుగా పొట్లూరి సింగయ్యనాయుడు మూడంతస్తుల భవనం ముందుకు చేరుకున్నారు. ఇంటి ఎదురుగా షామియానాలు వేసి శవాల్ని అందులో పడుకోబెట్టారు.

స్లోగన్స్ మొదలుపెట్టేసరికి ఇంట్లో వున్న ఆడవాళ్ళు హడలిపోయారు. అప్పటికి ఇంకా సింగయ్య నాయుడు హైదరాబాద్ నుంచి రాలేదు.

పోలీసులు వ్యానుల్లో వచ్చిదిగారు. ఇంటిముందు కాపలాగా నిలబడ్డారు. ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు అసహనంగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. అతనికి చెన్నకేశవులు మీద చాలా కోపంగా వుంది. వాళ్ళ కంపెనీ లారీ యాక్సిడెంట్ చేసి సుబ్బారెడ్డి మరణానికి కారణమైతే తను మేనేజ్ చేసి లారీ తీసుకుపొమ్మన్నాడు. ఇంతిమ్మని డిమాండ్ చెయ్యలేదు. వీడికి విశ్వాసం లేదు అనుకున్నాడు.

పొజిషన్లో వున్నోడు కష్టాల్లో పడితే అపోజిషన్లో వున్నోడికి ఎంతో ఆనందం.

ఆ ఆనందంలోనే ప్రతిపక్ష నాయకుడు భద్రాద్రి మునికొండకు వచ్చేశాడు. అటు గనుల శాఖామంత్రి, ఆయన్తోపాటు ఎమ్మెల్యే శ్రీనివాసులురెడ్డి, అతడి తమ్ముడు, కంపెనీ యజమాని సింగయ్యనాయుడు హైదరాబాద్ నుంచి బయల్దేరి వస్తున్నారని వర్తమానం వచ్చింది.

టీవీ న్యూస్ ఛానళ్ళల్లో ఈ కార్యక్రమమంతా లైవ్‌గా వస్తోంది. ఇదంతా ఎమ్మెల్యేకి చిరాకుగా వుంది. గ్రానైట్ టెండర్ల వ్యవహారంలో అడ్డుగా వున్న సుబ్బారెడ్డి పోయి, టెండర్ చేజిక్కించుకున్న ఆనందం ఆవిరైపోయింది. అందులో ఎన్నికోట్లు లాభం వచ్చినా ఇప్పుడు జరుగుతున్నది తన కుటుంబానికి వ్యతిరేకంగా ఆందోళన. ప్రతిపక్షం భద్రారెడ్డి రెచ్చిపోయి మాట్లాడుతున్నాడు. ప్రజల్లో ఇదంతా చెడ్డపేరు తీసుకొచ్చే వ్యవహారమే. అందుకని ప్రయాణంలో వున్నప్పుడే ఏం చేయాలో నిర్ణయించుకున్నాడు.

మైనింగ్ మంత్రి వచ్చీరావడంతోనే షామియానాలోకి వచ్చాడు. ముగ్గురి శవాలకు పూలదండలు వేశాడు.

"కార్మిక సోదరులారా! క్వారీలో ప్రమాదం జరిగిందని, ముగ్గురు చనిపోయారని తెలిసి నేను తల్లడిల్లిపోయాను. మా ప్రభుత్వం కార్మిక, కర్షక పక్షపాత ప్రభుత్వం. వాళ్ళకోసం ఏం చెయ్యడానికైనా సిద్ధం"

"చనిపోయిన కార్మికులకు పదిలక్షలు ఎక్స్‌గ్రేషియా ఇవ్వాలి" చెన్నకేశవులు గట్టిగా అరిచాడు.

"సోదరులారా ఆ విషయానికే వస్తున్నా! సింగయ్య నాయుడితో ఎప్పుడో మాట్లాడాను. మీరు కోరుకున్నట్లే మృతుల కుటుంబాలకు పదిలక్షలు ఇవ్వడానికి ఆయన ఒప్పుకున్నారు"

"మంత్రిగారు జిందాబాద్!"

"ఎమ్మెల్యే శ్రీనివాసులునాయుడు నాయకత్వం వర్ధిల్లాలి".

"జిందాబాద్ యూనియన్ లీడర్ బ్రహ్మయ్య"

కొందరు కూలీలు అరవడం మొదలుపెట్టారు. చెన్నకేశవులు చిరునవ్వులు నవ్వుతూ తదుపరి కార్యక్రమం జరిపించడంలో మునిగిపోయాడు.

శవాలను ట్రాక్టర్‌లోకి ఎక్కించి శ్మశానం వైపు ఊరేగింపుగా బయల్దేరారు.

★ ★ ★

శత్రువుకి శత్రువు మన మిత్రుడు అనేది లోకోక్తి. దాన్ని అక్షరాలా పాటించాడు సుబ్బారెడ్డి కొడుకు చెంచురామారెడ్డి.

క్వారీలో యాక్సిడెంట్ జరిగినప్పుడు బ్రహ్మయ్య చేతిలో వున్న కార్మికుల్ని తన వైపు తిప్పుకుని ఎమ్మెల్యే వర్గాన్ని దెబ్బతీసిన చెన్నకేశవులి టాలెంట్‌ని మెచ్చుకున్నాడు. బ్రహ్మయ్య ఎమ్మెల్యే మనిషి. గ్రానైట్ కంపెనీ యాజమాన్యాలందరితోనూ సఖ్యంగానే వుంటాడు. అతనికి తన ప్రయోజనాలే ముఖ్యం. యూనియన్ లీడర్‌షిప్పుని అడ్డం పెట్టుకుని ఆస్తుల్ని కూడబెట్టుకున్నాడు. డొనేషన్ కట్టి బెంగళూరులో యమ్.బి.బి.యస్. సీటు కూతురికి కట్టబెట్టాడు. ఇద్దరు కొడుకులు ఇంజనీరింగ్ చదువుతున్నారు.

ఐతే ఇప్పుడు కార్మికుల్లో చెన్నకేశవులి పేరు వినిపిస్తోంది. యూనియన్‌తో ఏ మాత్రం సంబంధం లేనివాడు చనిపోయిన వారి తరపున పోరాడి లక్ష బదులు పది లక్షలు పరిహారం ఇప్పించడం సామాన్యమైన విషయం కాదు. అదీ ఎమ్మెల్యే గ్రానైట్ కంపెనీ నుంచి. సుఖంగా బతకదల్చుకున్న వాడెవడూ ఎమ్మెల్యే ఫ్యామిలీతో పేచీ పెట్టుకోడు. మరి చెన్నకేశవులికి ఇంత దమ్ము ఎక్కడ్నుంచి వచ్చింది?

చింతలపూడి సుబ్బారెడ్డి జీవితకాలంలో ఎమ్మెల్యే కాలేకపోయాడు. కేవలం డబ్బు సంపాదనే అతనికి తృప్తినివ్వలేకపోయింది. తండ్రి తీర్చుకోలేని కోరిక తను తీర్చుకుని ఆయన ఆత్మకు శాంతి చేకూర్చాలని నిర్ణయించుకున్నాడు కొడుకు. తన తండ్రి యాక్సిడెంట్‌లో చనిపోవడం యాదృచ్ఛికం కాకపోవచ్చు ఇందులో శ్రీనివాసులు నాయుడి హేండ్ వుంటే వుండొచ్చు ఐతే తండ్రి మరణం తనకు ప్లస్‌పాయింట్. రాబోయే ఎలక్షన్లో తను శ్రీనివాసులు నాయుడిని ఢీకొని ముచ్చెమటలు పోయించాలి. కార్మికుల్లో పలుకుబడి సంపాదించుకున్న చెన్నకేశవుల్ని తను మచ్చిక చేసుకుంటే తనకు లాభమే. పైగా అతనికి కులం బలం అపారంగా వుంది.

చెంచురామారెడ్డి కరీమ్ ట్రాన్స్‌పోర్ట్ ఆఫీసుకి వచ్చాడు. అప్పుడు చెన్నకేశవులు బిజీగా వున్నాడు. కొంచెం సేపటిలో లారీలు అక్కడ్నుంచి బయల్దేరి పోతాయి.

అప్పుడిక ఫ్రీగా వుంటాడు.

రాత్రి తొమ్మిది కావొస్తోంది. ఆఫీసులోకి వచ్చిన చెంచురామారెడ్డిని డ్రైవర్లు, ఆఫీసు బాయ్ గుర్తించి మర్యాదచేసి కూర్చోబెట్టారు. చెన్నకేశవులికి ఆయనెవరో తెలియదు. ఇంతకు ముందు చూసిన గుర్తు లేదు. అందుకే ఎగాదిగా చూసి "రండి... రండి..." అన్నాడు.

"నా పేరు చెంచురామారెడ్డి. లారీ యాక్సిడెంట్‌లో చనిపోయింది మా నాన్నగారు సుబ్బారెడ్డి" అని షేక్‌హేండ్ ఇచ్చి కూర్చున్నాడు.

చెన్నకేశవులికి అర్థమైంది. సుబ్బారెడ్డికి జరిగిన యాక్సిడెంట్ గురించి కూపీలాగడానికి వచ్చాడు. ఈ కేసులో పోలీసులు తగినంత శ్రద్ధ తీసుకోవడంలేదని తనకే తెలుస్తోంది. ఇక ఆయన కొడుక్కి అనుమానం రావడంలో ఆశ్చర్యం ఏముంది? అనుకున్నాడు.

"సార్! నన్ను పిలిపిస్తే నేనే మీ దగ్గరికి వచ్చేవాడిని. మీరు శ్రమ తీసుకుని ఇక్కడికి వచ్చారు" మొహమాటపడుతూ అన్నాడు.

"ఫరవాలేదు. మీ పని కానివ్వండి. మనం తీరిగ్గా మాట్లాడుకోవాలి" అన్నాడు.

సత్యం ముందుకు వచ్చి "అన్నాయ్! నువ్వు సార్ పనిచూడు. ఇవన్నీ నేను చూసుకుంటాలే" అన్నాడు.

చెన్నకేశవులు సీటులోనుంచి లేచి "రండి, లోపలికెళ్ళి మాట్లాడుకుందాం" అని ప్రైవేట్ రూమ్ వైపు దారితీశాడు.

"ఇక్కడ కాదు. మనం బైటకు వెళ్దాం. అక్కడ ఎంతసేపైనా మాట్లాడుకోవచ్చు" అన్నాడు చెంచురామారెడ్డి.

చెన్నకేశవులు కొన్ని క్షణాలు ఆలోచించాడు. ఈయన ఏ పనిమీద వచ్చాడు? గ్రానైట్ లోడ్‌ల గురించి ఐతే కాదు. అదే ఐతే ఇక్కడే మాట్లాడేవాడు. ఇంకేదో వుంది? సుబ్బారెడ్డి యాక్సిడెంట్ గురించే. ఇంకేముంటుంది? అనుకున్నాడు.

"సరే పదండి" అని బయల్దేరాడు.

చెన్నకేశవులు కారు ముందు సీట్లో కూర్చోబోతుండగా చెంచురామారెడ్డి వారించాడు. బ్యాక్ సీట్లో తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

కారు పోతూవుండగా "క్వారీలో జరిగిన యాక్సిడెంట్‌లో మీరు బాగా చొరవ తీసుకున్నారు. చనిపోయిన వారికి పది లక్షలు ఇప్పించి మంచిపని చేశారు" అన్నాడు.

చెన్నకేశవులు నవ్వాడు.

"మా పెద్దమ్మ కొడుకు వున్నాడండీ అందులో. అందుకే కలిగించుకున్నాను. లేకపోతే నాకేంబట్టిందని.. వూరుకునేవాడినేగదా! ఇందులో నా గొప్పతనం ఏమీ లేదు" అన్నాడు.

"అది గొప్పతనమే. ఎందుకంటే యూనియన్ లీడర్లని గూడా ఎదిరించారు కదా! ఇదొక టర్నింగ్ పాయింట్. మా ఏరియాలో ముందు ముందు ఎప్పైనా ఇటువంటివి జరిగినప్పుడు అందరూ పది లక్షలు ఇవ్వమని డిమాండ్ చేస్తారు. కొన్ని కుటుంబాలైనా బాగుపడతాయి"

"అది నిజమే. ఎవరికి వాళ్ళు మనకెందుకులే అని వూరుకుంటే యూనియన్ లీడర్లు పెత్తనం చేస్తూనే వుంటారు. అధికారులకి, కంపెనీల వాళ్ళకి అనుకూలంగా వుండి తమ లాభం చూసుకుంటారు.

"మీకొక విషయం తెలుసా? యూనియన్ లీడర్ బ్రహ్మయ్య ఇక్కడ పాతుకుపోయాడు. పంది పోయాడనుకోండి. బాగా సంపాదించాడు. పెట్టుబడి లేని వ్యాపారం లీడర్‌షిప్పు అంటే" అని నవ్వాడు చెంచురామారెడ్డి

"నేనూ విన్నాను. తన సంగతే చూసుకున్నాడు గాని వేలమంది వర్కర్స్ సంగతేమిటి? వాళ్ళందరికీ ఇళ్ళున్నాయా? వాళ్ళ

పిల్లలు ఎక్కడ చదువుతున్నారు? రోగా లొస్తే ఎక్కడ ట్రీట్‌మెంట్ తీసుకుంటు న్నారు? వాళ్ళ బతుకులు ఎందుకు బాగు పడడం లేదు? ఇదంతా ఆలోచిస్తున్నాడా? ” చెన్న కేశవులు కొంచెం ఆవేశపడ్డాడు.

“వాడెందుకు ఆలోచిస్తాడండీ! ఎవడి స్వార్థం వాడిది” అన్నాడు చెంచురామా రెడ్డి.

కారు ఒక బిల్డింగ్ ముందు ఆగింది. అది రెండుతస్తుల మేడ. విశాలమైన ఆవ రణలో ఉంది. చుట్టూ ఫెన్సింగ్ వుంది. పూల మొక్కలు, పళ్ళచెట్లు వున్నాయి.

నవ్వుతూ అడిగాడు చెంచురామారెడ్డి.

“నాదంతా లారీ ఫీల్డ్. నాకొక బ్రాండ్ లేదు. దేశమంతా తిరిగాను. ఎక్కడ ఏది దొరికితే అదే!” అన్నాడు చెన్నకేశవులు నవ్వుతూ.

“చీవాస్ రీగల్ తీసుకురా!” అని అటెం డర్‌తో చెప్పాడు.

అటెండర్ బాటిల్ తెచ్చి రెండు గ్లాసు ల్లోకి నింపి ఐస్ క్యూబ్స్ వేసి సోడా పోశాడు. జీడిపప్పు, చికెన్ ఫ్రై ప్లేట్లు తెచ్చి పెట్టాడు. రూమ్ బైటకు వెళ్ళి డోర్ మూశాడు.

## ఉప్పునీళ్లు



**రా**మకృష్ణ పరమహంస మాటల్లో చమత్కారంతోపాటు, అద్భుతమైన లోక జ్ఞానం ఉంటుంది. ఆయన వివిధసందర్భా లలో చెప్పిన చతురోక్తులు కొన్ని పాఠకుల కోసం..

ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు లౌకికవాది. నిరీశ్వరవాది. రామకృష్ణుడు ఆయనను ఓసారి కలిసినప్పుడు 'నేను జ్ఞానసా గరం వద్దకు వచ్చాను' అన్నారు మెచ్చుకోలుగా. దానికి వెంటనే విద్యాసాగరుడు, 'ఆధ్యాత్మికవాది అయిన మీకు ఈ సాగరం లోని ఉప్పునీళ్లు రుచించవేమో? ' అన్నారు గడుసుగా. 'ఉప్పు కూడా మనిషికి అవసరమేకదా' అన్నారు రామకృష్ణ. ఆయన హాస్యస్ఫూర్తికి విద్యాసాగర్ నవ్వేశారు.

'చీర్స్' చెప్పుకుని డ్రింక్ మొదలుపెట్టారు.

“చెప్పండి. నాతో మీకేంపని? ” అడిగాడు చెన్నకేశవులు విషయం లోకి వస్తూ.

“ఏదైనా పనివుంటేనే మీ దగ్గరికి రావాలా? ఫ్రెండ్‌షిప్ చెయ్యడానికి రాకూడదా? ” అని నవ్వాడు చెంచురామా రెడ్డి.

“ధనవంతులు బీద వాళ్ళతో స్నేహం చెయ్యడం అనేది కలలో మాట. సినిమాల్లో చూడొచ్చు అలాంటిది ఈ ప్రపంచంలో ఎక్కడా వుండదు. అవ సరం లేనిదే డబ్బున్నోడు లేనివాడిని కనీసం పలకరించడు. మొఖం వైపుకూడా చూడడు”

“ఇది మా కంపెనీ గెస్ట్‌హౌస్. ఇది ఎవ రైనా వచ్చినప్పుడు విశ్రాంతిగా వుండడానికి పనికొస్తుంది” అంటూ లోపలకు దారి తీశాడు.

అటెండర్ రూమ్ తలుపు తీసి ఏర్ కం డీషనర్ ఆన్ చేసి అక్కడే నిల్చున్నాడు.

తను సోఫాలో కూర్చుని 'కూర్చోండి' అని ఎదురుగా వున్న సోఫావైపు చూపిం చాడు.

“చెప్పండి. మీ బ్రాండ్ ఏమిటి? ”

“భలే చెప్తున్నారే? ”

“చూడండి రెడ్డిగారూ! నేను చిన్నతనం లోనే ఇంటినుంచి నెట్టివేయబడ్డాను. ఎంతో లోకం చూశాను. దేశాలు చూశాను. లెక్కలేనంత మందిని కలుసుకు న్నాను. ఎంతో దరిద్రం అనుభవించాను. దిక్కులేని వాడిగా ఒంటరిగా పెరిగాను.

మనిషి గురించి నాకు బాగా తెలుసు"

"యూ ఆర్ కరెక్ట్. మొహమాటం లేకుండా మాట్లాడే వాళ్ళని నేను లైక్ చేస్తాను" అని గ్లాసు ఎత్తి ఖాళీ చేశాడు.

ఈసారి తనే గ్లాసులు నింపాడు.

"మీ నాన్నగారు మా లారీ యాక్సిడెంట్‌లో చనిపోవడం ఎంతో బాధ కలిగించిది. నేను ఇక్కడకు వచ్చిన తర్వాత యాక్సిడెంట్లో మనిషి చనిపోవడం ఇదే మొదలు" అన్నాడు చెన్నకేశవులు.

"అదే విషయం మాట్లాడాలనే మిమ్మల్ని ఇక్కడకు తీసుకొచ్చాను"

"నాకు తెలుసు"

"నా చిన్నతనం నుంచి పొట్లూరి శ్రీనివాసులు నాయుడికి మా నాన్నగారికి పడదు. చెరొక పార్టీలో వుండేవాళ్ళు. బిజినెస్‌లో గూడా పోటీ వుండేది. ఐతే ఈ ఏరియాలో వాళ్ళ కులం బలం వల్ల ఎప్పుడూ గెలుస్తూ వస్తున్నాడు. ఎమ్మెల్యే అయ్యాక ఇక వాళ్ళ కుటుంబం ఆశకు అంతం లేకుండా పోయింది. ఎన్నో గవర్నమెంట్ ల్యాండ్స్ కాజేశారు. దొంగపట్టాలు పుట్టించుకున్నారు. రకరకాల వ్యాపారాలు చేస్తున్నారు. ఇప్పుడు అన్నీ కోట్లలోనే వ్యవహారాలు నడుస్తున్నాయి. ఆ మధ్య ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టుకి గ్రానైట్ సప్లయ్‌కి టెండర్ పిలిచారు. రెండొందల కోట్లు బిజినెస్. సింగయ్య నాయుడు సిండికేట్ అవ్వాలని అందర్నీ కూడగట్టాడు. సహజంగానే మా నాన్న సిండికేట్‌కి దూరంగా వున్నాడు. ఎమ్మెల్యే వచ్చి తమతో కలవమన్నాడు. అందుకు ఆయన ఒప్పుకోలేదు. ఇంతలో ఈ యాక్సిడెంట్ జరిగింది. మేమిక ఆ టెండర్ గురించి పట్టించుకోలేదు" చెప్పాడు చెంచురామారెడ్డి.

"యాక్సిడెంట్ జరగడంలో ఎమ్మెల్యే హేండ్ వుందని మీకు అనుమానంగా వుంది. ఔనా?" ప్రశ్నించాడు చెన్నకేశవులు.

"ఔను, ఆ లారీ డ్రైవర్ ఇంతవరకు దొరకలేదు. పోలీసులు దొరకలేదని చెప్తున్నారు. ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు ఎమ్మెల్యే మనిషి. గ్రానైట్ కంపెనీల నుంచి మామూళ్లు స్టేషన్‌కి అందుతుంటాయి. అందులో ముప్పాతిక నొక్కేసి మిగిలింది పై ఆఫీసర్లకిచ్చి సంతృప్తి పరుస్తుంటాడు. ఇంత ఆదాయం స్టేట్‌లో ఏ స్టేషన్‌కీ వుండదు. అందుకే అధికారంలో వున్నవారికి బాగా అనుకూలంగా వుంటాడు. ట్రాన్స్‌ఫర్ రాకుండా ప్రయత్నిస్తుంటాడు. డబ్బంతా కూడా బామ్మర్ది సినిమా కంపెనీలో పెట్టుబడులు పెడుతున్నాడు. అత్తగారి వూళ్లో ఆస్తులు కొంటుంటాడు"

"మనదేశం పాడి ఆవులాంటిది. పిండుకున్నవాడికి పిండుకున్నంత. ఛాన్స్ దొరకాలేగాని పిండని వాడెవడు?"

"ఇప్పుడు నేను నిజం తెలుసుకోవాలి. యాక్సిండెట్ జరిపించారా? జరిగిందా?"

"అది చెప్పేది ఒక్కడే. డ్రైవర్ రసూల్" అన్నాడు చెన్నకేశవులు.

"ఇప్పుడు ఎక్కడ వుండి వుంటాడు?"

"వాడు వుండేది ఈ వూళ్లోనే. మసీదు వీధిలో వాడిల్లు. ఐతే పారిపోయి కరీం అండర్‌లో వున్నాడు. వచ్చి లొంగిపొయ్యేలా చూడమని కరీంతో చాలాసార్లు చెప్పాను. వాడెందుకో భయపడుతున్నాడని కరీం అంటున్నాడు. ఇక ఈ వూళ్ళో డ్యూటీ చెయ్యనని అన్నాడట. నేను రసూల్ భార్యతో కూడా చెప్పాను కేసేమీ ఉండదని, లొంగిపోతే బెయిల్ మీద వస్తాడనీ. సరే సరే అన్నది. ఈ మధ్య వెళ్తే ఇంటికి తాళం వేసివుంది. రసూల్ భార్యను పిలిపించుకున్నాడు. ఇక ఇక్కడికి వచ్చే వుద్దేశం లేదు అనుకుంటాను."

"దీన్ని బట్టేమనకి అర్థమవుతుంది.

రసూల్‌ని ఎవరో మేనేజ్ చేశారు" అన్నాడు చెంచురామారెడ్డి.

"మీ అనుమానం నిజం కావొచ్చు"

"డ్రైవర్ని ఏదో చేయాలని నాకేం లేదు. విషయాన్ని కన్ఫర్మ్ చేసుకోవాలి. అంతే"

"నేను ట్రై చేస్తాను. హైదరాబాద్ వెళ్లే పనివుంది. రసూల్ ఎక్కడికీ పోడు. అక్కడే తిప్పలు పడుతుంటాడు. కరీం అడ్డాలో వుంటాడు" అన్నాడు చెన్నకేశవులు.

మాట్లాడుకుంటూనే డిన్నర్ పూర్తి చేశారు.

"మనం మళ్ళీ కలుద్దాం" అని లేచాడు చెన్నకేశవులు.

"నాతో ఏ అవసరం ఉన్నా ఫోన్ చేస్తే చాలు" అని కార్డు ఇచ్చాడు చెంచురామారెడ్డి.

★ ★ ★

"రసూల్ ఇప్పుడు మన దగ్గర లేడు భాయ్. లారీ ఓనర్ అయ్యాడు. ఇప్పుడు స్వంతంగా తిప్పుకుంటున్నాడు.

కరీం చెప్పింది విని ఆశ్చర్యపోయాడు చెన్నకేశవులు. లారీ కొనేంత కెపాసిటీ లేదు వాడికి. ఎప్పుడూ డబ్బుకి ఇబ్బంది పడుతూ వుండేవాడు. ఎంత సంపాదించినా చాలేది కాదు. తాగుడు అలవాటుంది. ఫైనాన్స్ కంపెనీలో అప్పు తీసుకునేవాడు. అప్పు తీర్చడం లేదని రికవరీ ఏజెంట్లు ట్రాన్స్‌పోర్ట్ ఆఫీసుకి వచ్చి రసూల్ గురించి అడగడం అనుభవమే. అటువంటి వాడికి ఒక్కసారే లారీ కొనుక్కునేంత డబ్బు ఎక్కడిది?

సుబ్బారెడ్డికి జరిగింది యాక్సిడెంటేనా? ఎవరిదైనా కుట్ర వుందా? అనేదానిలో చెన్నకేశవులికి ఆసక్తి ఏమీలేదు. ఐతే చెంచురామారెడ్డి ఈ విషయంలో తన సహాయం కోరడంతో అదేమిటో తెలుసుకుందామనే ప్రయత్నం. రసూల్ తనకి నిజం చెప్తాడనే నమ్మకం వుంది అనుకుంటూ అడ్రస్ వెతుక్కుంటూ వెళ్ళాడు. రసూల్ బహదూర్‌పురాలో వుంటున్నాడు.

చెన్నకేశవుల్ని చూసి ముందు కొంచెం ఆశ్చర్యం ప్రటించినా ఆ తర్వాత ఆనందించాడు రసూల్.

"హైదరాబాద్ ఎప్పుడొచ్చావ్ భాయ్? కబురు చేస్తే నేనే వచ్చేవాడిని కదా?" అంటూ ఆలింగనం చేసుకున్నాడు.

"నువ్వు ఏదైనా అడ్రస్ చెప్తే కదా? కనీసం ఫోన్ నెంబర్ ఇచ్చినా మాట్లాడేవాడిని. ఇప్పుడు నువ్వు పెద్దవాడివైపోయావని కరీంభాయ్ చెప్పాడు" నిష్ఠూరంగా అన్నాడు చెన్నకేశవులు.

"అదేంలేదు భాయ్. పోలీసుల్తో గొడవని చెప్పలేదంతే" అన్నాడు రసూల్.

"పోనీలే. మునికొండ నుంచి మకాం ఎత్తేసినట్లేనా?"

"అక్కడ ఇల్లు ఖాళీ చేశాను. సరే భాయ్! ఏదైనా పనిమీద వచ్చావా?" అనుమానంగా చూస్తూ అడిగాడు రసూల్.

"ఔను. నువ్వు లారీ ఓనర్ అయ్యావంటగా? నీ దగ్గర పార్టీ తీసుకుందామని వచ్చాను" నవ్వుతూ అన్నాడు చెన్నకేశవులు.

"నీకు పార్టీ ఇవ్వడం నాకు ఖుషీభాయ్. పద" అని బార్‌కి తీసుకెళ్ళాడు.

ఇద్దరూ స్పెషల్ రూమ్‌లో కూర్చున్నారు. తాగుడు మొదలు పెడితే రసూల్‌కి వళ్ళు తెలీదు. అది అతని బలహీనత. రసూల్‌ని బాగా తాగనిచ్చి తను కంట్రోల్లో వున్నాడు.

"ఇప్పుడు చెప్పు రసూల్? అన్యాయంగా సుబ్బారెడ్డి కారుకి ఎందుకు యాక్సిడెంట్ చేశావు?" అడిగాడు చెన్నకేశవులు.

"సుబ్బారెడ్డి కారుకి యాక్సిడెంట్ చెయ్యబట్టి నేను బతికిపోయాను భాయ్. లేకపోతే నేను, నా బీబీ ఇద్దరం జైల్లో వుండే

వాళ్ళం" అన్నాడు.

"అదేంటి?"

"నీకు తెలుసుగా భాయ్! మునికొండలో నా రెండో పెళ్ళాం ఒళ్లు కాల్చుకుని చచ్చి పోయింది"

"ఔను"

"అది ఆత్మహత్య కాదు. నా పెద్ద పెళ్ళాం కిరోసిన్ పోసి అగ్గిపుల్ల ముట్టించి చంపేసింది"

"అలాగా? ఎందుకని"

"ఎందుకంటే ఏం చెప్పను? అదంతా ఒక కథ భాయ్! మా మసీదు బజార్లో జాస్మిన్ ఇంట్లోనే చీరల దుకాణం పెట్టి బిజినెస్ చేసేది. దాని మొగుడు దుబాయ్ వెళ్లిపోయాడు. తర్వాత విడాకులిచ్చాడు. ఇది ఒంటరిగా వుంటోంది. నేను అప్పుడ ప్పుడు దాని దగ్గర అప్పు తీసుకుంటుండే వాడిని. దానికి నా మీద మోజు పుట్టింది. దాని కోరిక తీరుస్తుండేవాడిని. నా పెళ్ళాం గొడవ చేసింది. జాస్మిన్ దగ్గర బాగా డబ్బుందనీ, దాన్ని రెండో పెళ్లి చేసుకుంటే మనం హాయిగా వుండొచ్చని నచ్చజె ప్పాను. సరేనన్నది. అలా జాస్మిన్ని రెండో పెళ్లి చేసుకున్నాను. మొదట్లో బాగానే వుండేవాళ్ళు. పెద్ద ఇల్లు తీసుకుని ఒకే ఇంట్లో వుంటున్నాం. తర్వాత జాస్మిన్ గర్భవతి అయింది. మొదటి పెళ్ళానికి పిల్లలు లేరు. నేను జాస్మిన్ని బాగా చూసు కుంటున్నాననీ, దానికి పిల్లలు పుడితే ఇక దీన్ని పట్టించుకోననీ అసూయ పుట్టింది. ఒకరోజు అది నిద్రపోతున్నప్పుడు జాస్మిన్ మీద కిరోసిన్ పోసి నిప్పుపెట్టింది. ఏమీ తెలియనట్లు అది ఆత్మహత్య చేసుకుందని ఏడుస్తూ కూర్చుంది. పోలీసులు నన్ను, దాన్ని స్టేషన్‌కి తీసుకెళ్లారు. నాలుగు తన్నేసరికి అది బాధ భరించలేక నిజం చెప్పింది. ఐతే ఇన్‌స్పెక్టర్ నన్ను పిలిచి నువ్వొక పనిచేస్తే నిన్ను, నీ పెళ్ళాన్ని వది లేస్తాను. జాస్మిన్ ఆత్మహత్య చేసుకుందని కేసు క్లోజ్ చేస్తాను. లేకపోతే ఇద్దరిమీదా కేసు పెట్టి జైలుకి పంపిస్తాను అని బెది రించాడు. అది సుబ్బారెడ్డి కారుకి యాక్సి డెంట్ చెయ్యడం. హైదరాబాద్‌లో సుబ్బా రెడ్డి కారు బయల్దేరినప్పుడు నాకు చెప్పే వారు. నేను లారీలో వెంబడించేవాడిని. రెండుసార్లు యాక్సిడెంట్ చేయలేకపో యాను. మూడోసారి మునికొండ క్రాస్ రోడ్డులో దొరికిపోయాడు" చెప్పడం ముగించాడు రసూల్.

"రంగూన్ రామారావేగా?"

"ఔను. యాక్సిడెంట్ చేసి హైదరాబాద్ పారిపొమ్మని చెప్పింది గూడా ఇన్‌స్పెక్టరే. ఇక ఎప్పుడూ మునికొండకి రావొద్దన్నాడు.



ఫ్లాష్...

**బుసకూడా మర్చిపోతే**
**బతకడం కష్టం**
**బతుకిప్పుడు క్లిష్టం**

-మాధవీ సనారా,
అనకాపల్లి

లారీ కొనుక్కోడానికి వాళ్లే డబ్బిచ్చారు."

"సరే! పద పోదాం. చాలా టయి మయింది" లేస్తూ అన్నాడు చెన్నకేశవులు.

"నువ్వేం తీసుకోలేదు భాయ్! ఇంకొక బీర్ తీసుకో" బ్రతిమాలాడు రసూల్.

"లేదు రసూల్. నీకు తెలుసుగా? నేను ఎక్కువ తీసుకోను. ఏదో సరదాగా కంపెనీ కోసం తీసుకుంటాను" అన్నాడు.

★ ★ ★

ఏడు కొండలు గ్రానైట్ పలకలను కట్ చేయడం, పాలిష్ చేయడం కోసం యూనిట్ పెట్టుకున్నాడు. మొదట్లో క్వారీ లో పనికి పోయేవాడు. ఎన్నాళ్ళీ కూలీ

పని? బాగుపడేది ఎప్పుడని ఆలోచించి యూనిట్ ఏర్పాటు చేసుకున్నాడు. బ్యాంక్‌లో లోన్ తీసుకున్నాడు. అప్పుడు యూనియన్ లీడర్ బ్రహ్మయ్యే సహాయం చేశాడు. బ్యాంక్ మేనేజర్‌తో మాట్లాడి డబ్బు ఇప్పించాడు. యూనిట్ బాగానే నడుస్తుంది.

చేతిలో డబ్బులు ఆడేటప్పటికి అవసరాలు ఎక్కువయ్యాయి. ఏడుకొండలు భార్య చంద్రకళకు డబ్బున్న దర్పాన్ని తోటి వారికి చూపించాలన్న తపన ఎక్కువైంది. ఇంట్లోకి మోడరన్ ఫర్నిచర్, ప్లాస్మా టీవీ, డబుల్ డోర్ ఫ్రిజ్, బెడ్ రూమ్‌లో ఏసీ వగైరాలన్నీ ఇన్‌స్టాల్‌మెంట్‌లో కొనిపడేసింది. ఇక పిల్లల తల వెంట్రుకలు తియ్యడానికి తిరుపతి, అక్షరాభ్యాసానికి బాసర, కార్తీక మాసం నోములు, వ్రతాలకు వేర్వేరు చోట్లకుపోతూ అప్పుడప్పుడూ బెంగళూరు, గోవా జాలీ ట్రిప్పులు మొదలు పెట్టారు.

సంవత్సరం తర్వాత అప్పులు తేలాయి. బ్యాంక్ ఇన్‌స్టాల్‌మెంట్ కట్టి ఆర్నెల్లయింది. బ్యాంక్ మేనేజర్ రికవరీ ఏజెంట్‌ని పంపిస్తే తప్పించుకుని తిరగసాగాడు ఏడుకొండలు. రికవరీ ఏజెంట్ మాజీ గూండా. వాడికి పట్టుదల పెరిగింది. పాలిషింగ్ యూనిట్లో దొరకబుచ్చుకుని డబ్బు కట్టమని నిలేశాడు. ఏడుకొండలు లెక్కచెయ్యలేదు. ఇద్దరూ బూతులు తిట్టుకున్నారు. నువ్వెంతంటే, నువ్వెంతని కేకలేసుకున్నారు. తర్వాత చేతులు కలిశాయి. గూండా ఏడుకొండల్ని విసిరి కొడితే వెళ్లి రాళ్ళమీద పడ్డాడు. కణతకు దెబ్బతగిలి అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు.

పని చేస్తున్న వర్కర్స్ రికవరీ ఏజెంట్‌ని పట్టుకుని కట్టేశారు. ఏడుకొండలు సత్యానికి బావ వరస అవుతాడు. చంద్రకళ లబోదిబోమని ఏడుస్తూ సత్యానికి ఫోన్ చేసింది.

"అన్నాయ్! మన ఏడుకొండల్ని బ్యాంక్ రికవరీ ఏజెంట్ కొట్టిచంపేశాడంట. మనం వెళ్ళాలి" అన్నాడు సత్యం.

"పద" అని చెన్నకేశవులు పాలిషింగ్ యూనిట్ దగ్గరికి సత్యాన్ని తీసుకుని బయల్దేరాడు.

చంద్రకళ ఏడుస్తూ వచ్చి సత్యాన్ని వాటేసుకుంది. ఏడుస్తూనే జరిగిందంతా చెప్పింది.

ఇంతలో పోలీసులు వచ్చారు. రికవరీ ఏజెంట్‌ని స్టేషన్‌కి తీసుకెళ్లారు. ఏడుకొండలు శవాన్ని హాస్పటల్‌కి తీసుకెళ్లారు.

యూనియన్ లీడర్ బ్రహ్మయ్య వచ్చి చంద్రకళను ఓదార్చాడు. బ్యాంకు రుణం రెండు లక్షలు మాఫీ చేయిస్తాననీ, దిగులు పడొద్దని చెప్పిపోయాడు.

మర్నాడు చెన్నకేశవులు తన వ్యూహాన్ని అమలు పరిచాడు. ఏడుకొండలు శవాన్ని ఊరేగింపుగా మోసుకెళ్లి బ్యాంక్ ముందు షామియానా వేయించాడు. మేనేజర్‌కి చెమటలు పట్టి తాళం వేసుకుని పోలీసులకు ఫోన్ చేశాడు.

ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు వచ్చి చెన్నకేశవుల్ని బ్యాంక్ లోపలికి పిలిచి మేనేజర్ దగ్గర కూర్చోబెట్టాడు.

"సారీ అండీ! ఇట్లా జరుగుతుందని అనుకోలేదు" అని మేనేజర్ విచారం వ్యక్త పరిచాడు.

"ఇదేం పద్ధతండీ? వడ్డీ వ్యాపారులు రౌడీల్ని రికవరీకి పంపిస్తే కాస్త అర్థం వుంటుంది. బ్యాంకుల వాళ్ళుకూడా రౌడీల్ని, గూండాల్ని రికవరీకి పంపిస్తే ఏమనాలి? " అన్నాడు చెన్నకేశవులు.

"మేము ఎవర్ని పంపినా వూరికే బెదిరించి రమ్మంటాం కాని ఇట్లా దౌర్జన్యం చేయమని చెప్పమండీ" అన్నాడు మేనేజర్.



"మీరు చెప్పినా చెప్పకపోయినా రౌడీల పద్ధతి అదేగా! వాళ్ళు ఆ విధంగానే చేస్తారు"

"ఇదంతా ఎందుకు చెప్పండి చెన్నకేశ వులు గారూ? జరిగిందానికి ఇప్పుడు ఏమ నుకుని ఏమి లాభం? జరగవలసింది ఏమిటో ఆలోచిద్దాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్ మధ్యలో కలిగించుకుని.

"ఔనండీ మనం ఎంత అనుకున్నా పోయిన ప్రాణం తిరిగిరాదు" అన్నాడు మేనేజర్ వంతపాడుతూ.

"మీరేం చేస్తారో చెప్పండి? " అడిగాడు చెన్నకేశవులు.

"లోన్ రెండు లక్షల చిల్లర రద్దు చెయ్య మని హెడ్డాఫీసుకి రాస్తానండీ. స్పెషల్ కేసుగా వాళ్ళు ఒప్పుకుంటారు. ఇక అప్పు కట్టమని మీ దగ్గరికి వచ్చే ప్రసక్తిలేదు. యూనియన్ లీడర్ బ్రహ్మయ్యతో ఆల్రెడీ చెప్పానండీ" అన్నాడు మేనేజర్.

"మధ్యలో యూనియన్ లీడర్‌తో చెప్పడం ఏమిటి? " ప్రశ్నించాడు చెన్నకేశ వులు.

"ఆయనేనండీ ఏడుకొండలకి లోన్ ఇప్పించింది. ఆయన షూరిటీ సంతకం చేస్తేనే లోన్ శాంక్షన్ చేశాం" అన్నాడు మేనేజర్.

"అదంతా లోన్ ఇవ్వడం గురించి. నేను అడుగుతున్నది మీ బ్యాంక్ వాళ్ళు చేసిన మర్డర్ గురించి"

మర్డర్ అనే మాట వినగానే అదిరిపడ్డాడు మేనేజర్. టవల్‌తో ముఖానికి పట్టిన చెమట తుడుచుకున్నాడు.

"లోన్ మాఫీ చేయడం సరే, ఏడుకొండల్ని మర్డర్ చేసినందుకు నష్టపరిహారం ఎంత ఇస్తారో అది చెప్పండి" గట్టిగా అన్నాడు చెన్నకేశవులు.

"మీరు మర్డర్ మర్డర్ అంటారేమిటండీ? మేము మర్డర్ చెయ్యమని రికవరీ ఏజెంట్‌ని పంపించామా? ఆర్నెల్లనుంచి ఇన్‌స్టాల్‌మెంట్ కట్టడం లేదు. అడగడానికి వెళ్లిన వాడిని బూతులు తిట్టి కొట్టబోయాడు. మనిషన్నాక బూతులు తిడితే ఎవరికైనా రోషం వస్తుంది కదండీ. దురదృష్టవశాత్తు తగలరాని చోట దెబ్బతగిలి పోయాడు. అలా జరుగుతుందని ఎవరూ వూహించరు కదండీ? " అన్నాడు మేనేజర్.

"మీరెన్ని కబుర్లు చెప్పినా ఏం లాభం లేదు. మర్డర్ జరిగింది నిజం. చెప్పండి, నష్టపరిహారం ఎంతిస్తారు? "

మేనేజర్ ఇన్‌స్పెక్టర్ ముఖంవైపు చూశాడు.

"సరేనండీ! భార్యాపిల్లలు వున్నవాడు. వారికి ఆధారం లేదు. లోన్ మాఫీ చేసి, లక్ష రూపాయలు ఇప్పిస్తాను" అన్నాడు మేనేజర్.

"ఇరవై లక్షలు ఇవ్వండి" చెన్నకేశవులి కంఠం కంచులా మోగింది.

మేనేజర్ నెత్తిన బాంబ్ పడినట్లు అదిరిపడ్డాడు. ఇన్‌స్పెక్టర్ కళ్ళెగరేసి చెన్నకేశవులి వైపు చూశాడు.

"వాట్? "

"ఇరవై లక్షలు ఇచ్చేవరకు శవం ఇక్కడే వుంటుంది" అని విసురుగా బ్యాంక్‌లో నుంచి వెళ్లిపోయాడు చెన్నకేశవులు.

శవం పక్కనే కూర్చున్నాడు.

"ఇరవై లక్షలు నష్టపరిహారం ఇవ్వాలి" అని అరవసాగాడు.

అందరూ అదే స్లోగన్ అందుకున్నారు.

టీవీ యాంకర్లు, కెమేరామేన్లు వచ్చేశారు. దేశమంతా బ్యాంక్ రికవరీ ఏజెంట్ దౌర్జన్యం, ఏడుకొండలు చనిపోవడం టెలికాస్ట్ అవడం మొదలైంది.

మేనేజర్ పరిస్థితినంతా హెడ్డాఫీసుకి వివరంగా చెప్పాడు. టీవీలో చూడమన్నాడు. శవం బ్యాంక్ ముందే వుందనీ, డబ్బు ఇస్తేకాని కదలదనీ మొత్తుకున్నాడు. వాళ్లు తిట్టే తిట్లన్నీ మౌనంగా భరించాడు.

కాసేపు ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడించాడు. రాజీపడితే తనకి అభ్యంతరం లేదనీ, లేకపోతే మేనేజర్ని, రికవరీ ఏజెంట్‌నీ అరెస్ట్ చేసి కేసుపెట్టి కోర్టుకి పంపిస్తానని అన్నాడతను.

బ్యాంక్ దౌర్జన్యం దేశవ్యాప్తంగా తెలిసిపోయి చెడ్డపేరు రానే వచ్చింది. ఇక కేసుల కోసం కోర్టుల చుట్టూ తిరగడం ఎందుకని అర్జెంట్‌గా బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ మీటింగ్ పెట్టుకుని ఏడుకొండలు భార్య చంద్రకళకు ఇరవై లక్షలు నష్టపరిహారం మంజూరు చేశారు.

బ్యాంక్ మేనేజర్ షామియానాలోకి వచ్చి చంద్రకళ చేతికి ఇరవై లక్షల చెక్ అందించాడు.

"చెన్నకేశవులూ జిందాబాద్" అనే హర్ష ధ్వానాలు మిన్నుముట్టాయి.

యూనియన్ లీడర్ బ్రహ్మయ్య ముఖం నల్లబడింది.




ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు కోర్టు నుంచి వచ్చిన అఫిడవిట్ చదివి షాక్ తిన్నాడు.

చెంచురామారెడ్డి జిల్లా కోర్టులో ప్రైవేటు కేసు దాఖలు చేశాడు. తన తండ్రి చింతలపూడి సుబ్బారెడ్డి కరీం ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ లారీ చేసిన యాక్సిడెంట్‌లో చనిపోయాడనీ, డ్రైవర్ని ఇంతవరకు అరెస్ట్ చేయలేదనీ, కేసు పెట్టలేదనీ, ఇది కేవలం యాక్సిడెంట్ కాదనీ, ఎవరో ప్రత్యర్థులు చేయించిన కుట్రగా తన అనుమానమనీ, వెంటనే చర్యలు తీసుకుని దోషులను శిక్షించాలని అఫిడవిట్ దాఖలు చేశాడు. అందులో ప్రత్యర్థులుగా అబ్దుల్ కరీం ఖాన్, ప్రొప్రయిటర్ కరీం ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ, ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్, మునికొండ ఉన్నారు.

ఇన్‌స్పెక్టర్ అఫిడవిట్ పట్టుకుని పబ్లిక్ ప్రాసిక్యూటర్ దగ్గరికి గుంటూరు పరిగెత్తాడు.

డ్రైవర్‌ని గుర్తించామనీ, రసూల్ అనే డ్రైవర్ పరారీలో వున్నాడనీ, మునికొండలో వున్న అద్దెఇల్లు ఖాళీచేసిపోయారనీ, అతని కోసం గాలిస్తున్నామనీ, ఎవరో చేయించిన యాక్సిడెంట్ కాదనీ, ప్రమాదవశాత్తు జరిగిందేనని ఆర్.టి.ఏ. ఇచ్చిన సర్టిఫికెట్ వలన నిర్ధారణ అయిందనీ, డ్రైవర్ దొరికిన తర్వాత కోర్టులో హాజరు పరుస్తామనీ కౌంటర్ అఫిడవిట్ దాఖలు చేసి వూపిరి పీల్చుకున్నాడు రంగూన్ రామారావు.

కోర్టు నోటీసులు అందుకున్న కరీంఖాన్‌కి గూడా చిరాకుగా వుంది. చెన్నకేశవుల్ని గుంటూరు పంపించి లాయర్ని మాట్లాడి కౌంటర్ దాఖలు చెయ్యమన్నాడు.

చెంచురామారెడ్డి తన తండ్రికి జరిగిన యాక్సిడెంట్ గురించి కూపీ లాగుతున్నాడనీ, అది యాక్సిడెంట్ కాదని అనుమానించాడనీ ఇన్‌స్పెక్టర్‌కి అర్థమైపోయింది. ఇప్పుడు రసూల్ దొరికితే డొంక కదులుతుందని జంకు కలిగింది.

సింగయ్య నాయుడు గూడా ఎక్కువగా హైదరాబాద్‌లోనే వుంటున్నాడు. అప్పుడప్పుడు మునికొండ వచ్చి వెళ్తున్నాడు. ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్ పనుల్లో బిజీగా వున్నాడు.

ఇటువంటి విషయాలు ఫోన్‌లో మాట్లాడితే ప్రమాదమని రంగూన్ రామారావుకి తెలుసు. అందుకే సింగయ్య నాయుడు రాగానే వెళ్ళి కలుసుకున్నాడు.

"చెంచురామారెడ్డి కోర్టులో కేసు వేశాడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఎవరిమీద? "

"ఇంకెవరిమీద. మా డిపార్ట్‌మెంట్ మీదే. కరీమ్‌ని గూడా చేర్చాడు"

"వెయ్యనీ? ఏమవుతుంది? " తేలిగ్గా అన్నాడు సింగయ్యనాయుడు.

"డ్రైవర్ దొరికితేనే ప్రమాదం"

"ఎక్కడ దొరుకుతాడు? ఊరొదిలిపెట్టి పారిపోయాడుగా? " అని నవ్వాడు.

"ఏమో? కరీంగాడు భయపడి వాడి ఆచూకీ చెప్తే డేంజరే"

"కరీం కాదు డేంజర్. వాడి మేనేజర్ చెన్నకేశవులు. గుండెలు తీసిన బంటు, యూనియన్ లీడర్ బ్రహ్మయ్య మొత్తుకుంటున్నాడు. వాడు అన్నిట్లోకి తలదూర్చి

సెటిల్‌మెంట్లు చేస్తున్నాడనీ, లేబర్ వాడంటే పడిచస్తున్నారనీ, తన పలుకుబడి క్షీణిస్తున్నదనీ భయపడుతున్నాడు"

"బ్రహ్మయ్యకేం భయం సార్! పార్టీ అతన్ని కాదంటుందా? పార్టీ ఫండ్ అని భారీగానే ఇస్తుంటాడుగా. అతన్ని తీసేసి వేరే వాడిని యూనియన్ లీడర్‌గా చేస్తారా? అతనికి బాగా పట్టుంది పార్టీలో. ఎంత సంపాదించుకున్నా పట్టిం చుకోరు"

"అలా కాదులే. పట్టు సడలడం తెలిసి పోతుంది వాళ్ళకి. సెటిల్‌మెంట్లన్నీ చెన్న కేశవులు చేస్తుంటే మధ్యలో నీదేంది? నీకెందుకియ్యాలి విరాళాలు? అనేది ముందు ముందు వస్తుందని భయం. అసలు చెన్నకేశవులు ఏ కెపాసి టీతో జోక్యం చేసుకుంటున్నాడో నాకు అర్థం కావడంలేదు. బ్యాంక్ వాళ్ళని బెది రించి ఇరవై లక్షలు ఇప్పించాడంటనే? "

"వాడు లీడర్‌నని రావడంలేదు. వాళ్ళంతా వాడికి బీరకాయ పీచు చుట్ట రికం. క్వారీ యాక్సిడెంట్‌లో తన తమ్ము డన్నాడు. బ్యాంక్ వాళ్ళ కేసులో తమ బామ్మర్ది అన్నాడు. మనం ఏమంటాం? "

"సరే. అందుకే వాడిని అక్కడ్నుంచి లేపే ఉపాయం ఆలోచించు".

"నేను కరీం లారీలు పట్టుకుని ఏదొక కేసు పెడుతుంటాను. హైదరాబాద్‌లో కరీంని బెదిరించండి. చెన్నకేశవులు బదులు వేరే మేనేజర్ని పెట్టుకోకపోతే ట్రాన్స్‌పోర్ట్ నడవదని చెప్పండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"దాందేముంది? హోమ్ మినిస్టర్ పేషీ నుంచి ఫోన్ చేయిస్తాను" అన్నాడు సింగ య్యనాయుడు.

★ ★ ★

ఆ రోజు ఒక రాజకీయపార్టీ పిలుపు మేరకు బంద్ జరుగుతోంది. లంచ్ టైములో సత్యం తెచ్చిన కేరేజీ షేర్ చేసు కుని తిన్నాడు చెన్నకేశవులు. సాయం కాలం కాగానే సత్యం డ్రామా రిహార్సల్స్ వున్నాయని వెళ్ళిపోయాడు. వాడికి వేషాల పిచ్చి వుంది. చీకటి పడగానే ఆఫీసుబాయ్ వెళ్ళిపోతానని అడిగాడు. హోటల్లో కేరేజీ తెచ్చిపెట్టి పొమ్మన్నాడు చెన్నకేశవులు. వెళ్లిన వాడు వెంటనే తిరుగుటపాలో వచ్చే శాడు.

"సార్! హోటళ్ళన్నీ బంద్" అన్నాడు.

"సరే నువ్వెళ్ళు" అన్నాడు చెన్నకేశ వులు.

'ఈ రాత్రికి ఉపవాసం వుంటే బెట రేమో? ' అనుకున్నాడు. ఆఫీస్‌బాయ్ తాళం వేసి ఇచ్చి వెళ్ళిపోయాడు. ట్రాన్స్ పోర్ట్ ఆఫీసు వెనుకే వున్న రూమ్‌కి వెళ్లి స్నానంచేసి, టీవీలో న్యూస్ చూస్తూ కూర్చున్నాడు.

సెల్‌ఫోన్ రింగైంది. ఎప్పుడూ వచ్చే కాల్ నెంబర్లన్నీ తెలిసినవే. ఇదేదో కొత్త నెంబర్ లాగుందే అనుకుని బటన్ నొక్కి "హలో..." అన్నాడు.

"నేనండీ చంద్రకళని"

"ఓ.. నువ్వా? ఏమిటి సంగతి? బాగు న్నావా? "

"బాగున్నానండీ."

"పిల్లలు బాగున్నారా? స్కూలుకెళ్తు న్నారా? "

"అంతా బాగున్నామండీ"

"ఏమిటి విశేషాలు? "

"ఈ పూట మా ఇంటికి భోజనానికి రండి."

"భోజనానికా? ఎందుకులే!"

"మీరు హోటల్లో భోజనం చేస్తా రుగా? "

"ఔను."

"ఈ రోజు బంద్‌గదా? ఎక్కడ భోజనం చేస్తారు? మొహమాటపడకండి. రండి. మీ

కోసం ఎదురుచూస్తుంటాను"

అని చంద్రకళ ఫోన్ కట్ చేసింది.

'ఉపవాసం చేసే ఛాన్స్ పోయింది' అనుకుంటూ లేచి డ్రెస్ చేసుకుని బయల్దే రాడు.

బైక్ శబ్దం విని చంద్రకళ గేటు తెరిచి నిల్చుంది. చెన్నకేశవులు బైక్ పార్కు చేశాడు.

అది కొత్తపేటలో ఇండిపెండెంట్ ఇల్లు. చుట్టూ కాంపౌండ్ వుంది. మూడొందల గజాల ప్లాట్‌లో కొత్తగా కట్టింది. డాబా పైకి మెట్లున్నాయి.

"రండి..." అని లోపలకు దారి తీసింది చంద్రకళ.

"ఇల్లు మీ స్వంతమేనా? " అడిగాడు ఆమె వెనుకే నడుస్తూ.

"స్వంతమా పాడా? అద్దెదే" అని నవ్వింది.

చంద్రకళ నవ్వితే బుగ్గలు సొట్టలు పడి అందంగా ఉంటుంది. ఆమెకు ముప్పై ఏళ్ళుంటాయి. ఎత్తుగా, పుష్టిగా ఉంటుంది. ముఖాన దోసగింజంత బొట్టుబిళ్ళ అతికించుకుంది. తెల్లటి కాటన్ చీర కట్టుకుంది.

హాల్లో సోఫాసెట్, టీవీ ఉన్నాయి. రెండు బెడ్ రూములు, కర్టెన్స్‌తో ఇల్లంతా నీట్‌గా ఉంది.

"పిల్లలు ఎక్కడ? " అన్నాడు ఇల్లంతా కలయజూస్తూ.

"నిద్రపోయారు" అన్నది.

"అప్పుడే? " అన్నాడు వాచ్‌వైపు చూసి.

"రేపు స్కూలుకి వెళ్ళాలి. ఎనిమిదింటికే స్కూల్‌బస్ వచ్చేస్తుంది. అప్పటికి వారిని రెడీ చేసి టిఫిన్ బాక్స్ సర్దేయాలి. పెందరాళే పడుకోబెట్టకపోతే పొద్దున్నే లేవరు. నాకు వీళ్ళదే పెద్ద పని" అన్నది చంద్రకళ.

"రండి లోపలకి" అని బెడ్‌రూమ్‌లోకి దారి తీసింది.

అతను లోపలకు వెళ్ళాడు. లుంగీ తీసి ఇచ్చింది బెడ్‌రూమ్‌లో. కాళ్ళు కడుక్కోమని బాత్‌రూమ్ తెలుపులు తీసి లైట్ వేసింది.

"లుంగీ ఎందుకు? అవసరం లేదు" అన్నాడు.

"ప్యాంట్‌తో ఎలా తింటారు? ఏం తింటారు? పొట్ట వత్తుకుపోయి ఉంటుంది కదా? లుంగీ కట్టుకుంటే ఫ్రీగా ఉంటుంది" అన్నది.

"నేను రోజూ అలాగే తింటాను."

"హోటల్ తిండి ఏం సహిస్తుంది? తిన్నదే చాలనుకుంటారు" అన్నది.

బాత్‌రూమ్‌లోకెళ్ళి ప్యాంట్ హేంగర్‌కి తగిలించి లుంగీ కట్టుకుని వచ్చాడు. ఈ లోపల డబుల్ కాట్ బెడ్డుకి దగ్గరగా టీపాయ్ వేసింది. టీపాయ్ మీద విస్కీ

## పరమాత్మను తెలుసుకోవచ్చా?

'సమాధి స్థితిలో మనిషి పరమాత్మను తెలుసుకుంటాడు. అక్కడ మనిషి మూగగా మారుతాడు. అతడికి దాన్ని వివరించడం సాధ్యంకాదు, అనుభూతి చెందడం తప్ప' అన్నారు ఓసారి రామకృష్ణ పరమహంస. 'అదెలాగో అర్థమయ్యేలా చెప్పండి' అన్నారు శిష్యులు.



'ఓసారి ఉప్పుబొమ్మ సముద్రం లోతును కొలుద్దామని వెళ్లింది. లోకానికి ఆ నీళ్లు ఎంతో లోతున్నాయో చెప్పాలనుకుంది. అయితే ఆపనిని అదెప్పటికీ చేయలేదు. కారణం అది నీటిలో మునిగిన తర్వాత వెనువెంటనే కరిగిపోతుంది. పరమాత్ముడిని తెలుసుకోవడం ఇలాంటిదే' అన్నారు.

బాటిల్, గ్లాసు, సోడా, ప్లేటులో జీడిపప్పు పెట్టివున్నాయి.

అతను బెడ్‌మీద కూర్చుని "ఇవన్నీ ఏమిటి? " అన్నాడు.

"మీ అలవాటు నాకు తెలుసు" అన్నది.

"అలవాటేం లేదు. ఏదో అప్పుడప్పుడు" గొణుగుతున్నట్లు అన్నాడు.

"ఆయన నాన్‌వెజ్ వండితే ఇది తాగే వాడు. బాగా తినబుద్ధిగా ఉంటుంది అనే వాడు. అట్లాగే తినేవాడు.

"ఐతే నాన్‌వెజ్ వండావా? "

"ఆc.."

"ఈ రోజు బంద్ గదా? ఎలా దొరి కాయి."

"బంద్ రోజే ఇటువంటివి బాగా దొరు

**చిన్నప్పుడు**
**ఎదగాలని ఆత్రం**
**పెద్దప్పుడు**
**చిన్నగా కనబడాలని**
**తాపత్రయం**

**– ఆర్.ఎస్. హైమవతి,**
**చెన్నై**



కుతాయి. బంద్ చెయ్యడానికి పొద్దున హడావుడిగా తిరిగి షాపులు మూయి స్తారు. మధ్యాహ్నం వరకు మూస్తారు. తర్వాత నెమ్మదిగా తెరుస్తారు" అన్నది.

ఆమె నిలబడే ఉండడంచూసి "కూర్చో" అన్నాడు.

చంద్రకళ కుర్చీ తెచ్చుకుని వేసుకుంది. అతని ఎదురుగా కూర్చుంది.

"మొదలుపెట్టండి" అన్నది.

"నాకు ఒక్కడికే తాగబుద్ధికాదు. కంపెనీ ఉంటే సరదాగా కబుర్లు చెప్పు బాగుంటుంది."

"నిజమా? "

"ఔను. నువ్వూ గ్లాసు తెచ్చుకో"

"అబ్బే వద్దండీ."

"ఎప్పుడూ తీసుకోలేదా? "

"అప్పుడెప్పుడో బెంగుళూరు వెళ్ళినప్పుడు కళ అని నా ఫ్రెండ్ బలవంతంగా తాగిం చింది. అక్కడ ఆడపిల్లలు పబ్బులకెళ్ళి తాగుతారని చెప్పింది."

"ఇప్పుడు మన హైదరాబాద్‌లో గూడా పబ్బులు మొదలయ్యాయి. ఆడ మగ కలిసే తాగుతున్నారు. మారిపోతూ ఉంటుంది కాలం. ఎవరూ ఆపలేరు" అన్నాడు.

"తాగి డ్యాన్సులు గూడా చేస్తారటగా!"

"ఏమో? నేనెప్పుడూ వెళ్ళలేదు. గ్లాసు తెచ్చుకో. ఇదేం తప్పుకాదులే" అన్నాడు.

చంద్రకళ ఫ్రిజ్ తెరిచి కోకాకోలా సీసా తెచ్చి ఎదురుగా పెట్టుకుని "కంపెనీ ఇస్తు న్నాగా! కానివ్వండి" అన్నది నవ్వుతూ.

చెన్నకేశవులు విస్కీ గ్లాసులోకి వంపు కుని సోడా పోశాడు.

"ఛీర్స్...!" అన్నాడు.

"మీరింకా పెళ్ళెందుకు చేసుకోలేదు? " అడిగింది చంద్రకళ.

అతని ముఖం గంభీరంగా మారిపో యింది.

"నీకు నా గురించి తెలియదు. నాకు చిన్నతనంలోనే మా నాన్న పోయాడు. మా అమ్మపై దొంగతనం చేసిందనే నేరం మోపి పోలీసులు కొట్టి చంపారు. నేను ఇంట్లో నుంచి పారిపోయాను. లారీ ఆఫీ సులో బాయ్‌గా పనిచేశాను. క్లీనర్‌గా లారీలు కడిగాను. డ్రైవింగ్ నేర్చుకున్నాను. దేశమంతా తిరిగాను. నాకు ఎవరు న్నారు? ఒంటిరిగాడిని. నా పెళ్ళి గురించి ఎవరు పట్టించుకుంటారు? తాడూ బొంగరం లేనివాడిని. నాకు పిల్లనివ్వడా నికి ఎవరు ఒప్పుకుంటారు? "

తను పోలీస్ ఇన్‌స్పెక్టర్ని కొట్టి పారిపోవడం అదంతా వివరంగా చెప్పాడు..

"మీరు ఒంటరిగా అక్కడ రూమ్‌లో ఏం ఉంటారు? ఈ రూమ్ మీకు ఇస్తాను. బైటనుంచి గూడా మరొక దారివుంది. ఇందులో ఉండండి" అన్నది చంద్రకళ.

"బాగుండదులే" అన్నాడు.

"ఇందులో బాగా లేకపోవడానికి ఏముందండీ. మీరు నాకు ఎంతో చేశారు. మీకు వండిపెట్టడం నాకు పెద్ద పనేం కాదు. హోటల్లో ఏం తింటారు? ఎన్నాళ్ళు తింటారు? " అన్నది.

"చూద్దాంలేగాని నాకివాళ భోజనం పెట్టాలని ఎందుకు అనిపించింది? " అన్నాడు.

"మీకు భోజనం పెట్టాలని ఎన్నాళ్ళుగానో అనుకుంటున్నాను. ఈ రోజు బంద్ అని తెలియగానే, మీరు హోటల్లో తింటారని తెలుసు గనుక ధైర్యం చేసి పిలిచాను. మీరు వస్తారో, రారో అని అనుకున్నాను. రాకపోతే నేను బాధపడేదాన్ని. ప్రమాణం చేసి చెప్తున్నాను. నాకు మీరు దేవుడిలాంటి మనిషి" అంటూ ఉంటే చంద్రకళకి దుఃఖం ఆగలేదు. ఆమె కళ్ళ నుంచి కన్నీళ్ళు బొటబొట కారాయి.

చెన్నకేశవులు అప్రయత్నంగా ఆమె కన్నీళ్ళు తుడిచాడు.

"ఛ... ఇప్పుడు ఎందుకు ఏడుస్తున్నావు? " అన్నాడు.

★ ★ ★

కరీం ట్రాన్స్‌పోర్ట్ లారీల మీద పోలీసులు, ఆర్.టి.ఏ. ఆఫీసర్లు కన్నేశారు. ఓవర్ లోడుందనీ, వేబిల్స్ లేవనీ, క్లీనర్ లారీ నడుపుతూ పట్టుపడ్డాడనీ కేసులు పెట్టి పెనాల్టీ వేస్తున్నారు.

హైదరాబాద్‌లో ఉన్న కరీంకి హోమ్ మినిస్టర్ పేషీ నుంచి వార్నింగ్ కూడా వచ్చింది. కొన్ని గ్రానైట్ కంపెనీల లోడ్‌లు మాత్రమే వస్తున్నాయి.

కరీం చెన్నకేశవులికి చాలాసార్లు హితబోధలు చేశాడు.

"నువ్వు బచ్చాగాడివి. అక్కడ నీ పని నువ్వు చేసుకోరా! రాజకీయాలు నీకెందుకు? నీ వల్ల బిజినెస్ బంద్ అయ్యేట్టుంది. ఎందుకు చెప్తున్నానో అర్థం చేసుకో!"

"నేను రాజకీయాలు చెయ్యడం లేదు భాయ్. మా వాళ్ళకి సపోర్టు చేస్తున్నా. అన్యాయం జరిగితే అడగడం గూడా తప్పేనా? నేనేం లీడర్ కావాలనుకోవడం లేదు" అన్నాడు చెన్నకేశవులు.

కరీం మీద ఒత్తిడి పెరిగింది.

"ముస్తాఫాని పంపిస్తున్నాను. అన్నీ వాడికి అప్పజెప్పి ఇక్కడికి వచ్చేసెయ్. ఈ ఆఫీసులో ఉందువుగానిలే. ఏమంటావు? " అన్నాడు ఒకరోజు కరీం.

"సరే భాయ్" అన్నాడు.

మర్నాడు ముస్తాఫాకి కరీం ట్రాన్స్‌పోర్ట్ మేనేజర్ చార్జి అప్పజెప్పాడు.

"అన్నాయ్! నువ్వు హైదరాబాద్ వెళ్ళిపోతావా? " దిగులుగా అన్నాడు సత్యం.

"ఇక్కడేం చేయాలిరా? ఉద్యోగం ఎక్కడుంటే అక్కడికి పోవాలిగా? " అని నవ్వాడు చెన్నకేశవులు.

"ఇదేం ఉద్యోగం అన్నాయ్! ఇది లేకపోతే బతకలేమా? మనమే రెండు లారీలు కొని బ్రోకర్ ఆఫీస్ పెడదాం. నువ్వుంటే మాకు ఎంతో ధైర్యం. ఇక్కడ చెయ్యాలంటే చాలా పనులుంటాయ్"

"లారీ వ్యాపారంలో చాలా రిస్కులుంటాయిరా! అందరికీ అచ్చిరాదు."

"రిస్కులేని వ్యాపారం ఏముంటుంది? ప్రతిదాంట్లో ఉంటుంది. రిస్కులేని పని అని ఎన్నాళ్ళు ఒకడి దగ్గర పని చేస్తాం? బాగుపడ్డానికి ట్రై చెయ్యాలిగదా!"

"వద్దులేరా! ఇప్పటికే మనమీద

అందరూ పడి ఏడుస్తున్నారు"

"ఏడ్చేవాళ్ళు ఏడుస్తారులే! నవ్వేవాళ్ళు నవ్వుతారు. నువ్వనేది ఎమ్మెల్యే గురించేగా? వాళ్ళ ఆశకి అంతులేదు. ఎన్ని కోట్లు సంపాదించినా తృప్తి లేదు. సముద్రంలోకి ఎన్ని నదులు కలిసినా నిండనట్లు, ప్రపంచలోని సంపదంతా ఇచ్చినా వాళ్ళ కుటుంబం చాలు అనరు. ఊళ్ళో ఎన్ని వ్యాపారాలు చేస్తున్నారు? బట్టల షాపులు, హోటళ్ళు, గ్రానైట్ క్వారీలు, కాంట్రాక్టులు, ముందు ముందు పళ్ళు, కూరగాయల వ్యాపారం గూడా

> **పొద్దు తిరుగుడు పువ్వు**
> **ఎప్పుడూ**
> **పాలక పార్టీతోనే 'లవ్వు'**
>
> *– పొనుగోటి నరసింహారావు,*
> *దుబ్బాక,*
> *నల్గొండ జిల్లా*
>
> హాస్యాత్మ...
>
> 

చేస్తారు. ఈ ఊళ్ళో ఇంకా ఎవడూ బతక్కూడదు. వాళ్ళని ఎదిరించి నిలబడే మనిషి ఉండగూడదు."

"సర్లేరా! దేశమే అట్లా నడుస్తోంది. వీళ్ళని అని ఏం ప్రయోజనం? ఆంబోతులు పొట్లాడుకుంటుంటే లేగదూడలు నలిగి చచ్చాయని, మనకెందుకు పోనీ"

"మనకెందుకులే అని ఊరుకుంటే ఎట్లా అన్నాయ్! అవసరమైనప్పుడు బైటకు రావాలిగా? నా కళ్ళముందే పల్లెటూరు పట్నమైపోయింది. భూములున్న వాళ్ళు బాగుపడ్డారు. చాలామంది హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. స్తోమత ఉన్న వాళ్ళంతా అమెరికా, ఆస్ట్రేలియా అని వెళ్ళిపోతున్నారు. మన వాళ్ళంతా లేబర్. ఇప్పటికీ స్వంత ఇళ్ళు లేవు. క్వారీల్లో మాడిపోతూ చెమటలు కారిస్తే తప్ప బతుకు లేదు. హోటల్లో కప్పులు కడిగేవాళ్ళు, లారీ క్లీనర్లు డ్రైవర్లు, ఇంకా కూలీపనులు చేసేవాళ్ళు మనవాళ్ళే. వీళ్ళంతా ఎప్పటికి బాగుపడతారంటావు? "

"ఎప్పటికీ బాగుపడరు"

"పోనీ మనం బాగుపడి చూపిద్దాం. మనల్ని చూసి మరికొందరు బాగు పడాలని ఆలోచిస్తారు"

"నువ్వనేదేమిట్రా? "

"నువ్వు ఇక్కడే వుండు అన్నాయ్! లారీ వ్యాపారం రిస్క్ అనుకుంటే ఏడుకొండలు పాలిషింగ్ యూనిట్ పని చేసేవాళ్ళు లేక మూలపడివుంది. అది ఓపెన్ చేద్దాం. నువ్వు చంద్రకళ ఇంట్లో ఒక రూమ్ తీసుకుని ఉండు" అన్నాడు సత్యం.

"చంద్రకళ ఇంట్లో రూమా? " అని ఆశ్చర్యపోతూ సత్యం వైపు చూశాడు చెన్నకేశవులు.

చంద్రకళ తనకు డిన్నర్ ఇచ్చిందని వీడికి తెలుసా? తన ఇంట్లో రూమ్ ఇస్తానని తనతో అన్నది. వీడూ అదేమాట అంటున్నాడు. ఆ విషయం వీడితో ప్రస్తావించిందా?

"ఔను, అంత పెద్ద ఇల్లు ఏం చేసుకుంటుంది? ఇద్దరు చిన్నపిల్లలు."

"చంద్రకళ ఒంటరి ఆడది. నేను ఆ ఇంట్లో రూమ్ తీసుకుంటే ఏం బాగుంటుందిరా? అందుకు ఆమె ఒప్పుకుంటుందా? "

"ఎందుకు ఒప్పుకోదూ? ఒంటరి ఆడది కాబట్టే నిన్ను ఉండమంటున్నాను. దాని దగ్గర డబ్బుంది. అందరి కళ్ళూ పడ్డాయి. దానితమ్ముడు తోకల కోటయ్య తాగుబోతు ఎదవ. డబ్బుకోసం పీడిస్తున్నాడు. ఇక అక్కమొగుడు తమలపాకుల తిమ్మయ్య అని, వాడు దీన్ని పెళ్ళిచేసుకుంటానని గొడ

వట. ఆ బజార్లో ఉన్న మొగోళ్ళ కళ్ళన్నీ దీని మీదే. నక్కల నాగేశ్వర్రావని చోటా లీడరులే. వాడు ఏదొక వంకబెట్టుకుని ఇంటికి వస్తుంటాడట. 'వయసులో వున్నావు జాగ్రత్త. ఒంటరిగా ఉండగూడదు నువ్వు. తోడొకరుండాలి' అంటూ వెర్రిమొర్రి చేష్టలు చేస్తున్నాడట."

"ఇవన్నీ నీకెలా తెలుసురా?"

"నా దగ్గర చనువుంది కాబట్టి చెప్పుకుని కళ్ళనీళ్ళు పెట్టుకుంది. నువ్వు అక్కడుంటే ఎవడూ కన్నెత్తి చూడడు. చంద్రకళకి ధైర్యంగా ఉంటుంది. నేను బాగా ఆలోచించే చెప్తున్నాను. దానికి మనం తప్ప ఎవరున్నారు? ఉన్నవాళ్ళంతా దాని డబ్బుమీద కన్నేసినోళ్ళే"

"రేపు మనల్ని గూడా అట్లాగే అంటార్రా! సంబంధాలు అంటగడతారు."

"అట్లాగే కానియ్యి. దానికి ఇష్టమైతే పెళ్ళి చేసుకుందువుగానీ" అని నవ్వాడు సత్యం.

"చంద్రకళకి డబ్బు ఇప్పించినట్లు ఇప్పించి, వల్లో వేసుకుని కాజేశానని ఆడిపోసుకుంటార్రా!"

"ఎవడో ఏదో అనుకుంటే మనకెందుకు అన్నాయ్! నీ సంగతి గూడా ఆలోచించుకో. ఎన్నాళ్ళిట్లా ఒంటరిగా వుంటావు? నీకు వయసు మీరిపోలేదు. అది గూడా ఎప్పుడూ ఇట్లా ఉండలేదు. వయసులో వుంది. ఎప్పుడేం జరుగుద్దో చెప్పలేం"

"నువ్వు చంద్రకళ దగ్గర ఇట్లాగే మాట్లాడతావేరా?"

సత్యం నవ్వాడు.

"మన ఇళ్ళ దగ్గర కొన్నాళ్ళు అద్దెకుండే వాళ్ళులే. మన కులంవాడని ఏడుకొండల్ని బావ అనీ, దీన్ని అక్కా! అని పిలిచేవాడిని. సొంత మనిషిలా అన్ని సంగతులూ నాకు చెప్తుంది. నా కంటే పెద్దదైపోయింది. పైగా 'అక్కా!' అని పిలిచే సెంటిమెంట్ లేకపోతే నేనే దాన్ని పెళ్ళి చేసుకుని సెటిలైపోయేవాడిని. ఇరవై లక్షలు క్యాష్, ఇద్దరు కొడుకులు. ఎక్కడ దొరుకుతాయన్నా!" అన్నాడు సత్యం.

"నీ దగ్గర దారుణమైన తెలివి తేటలున్నాయిరా! బాగుపడతావు. పైకి వచ్చే ఆలోచనలేవున్నాయి" అని నవ్వాడు చెన్నకేశవులు.

"ఇంటికి పదన్నాయ్! అమ్మ నిన్నొకసారి ఇంటికి తీసుకురమ్మని గొడవ పెడుతోంది."

"ఎందుకులేరా! పెద్దమ్మ పెళ్ళి పెళ్ళి అని గొడవ పెడుతుంది. ఇప్పుడు చూడు. చేసే ఉద్యోగం పోయింది. పెళ్ళాం పిల్లలుంటే ఎంత బాధగా ఉండేది చెప్పు. పెళ్ళీ వద్దు, పెటాకులొద్దు. ఇప్పుడు ప్రాణానికి హాయిగా ఉంది" అన్నాడు

## ఎవరు మైలపడ్డారు?



మైఖేల్ మధుసూదన దత్త సుప్రసిద్ధ మానవతావాది, కవి. కానీ పరమ తాగుబోతు. అయితే పరమహంస వీలైనప్పుడల్లా తన శిష్యులవద్ద ఆయనను పొగిడేవారు. దీంతో ఓ శిష్యుడు అతడిని చూసి వచ్చి, 'త్రికాలాల్లోనూ మద్యపానంచేస్తూ, సంగీతాభ్యాసం సాగిస్తున్న ఆయనను చూసి మైలపడ్డాను. అందుకే గంగాస్నానం చేసొచ్చాను' అన్నాడు గురువుతో. దానికి పరమహంస 'మూడుపూటలా తాగినా ఆయన మైలపడలేదు కానీ, నువ్వు ఆయనను తక్కువ అంచనా వేసి మైలపడ్డావ్.. పరిహారంగా గంగాస్నానం చేసొచ్చావ్. శభాష్! ఆ మహానుభావుడు కవితాశక్తితో ప్రజలను జాగృతంచేస్తూ, వారిలో మానవత్వాన్ని పరిమళింపజేస్తున్నాడనేది మర్చిపోకు' అన్నారు చిరునవ్వుతో.

చెన్నకేశవులు.

"ముసిలాళ్ళు అట్లాగే అంటార్లే. నువ్వు పద" అని చెన్నకేశవుల్ని బయల్దేరదీశాడు సత్యం.

★ ★ ★

చెన్నకేశవులు, సత్యం ఇంటికి వెళ్తుంటే ఎదురుగా వచ్చాడు నడివయసులో వున్నాయన. నల్లగా పొట్టిగా ఉన్నాడు. తెల్లటి పంచె, లాల్చీ వేసుకున్నాడు. జుట్టు అక్కడక్కడ తెల్లబడి ఉంది.

సత్యాన్ని చూసి "అరే అయ్యా! బాగున్నావా? " అన్నాడు.

"బాగున్నాను బాబాయ్" అన్నాడు.

"అరే అయ్యా! బజ్జీలు తిందాంరా! ఇక్కడ కూర్చుంటా. తీసుకురా!" అన్నాడు రోడ్డు పక్కనే ఉన్న రావిచెట్టు చప్టామీద కూర్చుంటూ.

ఇక తప్పదన్నట్లు సత్యం బయల్దేరాడు వెనక్కి తిరిగి.

"ఎవర్రా ఆయన? ఎక్కడో చూసినట్లే ఉందే" అన్నాడు చెన్నకేశవులు సత్యంతో పాటు నడుస్తూ.

"చూసే ఉంటావులే. మనూళ్ళో మొదట రంగురాళ్ళు పడింది వీళ్ళ పొలంలోనే. ముట్లూరి కోటివీరయ్య కొడుకు పెద్ద సాంబయ్య.

"పొలంలో గ్రానైట్ వుంటే చాలా డబ్బులు వచ్చి వుండాలే"

"ఆ వచ్చాయి. అందుకే ఇట్లా అయిపోయాడు."

"ఏమైంది? మనిషేంటి చాలా తేడాగా కనిపిస్తున్నాడు?

బజ్జీలు తెమ్మన్నాడు. డబ్బులు బైటకు తియ్యడేంటి? "

సత్యం నవ్వాడు.

"ఆయన దగ్గర వుంటేగా పాపం."

"అదేం? "

"మతిస్థిమితం లేదు. మనిషికి డబ్బు విలువ తెలియదు. నాలుగు బజ్జీలు తిని వంద కాగితం ఇచ్చేస్తాడు. చిల్లర ఇచ్చినా తీసుకోడు. హోటల్‌కెళ్ళి పలావు తిని ఐదొందలు ఇచ్చి వస్తాడు. అందుకని డబ్బివ్వడం మానేశారు."

"అయ్యో పాపం. ఎందుకిట్టా పిచ్చోడైపోయాడు? "

"ఖర్మ అంటారే అది. పొలంలో గ్రానైట్‌పడి నడమంత్రపు సిరి వచ్చి పడింది. ఇక అంతా మారిపోయింది. ముందు బాబాయికి బజ్జీలు ఇచ్చి ఇంటికెళ్ళి మాట్లాడుకుందాం" అన్నాడు సత్యం.

బజ్జీలు వేసే బండి చుట్టూ జనం మూగి ఉన్నారు. బజ్జీలు, పునుగులు, మినప గారెలు, శనగ పిండి వడలు వాయిలు తీస్తుంటే, క్షణాల్లో మాయమైపోతున్నాయి. జనం బండి దగ్గరే తింటున్నారు. ఆడ మగ, ముసలి ముతకా ఎగబడి తింటున్నారు. సత్యానికి బజ్జీల పొట్లాం అందేసరికి పావుగంట పట్టింది.

"మనం గూడా సెంటర్ చూసి బజ్జీల బండి పెట్టుకుంటే హాయిగా వుంటుందేమోరా? " అన్నాడు చెన్నకేశవులు.

"ఎందుకు బాగుండదూ? వీడు రోజుకి ఐదారు వందలు సంపాదిస్తాడు. మనం ఏ వ్యాపారం చేసినా ఇంతకంటే ఎక్కువ సంపాదిస్తున్నామా? " అన్నాడు సత్యం నవ్వుతూ.

ముట్లూరి సాంబయ్యకి బజ్జీల పొట్లాం ఇచ్చి ఇంటికి వెళ్ళారు.

"ఏరా! కనపడ్డం లేదేం? బాగున్నావా? " అని అడిగింది అన్నమ్మ.

"బాగున్నా పెద్దమ్మా! వంట్లో ఎట్లా వుంది? " అని పరామర్శించాడు.

తర్వాత ఇద్దరూ డాబాపైకి వెళ్ళి కూర్చున్నారు.

"ఇందాక ముట్లూరి సాంబయ్యా గురించి చెప్తూ ఆపేశావు. ఏమైందేం ఆయనకి? "

# ఓసారి తాకి చూడొచ్చా?

విశ్వవిఖ్యాత వయొలిన్ (ఫిడేలు) వాద్యకారుడు, యహూది మెనుహిన్ వాద్యకచేరి చెన్నైలో ఏర్పాటయ్యింది. ప్రఖ్యాత సంగీతజ్ఞుడు, విమర్శకుడూ అయిన నాటి మద్రాసు హైకోర్టు చీఫ్ జస్టిస్ పి.వి.రాజమన్నార్ నుంచి ఆహ్వానం అందుకున్న ద్వారం వేంకటస్వామి నాయుడు కచేరికి వెళ్ళారు. ద్వారం ఆపేక్ష మేరకు, రాజమన్నార్ వేదికపైన ద్వారం, మెనుహిన్‌లను పరస్పరం పరిచయం చేశారు. ఆ సమయంలో ద్వారం 'మెనుహిన్‌వారి ఫిడేలును నేను తాకి చూడవచ్చా?' అని రాజమన్నార్‌తో అన్నారు. 'దానికేం? అడుగుతానుండండి' అని ద్వారం అభిలాషను రాజమన్నార్ ఆయనకు తెలియజేశారు. దానికి మెనుహిన్ 'నా వయొలిన్‌ను దూరం నుంచి చూడవచ్చు అంతే' అని ఆ ప్రతిపాదనను ఆదిలోనే తుంచివేశారు. దీనితో ద్వారంకు నిరాశ కలగడమేకాక, రాజమన్నార్ కూడా బాధపడ్డారు.


యహూది మెనుహిన్

దీనికి పరిహారమార్గం ఆలోచించిన రాజమన్నార్ మరుసటిదినం తన గృహంలో ద్వారంవారి వాద్య కచేరీ ఏర్పాటుచేసి, స్థానిక సంగీతప్రియులను, మెనుహిన్‌నూ ఆహ్వానించారు. ఆ కచేరీలో ద్వారం అద్భుతమైన ఫిడేలును విన్న మెనుహిన్ అందరికన్నా ముందు ఆయనను కలిసి, ముక్తకంఠంతో అభినందనలు తెలిపారు. 'నిన్న నేను పెద్ద తప్పుచేశా. దాన్ని మరచిపోండి. ఈ దినం మీరు నా విడిదికి రండి. నా వయొలిన్‌ను చేతికెత్తుకొని మీ తనివితీరా దానిని తాకి చూడండి' అని వేడుకొన్నారు.

ద్వారం సంతోషంతో మెనుహిన్ విడిదికి వెళ్ళి ఫిడేలును చేతినెత్తుకొని భక్తిపూర్వకంగా కళ్ళకద్దుకున్నారు. స్వయాన మెనుహిన్ కమానును అందివ్వగా కొద్ది సేపు వాయించి తృప్తిచెందారు.

అన్నేటి నిజం

# ద్వారం నిర్దుష్టత



ఒకప్పుడు విజయవాడ సంగీత కళాశాలలో ద్వారం వేంకటస్వామి నాయుడి సంగీత కచేరీ ఏర్పాటయింది. ఆ కచేరీలో ఆయన వాయించదలచిన కీర్తన సాహిత్యంలో కొంత భాగం జ్ఞాపకం రాలేదు. స్వరాలను అనుసరించే ఫిడేలు వాయించవచ్చు. కాని ద్వారంవారు ఎక్కడా, ఏనాడూ రాజీపడి అలాంటి పని చేసినవారు కారు. కాలేజీ లైబ్రరి నుంచి సంబంధించిన పుస్తకం తెప్పించుకొని అందులో సాహిత్యాన్ని చూసుకొన్న తరువాతనే ఆయన కచేరీకి వెళ్లారు. అదీ ద్వారం నిర్దుష్టత.

అని అడిగాడు చెన్నకేశవులు.

"సాంబయ్య భార్య శశిరేఖది నర్సరావు పేట. బాగా బీదవాళ్ళు. ఏడో క్లాసు వరకు చదువుకుంది. ఈ ఏరియా వాళ్ళ సంగతి తెలుసుగా. ఆడపిల్ల పెద్దమనిషి అయి, కాకముందే పెళ్ళి చేసి చేతులు దులుపు కుంటారు. అట్లా పద్నాలుగో ఏట సాంబయ్యకిచ్చి పెళ్ళి చేశారు. నువ్వు శశి రేఖని చూసివుండవు. బాగుంటుందిలే. టౌన్‌లో పుట్టి పెరిగిన పిల్ల. నాజూకుగా వుంటుంది. సాంబయ్య నల్లగా, తుమ్మ మొద్దులా వుంటాడు. కాకి ముక్కుకి దొండ పండు అంటారే అట్లా కుదిరింది. సాంబయ్యని పెళ్ళి చేసుకోవడం శశిరేఖకి అసలు ఇష్టం లేదు. ఆడపిల్ల ఇష్టం ఎవ డికి కావాలిక్కడ? ఏడ్చి మొత్తుకున్నా సాంబయ్యకిచ్చి కట్టబెట్టారు. వీడొక పోరం బోకోడు. పొలం పనులు చేసేవాడు కాదు. రాజకీయాలని తిరుగుతుండేవాడు. శ్రీనివా సులు నాయుడు సర్పంచ్‌గా పోటీ చేస్తే వీడు ఇంటింటికీ తిరిగి ఓటెయ్యమని అడు గుతుండేవాడు. పాపం ముట్లూరి కోటి వీరయ్యే పొలం పనులు చేస్తూ తిప్పలు పడేవాడు. పొలం ఎంత వున్నా సరిగా జరిగేదికాదు. ఎప్పుడూ అప్పులే. ఒక్కో రోజు జొన్న రొట్టెలు పచ్చడేసుకుని తినే వాళ్ళు. శశిరేఖ వీడిని సరిగా దగ్గరికి రాని చ్చేది కాదంటారు. వీడు గొడ్డుని బాదినట్లు



బాదేవాడు.

అటువంటప్పుడు వీళ్ళ పొలంలోనే గ్రానైట్ రాయి పడింది. అప్పట్లో ముట్లూరి కోటి వీరయ్య పొలంలో రంగు రాళ్ళు పడ్డాయని చుట్టుపక్కల వూళ్ళలో వింతగా చెప్పుకునేవాళ్ళు. ఒక్క దెబ్బకి దరిద్రం వదిలిపోయిందనీ, కోటీశ్వరుడైపోయాడనీ కథలుగా చెప్పుకునేవాళ్ళు. పొలంలో రంగు రాళ్ళు చూడ్డానికి వచ్చేవాళ్ళు.

ముట్లూరి కోటి వీరయ్యకి కోట్లు ఏం చేసుకోవాలో తెలియలా? ఇల్లు పడగొట్టించి మూడంతస్తుల మేడ కట్టించాడు. దర్జాగా వూరంతా పిలిచి గృహ ప్రవేశం చేశారు.

డబ్బు వచ్చి పడేటప్పటికి శశిరేఖకి సినిమా హాలు కట్టించాలనే కోరిక మొదలైంది. మునికొండలో గ్రానైట్ క్వారీలు మొదలై వేల సంఖ్యలో లేబర్ గుడిసెలు వేసుకుని నివాసం వుండడం గమనించి ఎవరో ఎకరం పొలం లీజుకి తీసుకుని టూరింగ్ టాకీస్ మొదలు పెట్టారు. ఇక జనమే జనం.

శశిరేఖ మొగుణ్ణి మచ్చిక చేసుకుని సినిమా హాలు కట్టించడానికి ఒప్పించింది. శశిరేఖ, చంద్రరేఖ అని రెండు థియేటర్లు ఉండే సినిమా కాంప్లెక్స్ కట్టించారు. సినిమా హాల్స్ మేనేజర్‌ని గుంటూరు



నుంచి పిలిపించారు. వాడి పేరు బోస్. గుంటూర్లో డిస్ట్రిబ్యూషన్ కంపెనీ పెట్టి దివాళ తీసి వున్నాడు. అక్కడ పనిలేకుండా తిరుగుతుంటే ఒకాయన రికమండేషన్‌తో ఇక్కడికి వచ్చాడు. సినిమాహాలు నడపడంలో అనుభవం వుందిలే. మనిషి ఎర్రగా, ఎత్తుగా, అందంగా వుంటాడు.

ప్రొప్రయిటర్ పెద్ద సాంబయ్యకి పొట్ట కోసినా అక్షరం ముక్కరాదనీ, వెర్రిబాగులోడనీ గ్రహించాడు. గుంటూరు నుంచి సినిమా బాక్సులు తేవడానికి, అగ్రిమెంట్లు చెయ్యడానికి శశిరేఖని తీసుకెళ్ళేవాడు. మొదట్లో పొద్దున వెళ్ళి సాయంకాలానికి బాక్స్, వాల్ పోస్టర్లు కారులో తెచ్చేవారు.

సినిమాహాలు దగ్గరే ప్రొప్రయిటర్ రూమ్‌లో కూర్చుని కలెక్షన్లు, ఖర్చులు లెక్కలు చూసేది శశిరేఖ. అంతా మేడమ్ గారు అనేవారు. బోస్ ఆషాడభూతిలా 'మేడమ్ గారు' అంటూ వినయం ఒలకపోసేవాడు. సినిమాలు జోరుగా నడవసాగాయి.

పెద్ద సాంబయ్యకి తాగుడు అలవాటైంది. శశిరేఖ బోస్‌కి అలవాటైంది. గుంటూరు వెళ్ళి రెండు మూడు రోజులు లాడ్జీల్లో గడపడం మొదలుపెట్టారు. అప్పుడప్పుడూ రిలీజ్ పిక్చర్స్ బాక్సులు తేవాలని హైదరాబాద్ వెళ్ళేవాళ్ళు.

శశిరేఖ, బోస్‌తో తిరుగుతోందని సాంబయ్యకి తెలిసింది. ఇంట్లో పెద్దగొడవైంది. అప్పటికి సాంబయ్య తల్లిదండ్రులు పోయారు. శశిరేఖకి ఎదురులేకపోయింది.

ఒకరోజు సాంబయ్య మెట్లమీద నుండి దొర్లిపడ్డాడని గుంటూరు హాస్పటల్‌కి తీసుకెళ్ళారు. అక్కడ పదిరోజులు ట్రీట్‌మెంట్ ఇప్పించారు. ఇక అప్పట్నుంచి పాపం మతిలేకుండా పోయింది. నాలాంటి పాతవాళ్ళని గుర్తుపట్టి బజ్జీలు ఇప్పించరా, కూల్‌డ్రింక్ ఇప్పించరా అని అడుగుతుంటాడు పాపం."

"మరి శశిరేఖకు పిల్లలు పుట్టలేదా?" అడిగాడు చెన్నకేశవులు.

"పుట్టారు. వీడికి కాదు. బోస్‌కి" అని అన్నాడు సత్యం.

"పాపం"

"ఇప్పుడు సాంబయ్యని పట్టించుకునేవాళ్ళు లేరు. సినిమాహాళ్ళు లీజుకి ఇచ్చేశారు. శశిరేఖ, బోస్ హైదరాబాద్‌లో వుంటున్నారు" ముగించాడు సత్యం.




అబ్దుల్ కరీమ్‌కి ఫోన్‌చేసి చెప్పాడు చెన్నకేశవులు.

"కరీంభాయ్! నేను హైదరాబాద్ రావడం లేదు"

"అదేంట్రా నీకు నౌకరీ అక్కర్లేదా?"

"ఇక్కడే ఏదొకటి చూసుకుంటాను భాయ్! చుట్టాలంతా ఈ ఏరియాలోనే ఉన్నారు. అంతా ఉండి పొమ్మంటున్నారు"

"నేను పెద్దవాడిని చెప్తున్నా విను. అక్కడ ఎమ్మెల్యేకి నువ్వంటే కోపంగా వుంది. పోలీసులు కూడా నీకు వ్యతిరేకం. నువ్వక్కడ ఉండడం మంచిది కాదు. ఇక్కడికొచ్చెయ్. ఎందుకు చెప్తున్నానో ఆలోచించుకో" అన్నాడు కరీం.

"నాకు తెలుసు భాయ్. వాళ్లు నిన్ను బెదిరించారు. అందుకే నన్నిక్కడ నుంచి లేపేశావు. తాడూ బొంగరం లేనివాడిని.

ఎక్కడుంటే ఏంటి భాయ్. ఇక్కడుంటే మా వాళ్లకి హెల్ప్ చెయ్యొచ్చనిపించింది. ఉంటున్నాను. చూద్దాం ఏం జరుగుతుందో?"

"సరే నీ ఇష్టం" అన్నాడు కరీం.

కరీం ట్రాన్స్‌పోర్టులో పని మానేశాక చంద్రకళ ఇంట్లోనే ఒక రూమ్‌లో ఉంటున్నాడు చెన్నకేశవులు. తన గదికి బైట నుంచి తాళం వేసుకుని వస్తున్నాడు. ఐతే ఊళ్లో తిరగడానికి ఇబ్బందిగా ఉంది బైక్ లేక. చంద్రకళని డబ్బు అడిగితే ఇస్తుంది. కాని అది అతనికి ఇష్టం లేదు.

"అన్నాయ్! నీకు ఫైనాన్స్ ఇప్పిస్తాలే పద. నెమ్మదిగా తీర్చుకోవచ్చు యూనిట్ మొదలైతే ఇక ఇబ్బంది ఉండదు" అని సత్యం, చెన్నకేశవుల్ని ఉదయ్ చాంబర్స్‌కి తీసుకెళ్ళాడు.

అది ఎర్రగుడిపాడు రంగయ్య ఫైనాన్స్ ఆఫీసు. వెళ్లేసరికి రంగయ్య లేడు. ఆఫీస్ బాయ్ వున్నాడు.

"ఏరా రంగయ్య ఏడిరా?" అని అడిగాడు సత్యం.

"ఇంకా రాలేదన్నా!" అన్నాడు బాయ్

"అదేంట్రా పన్నెండవుతుంటే? ఊళ్లో ఉన్నాడా అసలు?"

"ఉన్నాడన్నా. రాత్రి ఎనిమిదింటి దాకా ఉన్నాడు. కలెక్షన్ తీసుకుని వెళ్లిపోయాడు. నేను ఆఫీసుకి తాళంవేసి పోయాను. ఇప్పుడింకా రాలేదు. కూర్చోండన్నా పేపరు చూస్తుండండి. ఒక్కోప్పుడు బ్యాంక్‌లో ఆలస్యమవుతుంటుంది" అన్నాడు బాయ్ డైలీ పేపర్లు టేబుల్ ముందు వేసి.

ఇంతలో టేబుల్ మీద వున్న ఫోన్ రింగైంది.

"అరేయ్... ఫోన్‌రా..." అన్నాడు సత్యం.

బాయ్ పరిగెత్తుకుంటూ వచ్చి రిసీవర్ తీశాడు.

"హలో!" అన్నాడు.

"నేనేరా తాయారమ్మని"

"మీరా అమ్మగారూ! అయ్యగారింకా ఆఫీసుకి రాలేదండీ!"

"అదేంట్రా? ఎక్కడికి పోయాడు? రాత్రి కూడా ఇంటికి రాలేదు. ఏదైనా ఊరి కెళ్లాడా?"

"ఏమో అమ్మగారూ! రాత్రి ఎనిమిదింటికే ఆఫీసునుంచి వెళ్లిపోయారు. ఇప్పటి దాకా రాలేదు. ఆరికోసం వచ్చినోళ్లంతా ఇంకా రాలేదేమని అడుగుతున్నారు"

"ఆయన సెల్‌ఫోన్‌కి చేసినా కలవడం లేదురా! ఎక్కడికి పోయినట్టు?"

"ఏహోనండి." అన్నాడు బాయ్.

"ఏందిరా? ఎక్కడ్నుంచి ఫోన్?" అడిగాడు సత్యం.

## పాపాలు కొట్టుకుపోతాయా?

ఓరోజు ఒకతను రామకృష్ణ పరమహంస వద్దకు వచ్చి 'నేను వరుసగా పన్నెండో ఏడాది గంగానదిలో పుణ్యస్నానాలు చేస్తున్నాను. నేను చేసిన పాపాలన్నీ కొట్టుకుని పోయినట్లేనా? అన్నాడు. అతడి నమ్మకాన్ని వెంటనే దెబ్బతీయకుండా గురూజీ ఇలా చెప్పారు, 'ఔను, గంగలో మునిగినప్పుడు పాపాలన్నీ పోయాయి. అయితే అవి నది ఒడ్డున ఉన్న చెట్లపైకి ఎగిరి కూర్చున్నాయి. మళ్లీ నదినుండి పైకి వచ్చిన తర్వాత నీమీదకు వాలుతాయి. అలాగనీ పైకిరాకుండా ఎన్నాళ్లని నదిలోనే ఉంటావు? అందుకే తప్పులు చేయకుండా స్వచ్ఛమైన జీవితం గడపాలి' అన్నారాయన.



"తాయారమ్మగారండి"

"ఆవిడెవరు? "

"అమ్మగారండి. అయ్యగారు రాత్రి నుంచి ఇంటికి రాలేదంట. ఎక్కడికెళ్లారని నన్ను అడుగుతున్నారండి"

"అదేంట్రా? ఎక్కడికెళ్లి ఉంటాడు రంగయ్య? ఏదైనా సెటప్ ఉందేంట్రా? " అడిగాడు సత్యం.

"అదేంటండీ? "

"దేనన్నా ఉంచుకున్నాడా అని" నవ్వాడు సత్యం.

"అబ్బే లేదండి"

"నీకేం తెలుసురా సన్నాసీ. రాత్రి ఆఫీసు నుంచి వెళ్ళాక ఎక్కడెక్కడ తిరుగుతాడో? సంచి నిండా డబ్బులుంటాయిగా? ఎన్ని కతలైనా నడుపుతాడు" అన్నాడు సత్యం.

"ఈయన ఎప్పుడొస్తాడోరా! మనం పోదాం" అన్నాడు చెన్నకేశవులు.

ఇద్దరూ రోడ్డుమీదకు వచ్చారు. అటు నుంచి ఏడుకొండలు పాలిషింగ్ యూనిట్ దగ్గరకు వెళ్ళి రిపేరు చేయిస్తున్నారు. సామానంతా పాడైపోయి వుంది. మళ్ళీ సర్వీసింగ్ చేయించి లైన్‌లో పెట్టడానికి ప్రయత్నిస్తున్నారు. పని మొదలుపెడితే గిరాకీ బాగానే ఉంటుంది. పలకలు కట్ చేయడానికి, వాటికి పాలిష్ చేయడానికి కొందరికి పని దొరుకుతుంది. యూనిట్ మొదలైతే చంద్రకళ గూడా సంతోషిస్తుందని మధ్యాహ్నం ఇంటికి గూడా వెళ్ళకుండా దగ్గరుండి పనిచేయిస్తున్నాడు చెన్నకేశవులు.

మళ్లీ ఎర్రగుడిపాడు రంగయ్య దగ్గరికి వెళ్ళడం కుదరలేదు. సత్యం వేరేపని మీద మాచెర్ల వెళ్ళాడు. వచ్చిన తర్వాత మళ్ళీ వెళ్ళాలని అనుకున్నాడు చెన్నకేశవులు. ఇల్లు దాటితే ఎక్కడికెళ్ళాలన్నా ఇబ్బందిగా వుంది. ఆటోలను ఆశ్రయించాల్సి వస్తోంది. వాళ్ళు అన్నిచోట్లకి రారు. కొన్ని రూట్లలో షేర్ ఆటోలు నడుస్తుంటాయి. పాలిషింగ్ యూనిట్‌కి వెళ్ళాలంటే ప్రత్యేకంగా ఆటో మాట్లాడుకుని వెళ్ళాల్సి వస్తోంది. వచ్చేటప్పుడు అటు నుంచి ఆటోలు దొరకవు. నడిచి వస్తున్నాడు.

ఇంటికి వెళ్లిన తర్వాత చంద్రకళ అడిగింది.

"ఏమండీ మధ్యాహ్నం మీరు భోజనానికి రాలేదేం? "

"అటునుంచి ఆటోలు దొరకడం లేదు. అక్కడే సుబ్బయ్య హోటల్లో తింటున్నాను. బాగానే వుంటుందిలే" అన్నాడు.

"ఎందుకూ అంత ఇబ్బంది పడుతున్నారు? బండి కొనుక్కోవచ్చు గదా? " అన్నది.

"అదే చూస్తున్నాను. సత్యం వచ్చాక మళ్ళీ రంగయ్య దగ్గరకెళ్ళాలి".

"రంగయ్య ఎవరు? "

"ఫైనాన్స్ కంపెనీలో అప్పు తీసుకుని కొందామన్నాడు సత్యం. ఆ కంపెనీ ఓనర్ రంగయ్య" అని టవల్ భుజాన వేసుకుని బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు స్నానం చేయడానికి.

స్నానం చేసివచ్చి డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు.

"పిల్లలు నిద్రపోయారా? " అన్నాడు.

"వూc" అన్నది.

అతనికి భోజనం వడ్డించి వెళ్ళి టీవీ ముందు కూర్చున్నది. చంద్రకళ ఎందుకో ముభావంగా వున్నది. సంతోషంగా లేదు. ఏమిటో కారణం అనుకున్నాడు. ఆమె ఒంటరి ఆడది. పరాయి మగాడిని ఇంట్లో పెట్టుకున్నదని సూటిపోటు మాటలు ఎవరైనా అన్నారేమో? అటువంటప్పుడు బాధ కలగడం సహజమే. చంద్రకళ తనను వుండమని అడిగినా రాకూడదనే అనుకున్నాడు. అప్పుడప్పుడూ వచ్చి వెళ్ళడం

వేరు. పర్మినెంట్‌గా ఇంట్లోనే వుండడం, ఆమె తనకి వంటచేసిపెట్టడం వేరు. కాని తను అనూహ్యంగా కరీం ట్రాన్స్‌పోర్టు నుంచి బైటకు రావాల్సి రావడం, సత్యం ప్రోత్సహించడం వల్ల ఇక్కడ తప్పని పరిస్థితిలో వుండాల్సి వచ్చింది. ఎదురుగా ఎవరూ ఏమీ అనరు. చాటుగా అనుకుంటారు.

'సరే రోట్లో తలపెట్టాక దెబ్బలు తినక తప్పదు' అనుకుంటూ భోజనం ముగించాడు.

సింక్ దగ్గరకెళ్ళి చెయ్యి కడుక్కుంటుంటే చంద్రకళ వచ్చి "అదేమిటండీ? పెరుగు వేసుకోకుండానే లేచారే" అన్నది.

"పెరుగు గిన్నె టేబుల్ మీద లేదుగా!"

"ఫ్రిజ్‌లో వున్నదండీ. బైట వుంచితే పులిసిపోతుందని లోపల పెట్టాను".

"పోనీలే. ఇప్పుడు పెరుగన్నం తినకపోతే ఏమైంది? "

"అదేం మాట? ఐనా మీరు అడగవచ్చుగా? "

"పెరుగు లేదేమో అనుకున్నాను" అన్నాడు చెన్నకేశవులు.

చంద్రకళ సీరియస్‌గా చూసింది.

చెన్నకేశవులు రూమ్‌లోకెళ్ళి పడుకున్నాడు. చంద్రకళ ఎందుకంత సీరియస్‌గా వుందో అర్థం కాలేదు. కళ్ళు మూసుకుని పడుకున్నాడు. వెంటనే నిద్రపట్టింది.

ఉదయమే పింకీ "గుడ్‌మార్నింగ్ అంకుల్" అంటూ వచ్చి నిద్రలేపింది.

మెలకువ వచ్చింది చెన్నకేశవులికి. పింకీ స్కూల్ డ్రెస్ వేసుకుని రెడీగా వుంది.

"గుడ్‌మార్నింగ్ పింకీ! రాంబాబు ఎక్కడ? " అన్నాడు.

"వాడు డ్రెస్ వేసుకుంటున్నాడు" అని పరిగెత్తింది పింకీ.

చెన్నకేశవులు లేచి బ్రష్ చేసుకున్నాడు. ఇంటిముందు కాసేపు పచార్లు చేశాడు. చంద్రకళ పిల్లలిద్దర్నీ స్కూల్ బస్ ఎక్కించడానికి వెళ్ళడం కనిపించింది.

రోజూ 'టీ' ఇచ్చి వెళ్ళేది. ఈ రోజేంటో తనవైపు చూడకుండా వెళ్తోంది అనుకున్నాడు. బ్రష్ చేసుకుని నీళ్ళు తాగిన తర్వాత 'టీ' తాగడం అలవాటు. షేవింగ్ చేసుకుంటూ వుంటే అప్పుడు కడుపులో చలనం కలుగుతుంది. టాయిలెట్‌కి వెళ్తాడు. ఎన్నో ఏళ్ళ నుంచి అదే అలవాటు.

'టీ' తాగకుండా షేవింగ్ మొదలుపెట్టాడు. కాని టాయిలెట్‌కి వెళ్ళాల్సిన అవసరం కలగలేదు. షేవింగ్ చేసుకుని పేపరు చదవడం మొదలుపెట్టాడు. చంద్రకళ రూమ్‌లోకి రాలేదు. కిచెన్‌లో గిన్నెల చప్పుడవుతోంది.

ఇక లాభం లేదని డ్రెస్ చేసుకుని బయ

## నీటిపై నడక ఎందుకు?

రామకృష్ణ పరమహంస ఓ సారి పడవలో నది దాటుతుంటే ఓ వ్యక్తి 'మీరు పడవలో రావడమేంటి? మీకున్న యోగ, ధ్యాన శక్తితో నీటిమీద నడుచుకుంటూ రావచ్చు కదా? ' అన్నాడు అమాయకంగా.



దానికి ఆయన నవ్వుతూ 'అణానో.. బేడానో ఇస్తే పడవవాడు నదిని దాటిస్తున్నప్పుడు దానికోసం యోగ, ధ్యానశక్తిని ఎందుకు వృథా చేయడం? ' అన్నారు.

ల్దేరాడు. రోడ్డు మలుపులోనే 'టీ'లూ, బన్ను, రొట్టెలు అమ్మే స్టాల్ వుంది. అక్కడ 'టీ' గూడా రుచిగా వుంటుంది.

'టీ' తాగి తిరిగి వచ్చాడు. హాల్లోనే నిల బడి సీరియస్‌గా చూస్తోంది చంద్రకళ.

"ఎక్కడికి వెళ్ళొస్తున్నారు?" అన్నది.

"ఇక్కడికే..." అన్నాడు.

"నాకు తెలుసు మీరు టీ తాగడానికి వెళ్ళారు" అన్నది.

చెన్నకేశవులు ఏం మాట్లాడలేదు. తను 'టీ' తాగడానికి వెళ్తున్నాడని తెలిసి పిలిచి 'టీ' ఇవ్వొచ్చుగా అనుకున్నాడు.

'టీ' తాగి రావడంతో టాయిలెట్ వెళ్ళా ల్సిన అవసరం కలిగింది. గబ గబా డ్రెస్ మార్చుకుని వెళ్ళాడు.

వచ్చేసరికి వేడి నీళ్ళ బకెట్ తెచ్చి బాత్ రూమ్‌లో పెట్టింది.

"ఏమండీ మీరు నన్ను 'టీ' ఇవ్వమని అడగొచ్చుగా?" అని నిలదీసింది.

"ఎందుకు అడగగూడదు. అడగొచ్చు" అన్నాడు.

"మరి ఎందుకు అడగలేదు?" అన్నది సీరియస్‌గా.

"అది కాదు చంద్రకళా! పొద్దున్నే నువ్వు పిల్లల్ని స్కూలుకు రెడీచేసే పనిలో హడా వుడిగా వుంటావు గదా! అందుకని".

"అదేంకాదు. మీరు నన్ను పరాయిదా నిలా చూస్తున్నారు" అని ఏడవడం మొద లు పెట్టింది.

చెన్నకేశవులు విస్తుపోయాడు.

"అరె.. ఇప్పుడేమైంది? ఎందుకేడుస్తు న్నావు?" అన్నాడు.

"మీరంటే నాకు ఎంత ఇష్టమనీ, ఎవరే మనుకున్నాగానీ అని మిమ్మల్ని ఇంట్లో తెచ్చిపెట్టుకున్నాను. మీరు లేకపోతే నన్ను పిచ్చికుక్కలా తరిమేవాళ్ళు. నేను నా పిల్లలు దిక్కులేని వాళ్ళమయ్యేవాళ్ళం. నేను ఏ కూలిపనికో పోవాల్సి వచ్చేది. నాకు దేవుడిలాంటివారు మీరు. మీ కోసం ఏమైనా చేస్తాను" అంటూ వుంటే వుద్వే గంతో ఆమె పెదవులు వణుకుతున్నాయి. కన్నీళ్ళు ధారాపాతంగా కారుతున్నాయి.

చెన్నకేశవులు తల తిరుగుతోంది. చంద్రకళ ఎందుకంత బాధపడుతున్నదో అర్థం కావడంలేదు. రాత్రి నుంచి ఎందుకో మూడీగా వుంటోంది. పెరుగు వేసుకోలే దని రాద్ధాంతం చేసింది. ఇప్పుడు తను 'టీ' ఇవ్వలేదు. పోనీ బిజీగా వుందని బైట తాగివస్తే గొడవ చేస్తోంది. ఏమిటి చంద్ర కళ మనస్తత్వం?

"చంద్రకళా! ఇప్పుడు ఎందుకేడుస్తు న్నావు? నేనేం చేశాను? ఎవరైనా ఇప్పుడు ఇంట్లోకి వచ్చిచూస్తే ఏమనుకుంటారు?" అన్నాడు.

"ఏమైనా అనుకోనీయండి".

"నువ్వు చెప్పందే నాకేం తెలుస్తుంది. ఇప్పుడు నన్ను ఏం చెయ్యమంటావు? పొద్దున్నే నువ్వెంత పనిలో వున్నా 'టీ' అడగమంటావు. అంతేనా?" అని ఆమె భుజం మీద చెయ్యివేసి అనునయించాడు. కన్నీళ్ళు తుడిచాడు.

"అదికాదండీ. మీకు బండి కావాలంటే నేను డబ్బులివ్వనా? ఎవడి దగ్గరో అప్పు తీసుకోవాలా? అంటే నన్ను పరాయిదా న్నిగా చూస్తున్నారనేగా? నా పనిమీద తిరుగుతూ, మీరు ఎవరి దగ్గరో అప్పుచేసి బండి కొనాల్సిన అవసరం ఏమిటి చెప్పండి. నన్ను డబ్బు అడగడానికి మీకు మొహమాటం ఎందుకు?" అన్నది చంద్ర కళ.

"ఓ.. అదా!" అని నవ్వాడు.

చంద్రకళ రాత్రి నుంచి ఎందుకలా మూడీగా వుందో అర్థమైంది. తను రంగయ్య దగ్గర అప్పు తీసుకుంటానని చెప్పడం తప్పయింది అనుకున్నాడు.

"ఛ... ఛ... నువ్వు పరాయిదానివను

కుంటే నీ ఇంట్లోకి వచ్చి వుండేవాడినా? అదేంకాదు. డబ్బు విషయంలో జాగ్రత్తగా వుండాలి. రేపు ఎవరైనా ఒంటరి ఆడ దాన్ని చేసి డబ్బు ఖర్చుపెడుతున్నాడని అనుకోగూడదు" అన్నాడు ఆమెను అనునయిస్తూ.

★ ★ ★

'చంద్రకళ పాలిషింగ్ యూనిట్' అనే సరికొత్త ఎనామిల్ పెయింట్ బోర్డు గేటు మీద ఫిక్స్ చేయించి, బంతిపూల దండలతో అలకరించాడు చెన్నకేశవులు.

యూనిట్‌లో లోగడ పనిచేసిన వర్కర్లతోపాటు కొత్తవాళ్లుగూడా ప్రారంభోత్సవానికి వచ్చారు. చుట్టుపక్కల వున్న పాలిషింగ్ యూనిట్ యాజమానులను, వర్కర్స్‌ని పిలిచారు. అక్కడ వందల మంది గుమిగూడి వున్నారు.

చంద్రకళ ఆటోలో దిగింది. ఆకుపచ్చ పట్టుచీరలో అందంగా కనిపిస్తోంది. అందరి దృష్టీ ఆమె మీదే.

చెన్నకేశవులు ఆటో దగ్గరికి వెళ్లి "కొంచెం వెయిట్ చేస్తావా? " అన్నాడు.

"లేదు. వెళ్లిపోతాను." అన్నాడు.

సరేనని డబ్బులు ఇచ్చి పంపేశాడు.

"ఏమిటి ఇంత ఆలస్యం? నీ కోసం ఇంతమంది వెయిట్ చేస్తున్నారు" అన్నాడు.

"ఆటో దొరకడం ఆలస్యమైంది." అంది.

యూనిట్లో మిషనరీకి పసుపు, కుంకుమ బొట్లు పెట్టింది. పూలదండలు వేసింది.

"కొబ్బరికాయ కొట్టి స్విచ్ వెయ్యి" అన్నాడు.

చంద్రకళ అలాగే నిలబడింది. ఎందుకో సంశయిస్తూ ఉంది.

"ఏమిటి ఆలస్యం? " అన్నాడు విసుగ్గా.

"నేను కొట్టగూడదు. మీరు కొట్టండి" అన్నది.

"ఏం? ఎందుకు కొట్టగూడదు" విసుగ్గా అన్నాడు.

"నాలాంటి వాళ్లు కొట్టగూడదు." అన్నది.

"ఇది నీ స్వంతది. నువ్వు కొట్టకపోవడం ఏమిటి? నోర్మూసుకుని కొట్టు. అన్నీ పిచ్చి నమ్మకాలు. జరగాల్సినవి జరుగుతాయి. జరగబోయేవి ఎవరూ ఆపలేరు" అన్నాడు చెన్నకేశవులు కోపంగా.

"అన్నాయ్! నువ్వే కొట్టరాదా? అక్కకి ఏదో సెంటిమెంట్" అన్నాడు సత్యం.

అందరిలో చంద్రకళని కోప్పడినందుకు ఆమె ఫీలవుతుందేమోనని సత్యం భయపడ్డాడు. అంత చనువు తీసుకోవడం 'నోర్మూసుకో' అనడం అతనికే కష్టంగా వుంది. ఎంత తమ మీద ఆధారపడినా ఆమె ప్రొప్రయిటర్ గదా అనుకున్నాడు.

"సెంటిమెంట్లతో మనం బాగుపడంరా! అన్నీ వదిలేస్తేనే బాగుపడేది" అని, చంద్రకళ వైపు చూసి "ఊ.. కొబ్బరికాయ కొట్టు" అన్నాడు.

చెన్నకేశవులు ముఖంలో సీరియస్‌నెస్ చూసి జంకింది చంద్రకళ. కొబ్బరికాయ కొట్టి, స్విచ్ వేసింది. అంతా చప్పట్లు కొట్టి అభినందించారు. వచ్చిన వాళ్లందరికీ చంద్రకళ తన చేత్తో స్వీట్లు పంచింది. అంతా యూనిట్ బాగా నడవాలని కోరుకున్నారు. పని మొదలైంది. కాసేపటికి వచ్చిన వాళ్ళంతా వెళ్ళిపోయారు.

చెన్నకేశవులు, సత్యం ఆఫీసు రూమ్‌లో కూర్చున్నారు. చంద్రకళ బైట చెత్త ఏరి వేసే పనిలో వుంది.

"అన్నాయ్! నువ్వు చంద్రకళని అందరి ముందు నోర్మూయ్ అనడం బాగాలేదు. బాధపడిందేమో పాపం. ఎంతైనా తను ప్రొప్రయిటర్ కదా? మనం కేవలం కర్ర పెత్తనంగాళ్ళం" అన్నాడు సత్యం.

"నేను నోరు జారాలే. తను విధవననే ఫీలింగ్ వుంది చంద్రకళలో. ఇటువంటి

శుభకార్యాలు చేయగూడదని ఏదో తాతల నాటి నమ్మకంతో వుంది. అందుకని గట్టిగా అన్నాను. నాకు ఇటువంటివంటే మంట. నేను గూడా తర్వాత ఎందుకన్నానా అని ఫీలయ్యాను. అన్నాక ఇక చేసేదేముంది? అందుకే అన్నారు కాలు జారినా ఫరవాలేదు వెనక్కి తీసుకోవచ్చు, నోరు జారితే వెనక్కి తీసుకోలేం" అన్నాడు చెన్నకేశవులు మనస్ఫూర్తిగా.

"నేనిక వెళ్తాను. డ్రామా రిహార్సల్స్ వున్నాయి" అని సత్యం వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి ఇంటికి వెళ్ళిన తర్వాత చంద్రకళనే గమనించసాగాడు చెన్నకేశవులు. తను అందరిముందు 'నోర్మూసుకో' అన్నందుకు బాధపడుతున్నదేమో? ఆమె ఎప్పుడు అలుగుతుందో తెలియదు అనుకున్నాడు. కాని చంద్రకళ మామూలుగానే వుంది.

అయినా తప్పు తనదే. అలా నోరు జారాల్సింది కాదు. చంద్రకళకు సారీ చెప్తే తనకు మనశ్శాంతిగా వుంటుంది అనుకున్నాడు.

చంద్రకళ మామూలుగానే స్నానానికి నీళ్ళు తోడింది. భోజనం వడ్డించింది.

"చంద్రకళా! సారీ" అన్నాడు భోజనం చేస్తూ.

ఆమె అదోలా చూసి "ఎందుకు? " అన్నది.

"నీకేం బాధగా లేదా? " అన్నాడు.

"నాకు బాధా? ఎందుకు? " అన్నది అర్థంకానట్లు చూస్తూ.

"అందరిముందూ నోర్మూయ్యమన్నానుగా" అన్నాడు ఆమె ముఖంలో ఫీలింగ్ చూస్తూ.

ఆమె నవ్వింది.

"నువ్వు స్వంత మనిషివి. నువ్వు నన్ను తిట్టినా బాధపడను. నేను తప్పుచేస్తే కొట్టు, ఫరవాలేదు. నువ్వు కాకపోతే నన్నెవరు తిడతారు? ఎవరు కొడతారు? " అన్నది.

చెన్నకేశవులు తలపట్టుకున్నాడు. ఈమెను అర్థం చేసుకోవడం కష్టం అనుకున్నాడు.

"సారీ అండీ" అన్నది వెంటనే.

"ఎందుకు? " ఆశ్చర్యంగా అడిగాడు.

"మిమ్మల్ని, నువ్వు, నువ్వు అన్నానండీ. ఏదో పొరపాటుగా అలా అన్నాను" అన్నది.

"ఫరవాలేదు. నువ్వు అనేది తప్పు మాటకాదులే" అన్నాడు.

"అలా కాదండీ. నువ్వు నువ్వు అని మనం ఇంట్లో అనుకున్నా అదే అలవాటు అవుతుంది. నలుగురు వున్నప్పుడు నేను మిమ్మల్ని నువ్వు నువ్వు అనడం ఏం బాగుంటుంది? " అన్నది.

"ఏం ఫరవాలేదు. నేనేం పైనుంచి దిగి వచ్చానా? నేనూ నీలాంటి మనిషే కదా!" అని సింక్ దగ్గరకెళ్ళి చెయ్యి కడుక్కున్నాడు.

బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి పడుకున్నాడు.

బైట గేటు చప్పుడు వినిపించింది. చంద్రకళ గేటు తాళం తీసింది. ఎదురుగా తమలపాకుల తిమ్మయ్య కనిపించాడు.

"నువ్వా బావా? ఇప్పుడొచ్చావేంది? " అన్నది.

తాగి వచ్చినట్లున్నాడు. సారాయి వాసన వస్తోంది.

"పనిమీద వచ్చాలే" అన్నాడు.

చంద్రకళ గబగబా వచ్చి చెన్నకేశవులు పడుకుని వున్న బెడ్‌రూమ్ తలుపులు దగ్గరికి లాగి వెళ్ళింది.

తమలపాకుల తిమ్మయ్య లోపలకొచ్చి హాల్లో, సోఫాలో కూర్చున్నాడు. అతనికి నలభై ఐదేళ్ళుంటాయి. వెల్దుర్తిలో రెండెకరాల పొలం వుంది. దాంతోపాటు పొలాల్లో కూలి పనులకు పోతాడు. నల్లగా

పొడుగ్గా వుంటాడు. చంద్రకళకు అత నంటే అసహ్యం. అక్కమొగుడు కాబట్టి ఇంట్లోకి రానియ్యక తప్పదు. లోగడ రెండుసార్లొచ్చి ఒంటరిగా ఏంవుంటావు? నన్ను పెళ్ళి చేసుకో అని వెంటపడ్డాడు.

చంద్రకళ తిట్టి కేకలేస్తే వెళ్ళిపోయాడు. మళ్ళీ ఇన్నాళ్ళకి వచ్చాడు.

"పొలంలో మిరపకళ్ళాలన్నీ వానకి తడి సిపోయాయే. అనుకోకుండా ఆరబెట్టిన ప్పుడు వానలొచ్చాయి. అంతా నాశనం" అన్నాడు.

చంద్రకళ దూరంగా నిలబడింది. ఏం మాట్లాడలేదు.

"డబ్బులు కావాలే" అన్నాడు.

"డబ్బులా? " అన్నది సీరియస్‌గా.

"ఔనే. పాతిక వేలియ్యి. ఈసారి పంట అమ్మగానే ఇత్తాలే" అన్నాడు.

"ఏడుకొండలున్నప్పుడు గొంతుమీద కూర్చుని పదివేలు తీసుకెళ్ళావ్. ఇంతవ రకు రూపాయి తిరిగివ్వలేదు. నీలాంటో ళ్ళందరికీ అప్పులిచ్చి, తను అప్పులపాలై ప్రాణాల మీదకు తెచ్చుకున్నాడు. ఇప్పుడు మళ్ళీ డబ్బులని వచ్చావా? నేనేం మూట కట్టుకుని కూచున్నానా? " గట్టిగా అన్నది.

"నాకు తెలుసులేవే? నీ దగ్గర చానా డబ్బులున్నాయి"

"ఏంది నీకు తెలిసింది గోంగూర? నా బాధలు నీకేం తెలుసు? అప్పులు చేసి మొగుడు చచ్చిపోయాడు. ఉండటానికి సొంత ఇల్లూ వాకిలి లేదు. ఇద్దరు పసిపి ల్లల్ని పెట్టుకుని ఈ బస్తీలో ఎట్టా బతుకు తుందోనని ఆలోచనలేదు నీకు. డబ్బు, డబ్బు అని ఎందుకు పీడిస్తావు. నా చావు నన్ను చావనీ."

"అందుకే గదే నన్ను పెళ్ళి చేసుకోమ న్నది. వయసులో వున్నావు. ఒంటరిగా ఏం వుంటావు? ఉప్పూ, కారం తింటున్న దానివి ఎట్టా నిద్దరపోతన్నావే? "

"ఛీ.. ఛీ.. ఎదవమాటలు.. నువ్వు. అక్క మొగుడువని ఇంట్లోకి రానిచ్చాను. పెళ్ళిమాట ఎత్తావంటే కత్తిపీటతో పీక తెగ్గోస్తాను. ఏమనుకుంటున్నావో? " అన్నది చంద్రకళ.

"ఏందే నీయమ్మ! నీకంత పొగరు? "

తర్వాత మాటలు వినిపించలేదు. కుర్చీలు, బల్లలు జరిగిన చప్పుడు, ఎవరో దబ్బున కింద పడిన చప్పుడు వినిపిం చింది. తర్వాత చంద్రకళ ఏడుపు వినిపిం చింది.

చెన్నకేశవులు తలుపు తెరుచుకుని గది బైటకు వచ్చాడు. చంద్రకళ నేలమీద పడి ఉంది. తిమ్మయ్య ఆమె జుట్టు పట్టుకుని వీపుమీద గుద్దుతున్నాడు. బూతులు తిడు తున్నాడు. ఆమె ప్రతిఘటిస్తోంది. కాని అతని బలం ముందు ఆగడం లేదు.

చెన్నకేశవులుకి కోపం వచ్చింది. అతనికి సామాన్యంగా కోపం రాదు. ఇక ఆవేశం వచ్చిందంటే ఎవరూ ఆపలేరు. తిమ్మయ్య మెడపట్టుకుని లాగి ఇష్టం వచ్చినట్లు కొట్టి ఒక మూలకు నెట్టాడు.

"ఎవడ్రా నువ్వు? సిగ్గులేదూ ఆడదాని మీద చెయ్యి చేసుకోవడానికి? " అన్నాడు.

తిమ్మయ్య లేవడానికి ప్రయత్నిస్తూ. "నేనెవడ్నో తరువాత సంగతి. ముందు నువ్వు బైటకి పోకపోయావంటే పోలీసుల్ని పిలిపించి బొక్కలో తోయిస్తాను. ఏమనుకు న్నావో!" అన్నాడు.

"ఎవడ్నో వుంచుకుని నన్ను తన్నిస్తా వటే, నీ సంగతి తేలుస్తాను" అని వాగు తున్నాడు తిమ్మయ్య.

"ఏంట్రా నువ్వు తేల్చేది? " అని మళ్ళీ పైకిలేపి వంగబెట్టి పిడిగుద్దులు గుద్దాడు.

"చస్తాడేమో వదిలెయ్!" అన్నది చంద్ర కళ భయపడిపోయి.

"నా సెల్‌ఫోన్ తీసుకురా! పోలీసులకు పట్టిస్తా! ఆడదాన్ని కొట్టాడనీ, బలవంతం

చెయ్యబోయాడనీ బొక్కలో పెట్టిస్తా! తిక్క కుదురుద్ది నా కొడుక్కి. ఏరా తాగొచ్చి గొడవ చేస్తావా? " అని కాలితో డొక్కలో తన్నాడు.

చెన్నకేశవులి ఉగ్రరూపం చూసి తమల పాకుల తిమ్మయ్య తమలపాకులాగా వణికిపోయాడు.

చంద్రకళ, చెన్నకేశవుల్ని పట్టుకుని వెనక్కి లాగింది. ఆమెకు భయం కలిగింది. అతనికి అంత కోపం రావడం ఎప్పుడూ చూడలేదు. ముఖం ఎర్రబడింది. కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి.

"ఇదుగో బావా! మర్యాదగా చెప్తున్నా! ఎళ్ళిపో. ఇంకా ఇక్కడే వున్నావంటే ఆయన చేతిలో చస్తావు" అన్నది.

"పోతానే... నీ అంతు తేలుస్తానే...!" అని లేచిపోయాడు తిమ్మయ్య.

తిమ్మయ్య వెళ్ళిపోయి రోడ్డుమీద కేకలు పెడుతుంటే ఇరుగు పొరుగువాళ్ళు చోద్యం చూస్తున్నారు. వాకిటి ముందు నిల్చున్న వాళ్ళని చూసి ఏదో వాగుతున్నాడు తిమ్మయ్య.

చంద్రకళ గేటుమూసి తాళంవేసి వచ్చింది.

ఆమెకు ఏడుపు ఆగడం లేదు. చెన్నకేశవుల్ని కౌగలించుకుని బిగ్గరగా ఏడ్చింది.

"ఎందుకు ఏడుస్తావు? వాడేం చెయ్యలేడు. ఏదో బెదిరించాడు. ఆడది ఒంటరిగా వుంటే అందరికీ లోకువే. నీ దగ్గర కాస్త డబ్బుందని తెలిసి పీక్కు తినడానికి ప్రయత్నిస్తుంటారు. దగ్గర చుట్టాలు మరీను" అంటూ ఆమె తలనిమిరి వూరడించాడు.

ఇంట్లో జరుగుతున్న గొడవకి పిల్లలిద్దరూ నిద్రలేచారు. హాల్లోకి వచ్చి నిల్చున్నారు.

"ఇంక వూరుకో చంద్రకళా! నన్నిక్కడ ఎందుకు వుండమన్నావో అర్థమైంది. నీకేం భయం లేదులే. అదుగో పిల్లలు కూడా లేచారు. వాళ్ళని పడుకోబెట్టు" అని ఆమెకు దూరంగా జరిగాడు.

చంద్రకళ ఏడుపు ఆపుకుని, కళ్ళు తుడుచుకుని పిల్లల దగ్గరకు వెళ్ళింది.




**చం**ద్రకళ పాలిషింగ్ యూనిట్ బాగా సాగుతోంది. అప్పుడెప్పుడో ఎకరం పొలం కొని ఏడుకొండలు మంచి పనేచేశాడు. ఐతే డబ్బు విషయంలో జాగ్రత్తలు తెలియక, అసలుకి, లాభాలకీ పొంతనలేక చంద్రకళ గొప్పలకు పోయి విచ్చలవిడిగా ఖర్చులు పెట్టడం, బ్యాంక్‌లోన్ చెల్లించక పోవడం వంటివి జరిగింది.

ఇప్పుడు చెన్నకేశవులు డబ్బు లావాదేవీల్లో కచ్చితంగా లెక్కలు రాస్తున్నాడు. బ్యాంక్‌లో ఎకౌంట్స్ చంద్రకళ పేరుతోనే పెట్టించాడు. ఆమే యూనిట్ ప్రొప్రయిటర్. బ్యాంక్ లోన్ గొడవపోవడం, స్వంత డబ్బు వుండడంతో లాభాలు బాగానే వస్తున్నాయి. పనికి బాగా డిమాండ్ ఉంది. అందుకే పక్కనే రెండో యూనిట్ గూడా పెట్టించాడు.

ఒకరోజు క్వారీలకెళ్ళే ఘాట్‌రోడ్డులో లారీ తిరగబడింది. గ్రానైట్ లోడ్‌తో వస్తున్న లారీలో కూలీలు గూడా వున్నారు. లారీ తల్లకిందులై పోవడంతో గ్రానైట్ రాళ్ళకింద నలిగి పదముగ్గురు

ప్రాణాలు వదిలారు.

చెన్నకేశవులు తమ యూనిట్లో పనిచేస్తున్న వర్కర్స్‌ని తీసుకుని వెంటనే ప్రమాదస్థలానికి వెళ్ళాడు. క్రేన్ తెప్పించి లారీని పక్కకి తీయించాడు. చనిపోయినవారు పోగా, కొందరు కాళ్ళు, చేతులు పోగొట్టుకుని స్పృహ తప్పిపోయి వున్నారు. రక్తంతో గ్రానైట్ రాళ్ళు ఎర్రబడిపోయి వున్నాయి. భీభత్సంగా వుంది అక్కడి దృశ్యం. చనిపోయినవారి శవాలు పక్కకు పెట్టించాడు. ప్రాణాలతో వున్నవారిని అంబులెన్స్‌లో ఎక్కించి హాస్పిటల్‌కి పంపించాడు.

ఆ ప్రాంతమంతా జనసందోహంతో నిండిపోయింది. క్వారీలలో పనిచేస్తున్న కార్మికులంతా పనులు మానేసి ప్రమాదం జరిగిన చోటుకి వచ్చారు. చనిపోయిన వారిని గుర్తించడం మొదలుపెట్టారు. ఏడుపులు మొత్తుకోళ్ళతో ఆ ప్రాంతమంతా హృదయవిదారకంగా వుంది.

పోలీసులు వచ్చి దర్యాప్తు మొదలుపెట్టారు.

డ్రైవర్ బతికే వున్నాడు. బాగా దెబ్బలు తగిలాయి. చనిపోయిన వారి శవాలు పోస్ట్‌మార్టమ్ రిపోర్టు కోసం హాస్పటల్‌కి తరలించారు.

డ్రైవర్ నాసరయ్య అనుభవం వున్నవాడే. ప్రమాదం ఎందుకు జరిగిందీ ఎవరికీ అర్థంకాలేదు.

హాస్పటల్లో నాసరయ్యకి తెలివి వచ్చిందని తెలిసి ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు ఎన్‌క్వయిరీ చెయ్యడానికి వెళ్ళాడు.

"నాసరయ్యా! లోడ్ లారీలో వర్కర్స్‌ని ఎందుకు ఎక్కించుకున్నావు" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"రోజూ ఎక్కించుకుంటానే వున్నానండీ. క్వారీలో పని పూర్తయిన తర్వాత వూళ్ళోకి వచ్చే లారీల్లో ఎక్కి వస్తుంటారు వర్కర్స్. ఎప్పట్నుంచో జరుగుతున్నదదే. ఇవ్వాళ కొత్తేంకాదు" అన్నాడు డ్రైవర్ నాసరయ్య.

"సరే... సరే... అలా ఎక్కించుకోవడం తప్పు కదా? "

"ఏమో సార్! క్వారీలో పనికి వచ్చేవాళ్ళు, వెళ్ళేవాళ్ళు లారీల్లోనే వస్తున్నారు. ఆఫీసర్లు, యజమానులు కారుల్లో వచ్చి వెళ్తున్నారు. ఖాళీగా వెళ్తారుగాని, దారిలో నడిచిపోయే ఒకరిద్దర్ని గూడా ఎక్కించుకుని వెళ్ళరు. పోనీ వాళ్ళకి బస్సులు ఏర్పాటు చేస్తారా అంటే అదీలేదు. సమయానికి బస్సులుంటే లారీల్లో ఎక్కే ఖర్మ ఎందుకుంటుంది సార్? ఎవరూ పట్టించుకోరు" నిష్టూరంగా అన్నాడు నాసరయ్య.

"అది సరే! యాక్సిడెంట్ ఎట్లా జరిగింది? "

"ఎదురుగా వస్తున్న ఆవుని తప్పించ

## మనసు బంగారమైతే..?



బాగా చదువుకున్న ఒకాయన ధ్యానం గురించి జనులకు వివరిస్తున్నాడు. 'ఇనుముకు పట్టిన తుప్పును వదిలించినట్లు మన మనసులోకి వచ్చే చెడ్డ ఆలోచనలను ఎప్పటికప్పుడు ధ్యానంతో వదిలించుకోవాలి' అని సూచించాడు. దానికి రామకృష్ణ పరమహంస, 'మనసుకు పట్టిన తుప్పు వదిలించుకోవాలనేది మంచిదే. కాని ఆ మనసును బంగారంతో చేసుకుంటే ఇంకా మంచిది కదా? అసలు తుప్పే పట్టదు కదా? అంటే సరైన ఆలోచనలకే చోటిస్తూ, చెడువాటిని మనసులోకి రాకుండా చేసుకోవడం అత్యుత్తమం కదా? ' అన్నారు. చూసేందుకు అమాయకంగా కనిపించే పరమహంస జ్ఞానానికి అతడు అవాక్కయ్యాడు.

బోయి పక్కకి కోశాను సార్! వర్కర్లంతా ఒక పక్కనే కూర్చుని వుంటారు. బ్యాలన్స్ తప్పి బోల్తాపడింది" చెప్పాడు డ్రైవర్.

ఆ వర్కర్లంతా గెలాక్సీ గ్రానైట్ కంపెనీలో పని చేస్తున్నారు. యూనియన్ లీడర్ బ్రహ్మయ్య, ఆ కంపెనీ ప్రొప్రైటర్ పోలిశెట్టి సత్యనారాయణని కలిసి చనిపోయిన కుటుంబాల వారికి తక్షణ సహాయంగా పదివేలు ఇప్పించాడు. ఆ డబ్బుతో వాళ్లకి అంతిమయాత్ర జరిపించారు. ఇంకా కొందరు హాస్పిటల్‌లో కోలుకుంటున్నారు. ఇద్దరికి కాలు తీసివేయాల్సి వచ్చింది. ఇద్దరికి చేతులు నలిగాయి. బ్రహ్మయ్య దగ్గరుండి వాళ్లకి కావాల్సిన మందులు ఇప్పిస్తున్నాడు. హాస్పిటల్లో లేనివి బైట మెడికల్ షాపుల్లో కొనిపిస్తున్నాడు.

చనిపోయిన కుటుంబాలకి చెందినవాళ్లు యూనియన్ ఆఫీసుకి వెళ్ళి నష్టపరిహారం ఇప్పించమని అడిగారు.

"కంపెనీ వాళ్ళు మాకు సంబంధం లేదని అంటున్నారు. క్వారీలో ప్రమాదం జరిగితే కంపెనీ నుండి ఇప్పిస్తాం కానీ, పని పూర్తయ్యాక లారీలో పోతుంటే చనిపోయారు. దానికి కంపెనీ బాధ్యత ఏముంది? అంటున్నారు. వాళ్ళు అన్న దాంట్లో గూడా న్యాయం ఉంది" అన్నాడు బ్రహ్మయ్య.

"న్యాయం, అన్యాయం కాదు. నష్టపరిహారం ఎంతో కొంత ఇవ్వకపోతే వాళ్ళ మీద ఆధారపడి బతుకుతున్న కుటుంబాల పరిస్థితి ఏమిటి సార్? "

"ఇన్సూరెన్స్ డబ్బు వస్తుంది. గవర్నమెంట్ నుంచి కొంత ఇప్పించే ప్రయత్నం చేస్తాను. గుంటూరెళ్లి కలెక్టర్ని కలిసి మాట్లాడుతాను" అన్నాడు బ్రహ్మయ్య.

అంతా నిరాశపడ్డారు.

లేబర్ కాలనీలో ఉండే ఏసయ్య వచ్చి చెన్నకేశవుల్ని కలిశాడు. తన కొడుకు రాజయ్య లారీ ప్రమాదంలో చనిపోయాడనీ, కంపెనీవాళ్ళు పదివేలిచ్చి చేతులు దులుపుకున్నారనీ చెప్పాడు.

అంతా విన్న తర్వాత చనిపోయిన వాళ్ళ కుటుంబాల వాళ్ళందర్నీ తీసుకుని రమ్మన్నాడు. రెండోరోజు ఏసయ్య అందరిళ్ళకి వెళ్ళి చెన్నకేశవులు రమ్మంటున్నాడని పిలుచుకొచ్చాడు. లోగడ క్వారీలో ప్రమాదం జరిగినప్పుడు కుటుంబానికి పది లక్షలు ఇప్పించడంతో అతని పేరు అందరికీ తెలిసింది. ఇప్పుడు కూడా తమ తరపున పోరాడి డబ్బు ఇప్పిస్తాడనే ఆశతో వచ్చారు.

"వర్కర్లు ఊళ్ళో నుంచి క్వారీల దగ్గరికి రాకపోకలు సాగించడానికి బస్సు సౌకర్యం



కలిగించకపోవడం వలన లారీల్లో తిరుగుతున్నారు. క్వారీ బైట యాక్సిడెంట్ జరిగింది కాబట్టి మాకేం సంబంధం లేదనడం సరికాదు. ప్రతి కుటుంబానికీ పది లక్షల చొప్పున నష్టపరిహారం చెల్లించాల్సిందే" అన్నాడు చెన్నకేశవులు.

అంతా చప్పట్లు కొట్టారు. నిరాశలో మునిగిపోయిన వారిలో ఉత్సాహం తన్నుకొచ్చింది. ఎట్లా బతకాలిరా అనే దిగులుతో ఉన్నవారిలో ఆశ కలిగింది. చెన్నకేశవులు తమకు మేలు చేస్తాడనే నమ్మకం ఏర్పడింది.

"చెన్నకేశవులు జిందాబాద్" అని ఎవరో అరిచారు.

అంతా స్లోగన్స్ మొదలుపెట్టారు.

"ఆగండి... ఆగండి. నాకు ఇటువంటివి నచ్చవు. అన్యాయం జరుగుతున్నప్పుడు అందరం కలిసి ఎదుర్కోవాలి. ఏ ఒక్కరి వల్లో న్యాయం జరగదు. కాబట్టి మనం అందరం క్వారీల దగ్గరికి వెళ్ళి వర్కర్లందరినీ కలుపుకొందాం. కంపెనీ యాజమాన్యాన్ని నిలదీద్దాం. అవసరమైతే క్వారీల్లో పనిచేయకుండా సమ్మె చేయిద్దాం" అన్నాడు. అంతా అలాగే చేద్దామని క్వారీల దగ్గరికి బయల్దేరారు. వర్కర్స్‌తో చిన్న చిన్న మీటింగ్‌లు పెట్టి వివరించాడు చెన్నకేశవులు.

"ఇక్కడ క్వారీలున్న కంపెనీలన్నీ కలిసి బస్సు సౌకర్యం కలిగించాలి. తర్వాత మొన్న లారీ ప్రమాదంలో చనిపోయిన వారి కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించాలి. ఎందుకంటే మీరంతా ఎక్కువమంది లారీల్లో రాకపోకలు సాగిస్తున్నారు. ప్రమాదం ఎప్పుడైనా, ఎవరి



కైనా జరగొచ్చు కాబట్టి ఇప్పుడు మనకేం జరగలేదులే అనుకుని ఊరుకోవడం మంచిది కాదు"

చెన్నకేశవుల్ని ఎక్కువమంది బలపరిచారు. ముందు గెలాక్సీ గ్రానైట్ కంపెనీ వాళ్ళని నష్టపరిహారం అడగమనీ, ఇవ్వనంటే అంతా సమ్మె చెయ్యడానికి ముందుకొస్తామనీ చెప్పారు.

★ ★ ★

గెలాక్సీ గ్రానైట్ కంపెనీ ఆఫీసు. ప్రొప్రయిటర్ పోలిశెట్టి సత్యనారాయణ ఆరోజే మద్రాస్ నుంచి వచ్చాడు. అక్కడ పోర్టులో గ్రానైట్ ఎక్స్‌పోర్ట్ పనుల కోసం వెళ్ళాడు.

**మినీ కవిత...**

**మనసు పెడితే**
**ఆశ**
**మనసు పడితే**
**ఫలం**

**–ఆర్.ఎస్. హైమవతి,**
చెన్నై

కంపెనీకి అక్కడ కూడా ఆఫీసు ఉంది. మద్రాస్, హైదరాబాద్‌ల మధ్య విమానంలో తిరుగుతుంటాడు. మునికొండకి కారులో వస్తాడు.

ఆఫీసులో కూర్చున్న సత్యనారాయణ దగ్గరికి అటెండర్ వచ్చి "సార్! చెన్నకేశవులు వచ్చాడు. మిమ్మల్ని కలవాలిట" అన్నాడు.

"చెన్నకేశవులా? అతనెవరు? " అడిగాడు సత్యనారాయణ.

"లేబర్ లీడర్ సార్!"

"బ్రహ్మయ్యని యూనియన్ లీడర్ ఉన్నాడుగా? "

"ఇతనూ లీడరే సార్!"

"ఇక్కడ ఇంకొక యూనియన్ పెట్టారా? "

"పెట్టి ఉంటారు సార్! చెన్నకేశవులు చాలా పవర్‌ఫుల్ లీడర్ సార్! ఎమ్మెల్యేగారి కంపెనీ నుంచే ఒక్కో వర్కర్‌కి పది లక్షలు కాంపన్సేషన్ ఇప్పించాడు సార్!"

"ఐసీ. ఇప్పుడెందుకు ఆఫీసుకి వచ్చి ఉంటాడు? "

"మన వర్కర్స్ లారీ యాక్సిడెంట్‌లో పోయారు కదా సార్! ఆ విషయం మాట్లాడ్డానికి వచ్చి ఉంటాడు"

"అప్పుడు తలా పదివేలు ఇప్పించమని బ్రహ్మయ్య అడిగాడు. ఇచ్చాం. దెబ్బలు తగిలిన వాళ్ళకి హాస్పిటల్ బిల్స్, మందులు అన్నీ భరించాం. ఇప్పుడేంటి? "

"ఏమో సార్? "

"సరే రమ్మను" అన్నాడు సత్యనారాయణ.

కాసేపటికి చెన్నకేశవులు చాంబర్‌లోకి వచ్చి నమస్కారం చేశాడు. సత్యనారాయణ కూర్చోమని సీటు చూపించాడు.

"చెప్పండి" అన్నాడు.

"లారీ యాక్సిడెంట్‌లో మీ కంపెనీ వర్కర్స్ పదమూడుమంది చనిపోయారు సార్! ఆ విషయం మాట్లాడ్డానికి వచ్చాను"

"బ్రహ్మయ్య అడిగినట్లు తలా పదివేలు ఇచ్చాం గదా? "

"అది వాళ్ళ శవాల్ని తగలెయ్యటానికి సరిపోతాయి సార్! తాత్కాలికంగా ఇచ్చింది లెక్కలోకి తీసుకుంటే ఎలా? "

"వాళ్ళు మా క్వారీస్‌లో పనిచేస్తూ చనిపోలేదు. బైట ఎక్కడో చనిపోయారు. దాంతో మాకేం సంబంధంలేదు? "

"బైట ఎక్కడో కాదు సార్! క్వారీలో పని ముగించుకొని లారీ ఎక్కి వెళ్తూ యాక్సిడెంట్‌లో పోయారు"

"అది మా తప్పెలా ఔతుంది? "

"మీరు క్వారీల వరకు బస్సులు అరేంజ్ చెయ్యలేదు. ఊళ్ళో నుంచి క్వారీల వరకు అన్ని మైళ్ళు ఎలా వస్తారు? అందుకని లారీల్లో ప్రయాణం చేస్తున్నారు. అది మీ ఫాల్టే కదా? "

"మేము ఆర్టీసీ వాళ్ళకి రాశాం. మా గ్రానైట్ కంపెనీల తరపున ఆర్టీసీ ఛైర్మన్ని, మంత్రిని రిక్వెస్ట్ చేశాం బస్సులు వెయ్యమని. వాళ్ళు వెయ్యలేదు".

"గ్రానైట్ కంపెనీ యం.డి. అన్నగారే ఎమ్మెల్యేగా ఉన్నాడు. సంవత్సరం పొడుగునా హైదరాబాద్‌లో వుంటాడు. అక్కడ పలుకుబడి ఉపయోగించి క్వారీల వరకు షటిల్ సర్వీసులు ఏర్పాటు చేయించలేక పోయారా? చేతగాక కాదు. ఆ విషయంలో శ్రద్ధలేక సార్! మీ పనులన్నీ గొంతు మీద కూర్చుని చేయించుకోవడం లేదా? కూలీల గురించి మీరెందుకు పట్టించుకుంటారు? " సీరియస్‌గా అన్నాడు చెన్నకేశవులు.

"ఇంతకూ మీరు ఏ యూనియన్ తరపున మాట్లాడుతున్నారు? "

"న్యాయం అడగడానికి యూనియన్ తరపునుంచే రావాలా? "

"ఔను"

"చనిపోయిన వాళ్లంతా నా కమ్యూనిటీకి చెందినవాళ్ళు. నోరులేని వాళ్ళు. వాళ్ళ తరపున అడుగుతున్నా? "

"ఇప్పుడు మమ్మల్నేం చేయమంటావు? "

"కుటుంబానికి పది లక్షలు ఇవ్వండి"

"వాట్? కోటీ ముప్పై లక్షలు ఇవ్వాలా? "

"ఎందుకివ్వరూ? ఏమీ సంబంధంలేని వాళ్ళకి ఇస్తున్నారుగా? రాజకీయ పార్టీలకిస్తారు? పోలీస్‌స్టేషన్‌కిస్తారు. నాయకులకు ఇస్తారు. కోట్లు కోట్లు వెదజల్లుతారు. ఆ కోట్లు రావడానికి మూల కారణమైన వర్కర్స్ ఆపదలో ఉంటే ఇవ్వలేరా? "

సత్యనారాయణ ఇబ్బందిగా ముఖం పెట్టాడు.

"మేం ఎవరికీ ఊరికే డబ్బులివ్వం. వాళ్ళవల్ల ఏదైనా ఉపయోగం ఉంటేనే ఇస్తాం. గవర్నమెంట్‌కి రాయల్టీ విషయంలో సర్దుబాటు చేసినందుకు అధికారంలో వున్నవాళ్ళకి ఇస్తాం. అధికారంలోకి వస్తారేమోనని ప్రతిపక్షం వాళ్ళకిస్తాం. మేము చెప్పినట్లు కేసులు పెట్టేందుకు, ఎత్తేసేందుకుగాను పోలీసులకిస్తాం."

"అవన్నీ నాకెందుకు చెప్తారు సార్? దిక్కులేని కుటుంబాలని ఆదుకోమని అడగడానికి వచ్చాను. ఆ విషయం మాట్లాడండి"

"నేను మాట్లాడేది ఏమీ లేదు"

"సరేసార్! సెలవు" అని అక్కడ్నుంచి వెళ్లిపోయాడు చెన్నకేశవులు.

కాసేపటికి యూనియన్ లీడర్ బ్రహ్మయ్య వచ్చాడు.

"నమస్కారం నాయుడుగారూ!" అన్నాడు.

"నమస్కారం.. రావయ్యా బ్రహ్మయ్యా! బాగున్నావా? "

"ఏదో మీ దయ, మా ప్రాప్తం. ఇలా ఉన్నాం" అని నవ్వాడు బ్రహ్మయ్య.

"మా దయేం ఉంది? మీ దయమీదే ఆధారపడి ఉంది మా కంపెనీ"

"ఒకరి మీద ఒకరు ఆధారపడి బతకడమే ఈ ప్రపంచం సార్! మ్యూచువల్ అండర్ స్టాండింగ్"

"ఇప్పుడే వచ్చిపోయాడయ్యా చెన్నకేశవులు"

"ఏవంటున్నాడేం? "

"లారీ యాక్సిడెంట్లో పోయిన వాళ్ళకి పదేసి లక్షలు ఇవ్వాలంటున్నాడు"

"వాడిదేంబోయింది లెండి. అట్లాగే

అంటాడు. ఏమీ ఇవ్వకపోతే గొడవగా వుంటుందిగాని, మనిషికో లక్ష, దెబ్బలు తిన్నవాళ్ళకి ఏభైవేలు అనౌన్స్ చెయ్యండి. నేను నచ్చజెప్తాను" అన్నాడు బ్రహ్మయ్య.

"సరే! నువ్వు చెప్పాక కాదనేదేవుంది? అట్లాగే కానియ్. ఐతే ఆ చెన్నకేశవుల్తో గొడవ లేకుండా చూసుకో"

"వాడేం చేస్తాడు సార్? సింగయ్యనాయుడిగారి క్వారీలో యాక్సిడెంట్‌లో వాడి కజిన్ ఉన్నాడు కాబట్టి జోక్యం చేసుకున్నా ఊరుకున్నాను. ఇప్పుడేంటి? రోడ్డుమీద పోయే యవ్వారాలన్నీ నెత్తినేసుకోవడానికి

## చంద్రుడు వంగింది ఎందుకు?

సుప్రసిద్ధ నవలాకారుడు, వందేమాతర కర్త బంకించంద్ర చటోపాధ్యాయ ఓసారి రామకృష్ణ పరమహంసను కలిశారు.



అతడి పేరులోని 'బంకిం' మాటకు అర్థం 'వంగిన' అని. దాన్ని దృష్టిలో పెట్టుకుని గురూజీ చమత్కారంగా 'ఎందుకీ చంద్రుడు బంకిం(వంగిన) చంద్రుడయ్యాడు?' అన్నారు. దానికి ఆయన కూడా అంతే స్ఫూర్తితో, 'ఆంగ్లేయుల బూటుకాళ్ల దెబ్బలకు వంగిపోయాడు' అన్నారు.

వాడికేవన్నా యూనియన్ వుందా? ఏదో ఒక పాలిషింగ్ యూనిట్ నడుపుకుంటున్నోడు లీడరవుతాడా? మీరేం వర్రీ కాకండి వాడి గురించి"

"వాడిప్పుడు ఏమంటున్నాడో తెలుసా? పోయినోళ్ళంతా మా కులం వోళ్ళు అంటున్నాడు".

"కులం రంగు పులుముతున్నాడన్న మాట"

"అదే మరి" అన్నాడు సత్యనారాయణ.

"ఈ మధ్య ప్రతివాడూ కులం కులం అని మాట్లాడుతున్నారు సార్! అసలు ఈ కుల సంఘాలు రద్దుచేయాలి గవర్న మెంటు" అన్నాడు బ్రహ్మయ్య.

బ్రహ్మయ్య ఎంతసేపటికీ అక్కడ్నుంచి కదలడం లేదు. ఏదొకటి మాట్లాడుతూ టైం పాస్ చేస్తున్నాడు.

ఏదో గుర్తొచ్చిన వాడిలాగా ఇంటర్‌కమ్‌లో తన పర్సనల్ సెక్రటరీని పిలిచి "బ్రహ్మయ్యగారికి ఇవ్వాల్సింది ఇచ్చి పంపండి" అన్నాడు.

"బ్రహ్మయ్యా పి.యస్.ను కలుసుకో" అన్నాడు.

బ్రహ్మయ్య సంతోషంగా లేచి "థాంక్యూ సార్!" అన్నాడు.

★ ★ ★

ఆ రోజు ఆదివారం చెన్నకేశవుల్ని సినిమాకు తీసుకెళ్ళమని అడిగింది చంద్రకళ. పిల్లలు గొడవ చేస్తున్నారని అన్నది. అతనికి సినిమాకు వెళ్ళడం ఇష్టంలేదు. చంద్రకళని, పిల్లల్ని సినిమాహాల్లోకి పంపి, వదిలే సమయానికి వస్తానని అన్నాడు.

శివాలయం ముందు బైక్ ఆపాడు. ఆలయంలో మండపం మీద స్తంభానికి ఆనుకుని కూర్చోవడం, కోనేటి మెట్లమీద కూర్చుని అందులో పడే కొబ్బరిచెట్ల నీడలు చూడడం, నీళ్లల్లోకి మరమరాలు విసిరితే తినడానికి పరిగెత్తుకొచ్చే చేపల్ని గమనించి ఆనందించడం బాగుంటుంది. గంటలు ప్రశాంతంగా దొర్లిపోతుంటాయి.

ఇంకా చీకటి పడలేదు.

మరమరాల పొట్లాం తీసుకుని కోనేటి ఒడ్డున కూర్చున్నాడు. మరమరాళ్ళు గుప్పె

ళ్ళతో విసురుతుంటే నోళ్ళు తెరుచుకుని పరిగెత్తుకొస్తున్నాయి చేపలు. పోటీలు పడి తింటున్నాయి. అతనికి ఆ దృశ్యం చూస్తుంటే చిన్ననాటి రోజులు గుర్తొస్తు న్నాయి. ఎంతో సంతోషంగా ఉంది.

చిన్నతనంలో నందంగారి అమ్మాయి సీతామహాలక్ష్మి తనతో ఎంతో స్నేహంగా ఉండేది. ఆ రోజుల్లో మునికొండలో ఏడో తరగతి వరకే స్కూలు ఉండేది. ఎనిమిదో తరగతి నుంచి శాంతినగర్ హైస్కూల్లో చదవాల్సి వచ్చేది. చాలామంది పిల్లలు నడిచే మూడుమైళ్ళు వెళ్ళి వచ్చేవాళ్ళు. ఆ రోజుల్లో ఆటోలు లేవు. కొందరు డబ్బున్న వాళ్ళు సైకిళ్ల మీద వెళ్ళి వచ్చేవాళ్ళు. తను సీతామహాలక్ష్మి ఇక్కడే శివాలయం ముందు కలుసుకుని నడుచుకుంటూ స్కూలుకి వెళ్ళేవాళ్ళు. స్కూలు నుంచి ఊళ్ళోకి వచ్చాక ఇంకా చీకటి పడకముందే శివాలయం కోనేటి గట్టుమీద కూర్చుని చేపలకు మరమరాలు విసిరేవాళ్ళు. చీకటి పడేవరకూ చేపలతో ఆటలాడుకుని అప్పుడు ఇంటికి బయల్దేరేవాళ్ళు.

"ఇప్పటిదాకా ఎక్కడున్నావురా? అంతా బడినుంచి వచ్చేశారు. నీకేంటి ఇంతా లశ్యం? " అని తిట్టేది వరమ్మ.

"మూడు మైళ్ళు నడిచి రావొద్దా? నాకే మైనా సైకిలుందా తొందరగా రావడా నికి? " అని ఎదురుచెప్పేవాడు.

సీతామహాలక్ష్మితోపాటు ముక్కామల శేషగిరిగూడా వాళ్ళతోపాటు వచ్చేవాడు. ఐతే వాడికి చేపలకు మరమరాలు విస రడం నచ్చేది కాదు.

"ఎందుకురా దండగ? ఉల్లిపాయ ముక్కలు, ఉప్పు, కారం కలిపి నిమ్మకాయ పిండి తింటే భలే ఉంటదిరా!" అనేవాడు.

"వాడొట్టి పీనాసి వెధవ. ఎవరూ తిండి పెట్టకపోతే చేపలెట్లా బతుకుతాయిరా చెన్నకేశవులూ!" అనేది.

"ఔను సీతా!" అని ఒప్పుకునేవాడు.

చెన్నకేశవులికి ఆ రోజులన్నీ గుర్తుకు రాసాగాయి. ఇప్పుడా ముక్కామలగాడు, నందం సీతామహాలక్ష్మి ఎక్కడున్నారో? అనుకున్నాడు.

అతను చేపలకు మరమరాలు విసు రుతూ కాలక్షేపం చేయడం కొంచెం దూరంలో కూర్చుని వున్న ఒక యువతి గమనిస్తూ వుంది. ఆమె పక్కనే పూలసజ్జ ఉంది. అందులో పూలు, పళ్లు, కొబ్బరిచిప్ప ఉన్నాయి. గుడిలోకెళ్ళి కొబ్బరికాయ కొట్టి వచ్చి వుంటుంది అనుకున్నాడు.

ఆమె ఆకుపచ్చ కాటన్ చీరలో ఉంది. పచ్చటి శరీరం. ముఖం సరిగా కనిపించ డంలేదు. జడలో ఎర్రగులాబీ పెట్టుకుంది. చేతుల నిండుగా గాజులున్నాయి. కాళ్ళు కోనేటి నీళ్ళలో వున్నాయి. చీరపైకి లాక్కుని సగం కాళ్ళు కోనేట్లోకి ముంచి, నీటి తరంగాలను చూస్తూ ఆనందిస్తోంది.

సంధ్య వెలుగులు చిమ్ముతోంది. పడ మర మబ్బులు రకరకాల ఆకారాలతో రంగు రంగులు నీళ్లల్లో ప్రతిఫలిస్తు న్నాయి.

చీకటి పడబోతోంది.

ఇక బయల్దేరాలనుకున్నాడు. పొట్లాంలో మరమరాలు గూడా అయిపోయాయి.

"ఏమండీ ప్రసాదం తీసుకోండి" ఆమె వంగి చేతితో కొబ్బరిముక్కలు అంది స్తోంది.

ప్రసాదం తీసుకుంటూ ఆమె ముఖం లోకి చూశాడు. చందమామలాంటి ముఖం, కోటేరులాంటి ముక్కు, చేప పిల్లల్లా మిలమిల మెరుస్తున్న కళ్ళు.

"సీతా? " అన్నాడు ఆశ్చర్యచకితుడ వుతూ.

ఆమె కళ్ళు పెద్దవయ్యాయి.

"ఎవరూ? " అన్నది

"ముందు ఇది చెప్పు. నువ్వు నందం

సీతామహాలక్ష్మివేనా? " అడిగాడు గట్టి నమ్మకంతో. ఆమె కచ్చితంగా సీతే అని అతని మనసు చెప్తోంది.

"ఔనూ! మీరు..? సారీ అండీ గుర్తుపట్టలేకపోతున్నా!" అన్నది.

"నేను నిన్ను గుర్తుపట్టినప్పుడు, నువ్వెందుకు నన్ను గుర్తుపట్టలేకపోతున్నావు? నేను గుర్తుపట్టలేనంత ఘోరంగా మారిపోయానన్నమాట" అన్నాడు నవ్వుతూ.

సీత అతన్నే పరీక్షగా చూస్తూ గుర్తించడానికి తిప్పలు పడుతోంది.

"ఎనిమిదో తరగతి చదువుతున్నప్పుడు మనం ఇక్కడ్నుంచి శాంతినగర్ హైస్కూలుకి నడిచివెళ్లేవాళ్ళం. తిరిగి త్వరత్వరగా చీకటి పడకముందు వచ్చి ఇక్కడే కూర్చుని చేపలకు మరమరాలు విసురుతూ ఆడుకునేవాళ్ళం. నేను అప్పుడప్పుడూ చొక్కా, లాగు విప్పి కోనేట్లోకి దిగి ఈత కొట్టేవాడిని. నువ్వు తిట్టేదానివి. ఛీ... వెధవా! మొండిమొలతోనా అనేదానివి. మరి నిక్కరు తడిసిపోతే అమ్మ చంపుద్దమ్మా .. అనేవాడిని...!" చెప్పుకుపోతున్నాడు చెన్నకేశవులు.

"చాలు.. చాలు..! నువ్వు వేమూరి చెన్నకేశవులువి కదూ? " అన్నది.

ఆమె సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయింది.

'ఎప్పటి చెన్నకేశవులు? ఇన్నేళ్ళ తర్వాత, మళ్ళీ ఇదే కోనేటి గట్టున కన్పించడం ఎంత గమ్మత్తుగా వుంది' అనుకుంటూ అతని పక్కనే చతికిలపడింది.

"ఎన్నాళ్టికెన్నాళ్టికి కనపడ్డావురా! నిన్ను అసలు గుర్తుపట్టలేకపోయానురా! అంత మారిపోయావు. అప్పుడు సన్నగా, గడకర్రలా పొడుగ్గా ఉండేవాడివి. నిన్నంతా రవణారెడ్డి అని ఏడిపించేవాళ్ళు. నాకన్నీ గుర్తొస్తున్నాయిరా!" సంతోషంతో గలగల మాట్లాడుతోంది సీత.

చెన్నకేశవులుకి గూడా చాలా ఆనందంగా ఉంది. చిన్నప్పటి స్నేహితురాలు ఎన్నో ఏళ్ళ తర్వాత యాదృచ్ఛికంగా కన్పించి గుర్తుపట్టడం చాలా థ్రిల్లింగ్‌గా ఉంది. నమ్మలేకపోతున్నాడు. కలా? నిజమా? అనిపిస్తోంది. తను కోనేటి గట్టున కూర్చుని సీతని తలుచుకున్నాడు. ఆమె వచ్చి పలకరించింది. ఎంత ఆశ్చర్యం?

"అప్పుడు మీ అమ్మ, నాన్న చనిపోయారనీ, నువ్వు ఎటో వెళ్ళిపోయావని చెప్పుకున్నారు. ఇన్నాళ్లూ ఎక్కడున్నావురా? ఈ ఊరు ఎప్పుడొచ్చావు? " అడిగింది సీత.

చెన్నకేశవులు టూకీగా తన గురించి చెప్పాడు.

"భలే వుందిరా నీ కథ. పక్షిలా స్వేచ్ఛగా తిరిగావన్నమాట దేశమంతా. అదృష్టవంతుడివి" అన్నది.

"నాది అదృష్టమేనంటావా? " అడిగాడు.

"అదృష్టానికి ఒక నిర్వచనం ఏవుంటుంది? అందరూ ఉండడం, అంతులేని డబ్బుండడం, కీర్తి, ప్రతిష్టలు, ఇందులో ఏది అదృష్టం? నన్నడిగితే స్వేచ్ఛగా, తనకు నచ్చినట్లుగా జీవించగలగడమే అదృష్టమంటాను" అన్నది.

మీ ఆడవాళ్లు ఎప్పుడూ నాలుగు గోడల మధ్యనే గడపాల్సిరావడం వలన, స్వేచ్ఛగా ఉండే అవకాశం లేనందువలన అలా అనుకుంటారేమో? " అన్నాడు నవ్వుతూ.

"కావొచ్చు. నిన్ను చిన్నప్పటిలా ఏరా అని పిలుస్తుంటే నాకు హాయిగా వుంది. నీకు ఇబ్బందిగా వుందేమో? చెట్టంత మనిషివి అయ్యావు" అన్నది సీత.

"ఏరా! అని పిలిచే వాళ్ళుండడం గూడా అదృష్టమేమో? "

"ఔనా? " అని గలగలానవ్వింది సీత.

"అదృష్టం సంగతి అలా ఉంచు. నీ సంగతేమిటి? మీ ఆయన ఏం చేస్తాడు?

పిల్లలు ఎంతమంది? అడిగాడు చెన్నకేశవులు.

"నాకు పెళ్ళే అవలేదు. పిల్లలు ఎక్కడ్నుంచి వస్తారు? " అన్నది.

"నీకింకా పెళ్ళి కాలేదా? నా వయసు దానివేగా? " ఆశ్చర్యపోతూ అడిగాడు.

"ఆ మాటకొస్తే నీకూ పెళ్లికాలేదుగా? "

"నా విషయం వేరు. నేను మగాడిని."

"ఆ పొగరే వద్దురా! మగాడైతే ఏంటి గొప్ప? "

"గొప్పని కాదు. మగాడికి ఎన్నేళ్లొచ్చినా పిల్లనిచ్చే వాళ్లుంటారు. ఆడదానికి అలాకాదుగా? "

"ఆ మాట నిజమేననుకో? నా విషయం వేరు. నేను నా పరిస్థితులు వేరు."

"ఔను సీతా! నీకు ముప్పై ఏళ్లు దాటినా ఎందుకు పెళ్లి చేసుకోలేదు? "

"నీ కోసం ఎదురు చూస్తున్నానురా! ఏం? నన్ను పెళ్లిచేసుకుంటావా? " అని పకపకా నవ్వింది. కన్నీళ్లు వచ్చేవరకూ నవ్వింది. ఆ కన్నీళ్లు నవ్వినందువల్ల వచ్చిన ఆనందష్పాలో, సీత నిజంగా ఏడుస్తున్నదో అర్థం కాలేదు.

అయోమయంగా చూశాడు సీత ముఖంలోకి. నిజంగానే సీత ఏడుస్తోంది. అతని భుజం మీద తలవాల్చి వెక్కి, వెక్కి ఏడుస్తోంది. ఆమె కన్నీళ్లు అతని షర్టుమీద పడి తడిసింది.

"సీతా! ఏంటిది!" అని ఆమె బుగ్గలమీదుగా కారుతున్న కన్నీళ్లు తుడిచి, చెంపలను తడిమి ఓదార్చాడు.

"మన చిన్నప్పుడే బాగుండేదిరా! మునికొండ పల్లెటూరుగా వున్నప్పుడు అంతా సుఖంగా వుండేవాళ్లు. పాడు గ్రానైట్ రంగురాళ్లు పడి ఊరు సర్వనాశనమైందిరా! పొలాలకు విలువ పెరిగి, లక్షలు, కోట్లు వచ్చి మనుషులు మారిపోయారు. కుటుంబాలు విచ్ఛిన్నమైపోయాయి. పూరిళ్లు, పెంకుటిళ్లుపోయి మేడలు వెలిశాయి. ఊరు అదృశ్యమైపోయింది. అట్లాగే మానవ సంబంధాలు మాయమైపోయాయి. విలువలు మంటగలిశాయి. అంతా డబ్బు ప్రపంచం." అన్నది.

చీకటి పడింది. కోనేటి చుట్టూ లైట్లు వెలిగాయి. దీపాల వెలుగు నీళ్లలో ప్రతిఫలించి ఆ పరిసరాలన్నీ అందంగా కనిపిస్తున్నాయి.

"మీ అక్క రేవతి బాగుందా? " అడిగాడు చెన్నకేశవులు.

"ఇంకెక్కడి రేవతి." అని చెప్పడం మొదలు పెట్టింది.

★ ★ ★

పద్మనాభరావుకి గ్రానైట్ రాయి



**ఏ పాపంలో**
**షేరు (భాగం)**
**తీసుకున్నామో?**
**ఈ షేరు**
**ఇంతలా పడిపోయింది!**

**–వోలేటి శ్రీనివాసరావు,**
విజయనగరం

పొలంలో పడినందుకు అదృష్టం అన్నారు. లక్షలు వచ్చిపడ్డాయి. దానితోనే ఆయన ఊహాలు రెక్కలు విప్పుకున్నాయి. కోరికలు గుర్రాల్లా పరిగెత్తాయి. పెంకుటిల్లు పడగొట్టించి రెండతస్తుల మేడ కట్టించాడు. కారు కొనుక్కుని దర్జాగా తిరగడం మొదలుపెట్టాడు. గ్రానైట్ కంపెనీ యజమానులు, అధికారులు సరదాలు తీర్చుకోవడానికి వెలిసిన క్లబ్బులో మెంబరయ్యాడు. తాగుడు, పేకాట అలవాటయ్యాయి.

రేవతిని మొదటి నుంచి చెల్లెలు కొడుకు

విశ్వమోహన్‌కిచ్చి పెళ్లిచేయాలని అనుకున్నారు. విశ్వమోహన్ విశాఖపట్నంలో షిప్‌యార్డ్‌లో పనిచేస్తున్నాడు.

ఇక ఇప్పుడు పద్మనాభరావు ధనవంతుడయ్యాడు. ఎంతైనా కట్నం ఇవ్వగలడు. మేనల్లుడి సంబంధం చీప్‌గా కనపడింది. చాలామంది తమ ఆడపిల్లల్ని అమెరికా సంబంధాలు చూసి పెళ్లి చేసి పంపిస్తున్నారు. మా అల్లుడు అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. మా అల్లుడు అక్కడ డాక్టర్ అని గొప్పగా చెప్పుకోవడం మొదలుపెట్టారు. వాళ్లని చూసి పద్మనాభరావుకి గూడా అమెరికా అల్లుడ్ని తెచ్చుకోవాలని కోరిక పుట్టింది.

పేపర్లో ప్రకటన చూసి మాట్లాడారు. వాళ్లది బెంగళూరు. అబ్బాయి పేరు భరద్వాజ్. పద్మనాభరావు బెంగళూర్ వెళ్లి చూసి వచ్చాడు. అప్పుడు భరద్వాజ్ లేడు. అమెరికాలో ఉన్నాడనీ, నెల రోజుల్లో ఇండియా వస్తాడనీ పిల్లనచ్చితే వెంటనే పెళ్లిచేసుకుని అమెరికా తీసుకెళ్తాడనీ భరద్వాజ్ తండ్రి చెప్పాడు. కొడుకు ఫొటో చూపించాడు. రేవతి ఫొటో ఇచ్చి వచ్చాడు.

అలాగే నెల తర్వాత భరద్వాజ్ వచ్చాడు. రేవతిని చూడడానికి వాళ్లంతా విమానంలో బెంగళూరు నుంచి హైదరాబాద్ వచ్చారు. అక్కడ్నుంచి పద్మనాభరావు ఏర్పాటుచేసిన కారులో మునికొండ వచ్చి రేవతిని చూశారు. నచ్చిందన్నారు. పది లక్షలు కట్నం అడిగారు. సరే అన్నాడు పద్మనాభరావు.

మరో నాలుగు లక్షలు ఖర్చుచేసి ఘనంగా పెళ్లి జరిపించి అత్తవారింటికి పంపించాడు. రేవతి బెంగళూరువెళ్లి అత్తగారింటి నుంచే అమెరికా వెళ్లిపోయింది.

నెల తర్వాత భరద్వాజ్ అసలు స్వరూపం బైటపడింది. అతనికి అమెరికాలో భార్య, పిల్లలు ఉన్నారు, ఆమె యూరోపియన్. ఆ సంగతి దాచి ఇండియా వచ్చి రేవతిని పెళ్లిచేసుకున్నాడు. రహస్యం బైటపడిన తర్వాత 'నీకు ఇష్టమైతే ఉండు, లేకపోతే నీ పుట్టింటికి పో' అన్నాడు. రేవతి జరిగిందంతా తండ్రికి ఫోన్ చేసి చెప్పింది. పద్మనాభరావు కూతుర్ని వచ్చెయ్యమన్నాడు. కాని ఎంతో ఆర్భాటంగా అమెరికా వెళ్లిన తాను మొగుడు వదిలేశాడని పుట్టింటికి తిరిగి వస్తే నలుగురిలో చులకన అవుతానన్న బాధతో అక్కడే పడి వుంది.

తర్వాత రేవతి నుంచి ఫోన్ రాలేదు. కొన్ని రోజుల తర్వాత మీ అమ్మాయి ఆత్మహత్య చేసుకుందని భరద్వాజ్ ఫోన్ చేశాడు. పద్మనాభరావుకి గుండెపోటు వచ్చింది. ఇక కోలుకోలేదు. కుప్పకూలిపోయాడు. హాస్పటల్‌కి తీసుకెళ్లే లోపలే చనిపోయాడు. ఆయన పోయాక అప్పులు బైటపడ్డాయి.

ఇంట్లోవున్న బంగారం, ఇంటి స్థలం, ఖరీదైన సామాన్లు, అమ్మేసి అప్పులు తీర్చారు. ఇల్లుమాత్రం దక్కించుకున్నారు. ఇప్పుడా ఇంట్లో పై భాగం అద్దెకుఇచ్చి, కింద తను, తల్లి వుంటున్నారు.

చెప్పడం ముగించింది సీతామహాలక్ష్మి.

"మీ అమ్మ నీకు పెళ్లి చేయాలని ప్రయత్నించడం లేదా?" అడిగాడు చెన్నకేశవులు.

"మా నాన్న చనిపోయాక మా అమ్మ పిచ్చిదానిలా అయిపోయింది. ఆమెకు మతిస్థిమితం లేదు. పసిపిల్లలా ఏడుస్తుంటుంది. అక్క జీవితం అర్ధాంతరంగా ముగియడం, నాన్న గుండెపోటుతో పోవడం, అప్పుల వాళ్లు ఇంటిమీదకు వచ్చి గొడవ చెయ్యడం ఆమె మనసుమీద తీవ్రమైన ప్రభావం చూపాయి. నేను పెళ్లిచేసుకుని వెళ్లిపోతే అమ్మ దిక్కులేనిదై

పోదూ? " అన్నది సీత.

"పోనీ నీతో పాటు ఇంట్లోనే వుండేవాడు గాని, లేదా మీ అమ్మను నీతోపాటు తీసు కురావడానికి ఒప్పుకునేవాడుగాని ఎవరూ దొరకలేదా? " అడిగాడు.

"అటువంటి మంచివాడు ఈ ప్రపం చంలో పుట్టివుంటాడంటావా? " అని నవ్వింది సీత.

"అంటే మగళ్లాంతా మీ అక్క మొగు డిలా మోసగాళ్లు, దుర్మార్గులూ అంటావా? "

"కాకపోవచ్చు కాని ఎవర్ని నమ్మ గలం? పెళ్లయ్యేవరకూ సానుభూతి చూపి స్తారు. మీ అమ్మ నాకూ అమ్మేగాని అత్త కాదంటారు. పెళ్లయ్యాక ఇంత పెద్దఇల్లు మనకెందుకూ, అమ్మేద్దాం అంటారు. నేను మనుషులమీద నమ్మకం పోగొట్టుకు న్నారా! ఎవర్నీ నమ్మదల్చుకోలేదు. అంతా మేకతోలు కప్పుకున్న పులులు. నా నమ్మకం నాది. లోకంలో మంచి వాళ్లుం డొచ్చు కాని పెళ్లాం దగ్గర మంచితనం చూపించే మంచి వాళ్లు ఎందరు? "

"నీ నిర్ణయం నాకేం నచ్చలేదు సీతా! మీ అమ్మకోసం నీ జీవితం వ్యర్థం చేసు కుంటావా? "

"మరి ఎవరి కోసం వ్యర్థం చేసుకో వాలి? పెళ్లి చేసుకుని, మొగుడి చేతిలో తిట్లు, తన్నులు తింటూ, పిల్లల్నికని వాళ్ల కోసం ఏడుస్తూ బతకడమే జీవితానికి సార్థకమా? అంతేలే నువ్వు మగాడివి కావా? నీ ఆలోచనలు వేరుగా ఎందుకుం టాయి? "

"నేను గూడా చెడ్డవాడిలా కనిపిస్తు న్నానా? "

"మంచివాడివని గ్యారెంటీ ఏంట్రా? అయితే నన్ను పెళ్లిచేసుకుని నన్నూ, మా అమ్మనూ పోషించి మంచివాడివని నిరూ పించుకో చూద్దాం? " అన్నది గలగలా నవ్వుతూ.

"నిన్ను మాటలతో గెలవలేను సీతా!"

"సర్లేరా! ఓడిపోయానని ఒప్పుకో"

"మరి నీకు కాలక్షేపం ఎట్లా సీతా? "

"పిల్లలకు సంగీతం నేర్పుతుంటాను. అమ్మ చిన్నతనంలో నేర్పించిన సంగీతం ఇప్పుడు ఉపయోగపడింది. అసలు తీరికే ఉండదు. ఆదివారం ఇలా శివాలయానికి వస్తుంటాను" అన్నది సీత.

"ఇక పోదాం సీతా! బాగా చీకటి పడింది" అని పైకి లేచాడు చెన్నకేశవులు.

ఆమె గూడా లేచింది. ఇద్దరూ గుడి బైటకు వచ్చారు.

"మా ఇంటికి రారా! భోజనం చేసి పోదువుగాని" అన్నది సీత.

"ఇప్పుడు కాదులే. తర్వాత ఎప్పుడైనా వస్తాను. మీ ఇంటి అడ్రస్ చెప్పు" అన్నాడు తన అడ్రస్ కార్డు చేతికిచ్చి.

"పాత ఇల్లేరా! కాకపోతే అప్పుడు పెంకు టిల్లు. ఇప్పుడు మేడ" అన్నది.

సీతామహాలక్ష్మి కనిపించినంత దూరం చూస్తూ వుండిపోయాడు చెన్నకేశవులు. భారంగా నిట్టూర్చాడు.

★ ★ ★

మునికొండ గ్రానైట్ వర్కర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ పేరుతో కార్మిక సంఘాన్ని రిజిస్ట్రేషన్ చేయించాడు చెన్నకేశవులు. చంద్రకళ పాలిషింగ్ యూనిట్లో పనిచే స్తున్న పాతికమంది మెంబర్లు. చెన్నకే శవులు ప్రెసిడెంట్. సత్యం సెక్రెటరీ.

చెన్నకేశవులు కొత్త లేబర్ యూనియన్ స్థాపించాడని తెలిసి అంతా అందులో సభ్యత్వం తీసుకోవడానికి పోటీలుపడ్డారు. గ్రానైట్ క్వారీలో ప్రమాదం జరిగినప్పుడు ఎమ్మెల్యేకి సంబంధించిన కంపెనీతో పోట్లాడి ఒక్కొక్కరికి పదిలక్షలు పరి హారం ఇప్పించడం కార్మికుల్లో అతనికొక గుర్తింపు తెచ్చింది. ఇప్పుడు గూడా లారీ

ప్రమాదంలో చనిపోయిన వారి కోసం నిల బడడం అతని ఇమేజ్ పెంచింది.

చెన్నకేశవులికి ఏ పదవీ లేకపోయినా న్యాయం కోసం పోరాడే మనిషి అనేది కార్మికులు అర్థం చేసుకున్నారు. అటువంటి వాడు గుర్తింపు వున్న యూనియన్ నాయకుడైతే ఎన్నో సాధిస్తాడు అనుకున్నారు.

బ్రహ్మయ్య కార్మికుడుగా ఉన్నప్పుడు పూరింట్లో వుండేవాడు. పాత సైకిల్‌కి క్యారేజీ కట్టుకుని క్వారీలో పనికి పోయేవాడు. యూనియన్ నాయకుడయ్యాడు. డాబా ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. స్కూటర్ కొనుక్కున్నాడు. పిల్లలు కాన్వెంట్‌లో చదవడం మొదలుపెట్టారు. తర్వాత కొత్తపేటలో వెయ్యి గజాలు కొన్నాడు. ఏదో కంపెనీ వాళ్ళిచ్చారని అంటారు. అక్కడక్కడా స్థలాలు కొన్నాడు, అమ్మాడు. అందులో లాభం వచ్చిందని ప్రచారం చేయించుకున్నాడు. మూడంతస్తుల మేడ కట్టాడు. మూడు కార్లు కొన్నాడు. అతని భార్య కిలోల కొద్దీ బంగారం కొన్నది. అతని పిల్లలకు డొనేషన్లు కట్టి యం.బి.బి.ఎస్., ఇంజినీరింగ్‌లో సీట్లు కొన్నాడు. అంతా అతని అదృష్టం అని నెలనెలా గ్రానైట్ కంపెనీలు అతనికి నజరానాలు ఇస్తుంటాయి. కార్మికులతో ఏ గొడవా లేకుండా, సమ్మెలు వగైరా రాకుండా అంతా సజావుగా జరిపిస్తున్న బ్రహ్మయ్యంటే అందరికీ ఎంతో అభిమానం. ఇన్నాళ్ళూ ఎదురులేని బ్రహ్మయ్యకు ఇప్పుడు సవాల్‌గా మారాడు చెన్నకేశవులు.

గ్రానైట్ కార్మికులు బ్రహ్మయ్యకు, చెన్నకేశవులికి తేడా ఏమిటనేది పోల్చి చూస్తున్నారు.

గెలాక్సీ గ్రానైట్ కంపెనీ ముందు చెన్నకేశవులు కార్మికులతో ధర్నా చేస్తున్నాడు. ఆ విషయం తెలిసి యం.డి. పోలిశెట్టి సత్యనారాయణ ఆఫీసుకి వెళ్ళకుండా ఇంట్లోనే ఉండిపోయాడు. సాయంకాలం క్లబ్బుకి వెళ్ళాడు. అక్కడ పొట్లూరి సింగయ్యనాయుడు ముందు అనుకున్న ప్రకారమే అతడిని కలిశాడు.

పోలిశెట్టి సత్యనారాయణను చూడగానే, "ఏం నాయుడు బావా! బాగున్నావా?" అన్నాడు సింగయ్య నాయుడు.

"నేనేం నాయుడ్ని లేవయ్యా! నాయుడని పేరుంది మీకు. రాజ్యం మీ అన్నది. యువరాజువి నువ్వు" అన్నాడు సత్యనారాయణ.

"నీకేమైంది బావా! వంద కోట్లకి సింగపూర్ ఆర్డర్ కొట్టేశావుగా? నీ పంట పండింది పో"

"మీకు ఏం తక్కువైంది? గవర్నమెంట్ కాంట్రాక్టులన్నీ మీవేగా?"

"ఏదోలే బావా! అంతా దేవుడి దయ"

"అంతేలే. ఇంకేంటి సంగతులు"

"ఏవున్నాయి? నువ్వే చెప్పాలి బావా?"

"ఈమధ్య చెన్నకేశవులని కొత్తగా లేబర్ యూనియన్ పెట్టాడంట. మా ఆఫీసుకొచ్చి బెదిరించి పోయాడు" అన్నాడు సత్యనారాయణ.

"కొత్తేముందిలే? పాతోడే. ఏవంటాడేం"

"లారీ యాక్సిడెంట్‌లో పోయిన వాళ్ళకి పదేసి లక్షలు ఇస్తావా? చస్తావా? అని కూర్చున్నాడు"

"మరి బ్రహ్మయ్యేం చేస్తున్నాడు?"

"అసలు ఇవ్వకపోతే ఎట్లా? తలా ఒక లక్ష ఇవ్వమన్నాడు"

"ఇస్తే పోలా?"

"వాళ్ళెవరూ పుచ్చుకోవడంలేదు. పది లక్షలు ఇవ్వాల్సిందే అని పట్టుబట్టి కూర్చున్నాడు. ఊరి నిండా కరపత్రాలు పంచడం, ఊరేగింపులు, ధర్నాలు చేయిస్తున్నాడు. టీవీ వాళ్ళకేం పనిలేదు. వాళ్ళేమో ఇరవై నాలుగు గంటలూ వాడి ఉపన్యాసాలు

చూపిస్తున్నారు. ఇప్పుడేమో వాడొక హీరో"

"అన్నయ్యతో మాట్లాడావా? "

"అసెంబ్లీ సమావేశాలయ్యాక వస్తాగా? అప్పుడు వాడితో మాట్లాడి సెటిల్ చేద్దాం అన్నాడు. ఈ లోపల వీడు ఊదరగొడుతున్నాడు. నిద్రపోనియ్యడంలా. అసలు వాడికి కొమ్ములు తెచ్చింది మీరేనయ్యా"

"మేమా? "

"ఔను. అప్పుడు క్వారీలో యాక్సిడెంట్ జరిగినప్పుడు మనిషికి పది లక్షలు ఇచ్చింది మీరు కాదూ? అదే పట్టుకుంది ఇప్పుడు.. నిష్ఠూరంగా అన్నాడు సత్యనారాయణ.

"అది వేరు. యాక్సిడెంట్ క్వారీలో జరిగింది. ఐనా అప్పుడు మొండిగా ఉంటే ఎలా? రాజకీయాల్లో ఉన్నాం కదా? చెడ్డ పేరు తెచ్చుకుంటే ఓట్లెవరు వేస్తారు? అందరితో మంచిగా వుంటేనే నాలుగు కాలాలపాటు పదవి వుంటుంది. మీకా బాధ లేదు"

"ఎందుకు లేదు బాబూ? వాడు సమ్మె చేయిస్తానని బెదిరిస్తున్నాడు. సమయానికి సరుకు రెడీకాకపోతే ఎక్స్‌పోర్ట్ ఏం చేసేది? కేన్సిలైతే నిండా మునిగిపోతాను"

"అంత వర్రీకాకు బావా! ముందు మందు పుచ్చుకో" అన్నాడు గ్లాసు పైకెత్తి. ఇద్దరూ మాట్లాడుకుంటూ కూర్చున్నారు. తర్వాత యూనియన్ లీడర్ బ్రహ్మయ్య, ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు వచ్చి కలిశారు.

"ఏంది బ్రహ్మయ్యా! మా బావని ఇరుకున పెట్టావే!" అన్నాడు సింగయ్యనాయుడు.

"భలేవారే నాయుడు గారూ! నేను ఇరుకున పెట్టడమేంది? ఇన్నేళ్ళ నుంచి చూస్తున్నారుగా! ఎన్ని యాక్సిడెంట్లు జరగలేదు. ఎప్పుడైనా ఇబ్బంది కలిగించానా? న్యాయంగా సెటిల్ చేయించలా? మీకు నా గురించి తెలియదా ఏం? " అని నవ్వాడు బ్రహ్మయ్య.

"ఎందుకు తెలీదూ? ఆ లారీ యాక్సిడెంట్ కేసేంది? నానబెడుతున్నారు? ఏదొకటి సెటిల్ చెయ్యక? "

"చెన్నకేశవులు అడ్డం తగులుతున్నాడు నాయుడుగారూ! కొత్తబిచ్చగాడు పొద్దెరగడని. ప్రతిదానికీ నేనున్నానని ముందుకొస్తున్నాడు. తలనొప్పిగా వుంది వాడితో" అన్నాడు బ్రహ్మయ్య.

"ఐతే వాడు చెప్పినట్లు చెయ్యక తప్పదంటావా? " అడిగాడు సింగయ్యనాయుడు.

"వాడిప్పుడు ముదిరిపొయ్యాడు. ఈ సత్యనారాయణ సార్ వాడిని నువ్వే కెపాసిటీలో అడగడానికి వచ్చావ్ అన్నారట. అది మనసులో పెట్టుకుని వాడొక యూనియన్ రిజిస్టర్ చేయించి అందర్నీ మెంబర్లుగా చేర్చుకుంటున్నాడు" అన్నాడు బ్రహ్మయ్య.

"ఔనయ్యా! అడిగాను. తప్పేముంది? "

"మీరు అడగడం తప్పనలా! యూనియన్ లేకపోతే వాయిస్ వుండదని పెట్టుకున్నాడు. ఆ సంగతి చెప్తున్నా!" అని ముఖం చిన్నబుచ్చుకున్నాడు బ్రహ్మయ్య.

"పోన్లే బ్రహ్మయ్యా! రోజులన్నీ మనవికాదు. కొత్త యూనియన్లు వస్తేరానీ. నీకేమైంది? నువ్వు బాగానే సంపాదించుకున్నావుగా? " అన్నాడు రంగూన్ రామారావు నవ్వుతూ.

"మీరేం తక్కువా ఇన్‌స్పెక్టర్‌గారూ? సినిమా బిజినెస్‌లో పెట్టుబడి పెడుతున్నారుగా? " అని ఎత్తిపొడిచాడు బ్రహ్మయ్య.

"నాదేవుందిలే! నీ ఇంజనీరింగ్ కాలేజీతో పోలిస్తే ఉప్పు, పప్పు కిందకిరాదు నా పెట్టుబడి" అన్నాడు రంగూన్ రామారావు.

"చాల్లెండయ్యా! ఎవడైనా విలేఖరి వింటే అన్నీ పేపరుకెక్కిస్తాడు. హాయిగా మందు తాగండి. బిర్యానీ తెప్పిస్తాను" అన్నాడు సింగయ్య నాయుడు.




చంద్రకళా పాలిషింగ్ యూనిట్ ఆఫీసులో కూర్చుని వున్నాడు చెన్నకేశవులు.

గేటు ముందు క్వాలిస్ వాహనం ఆగింది. అందులోనుంచి ఇద్దరు వ్యక్తులు దిగారు. ఫైల్మాన్‌ల మాదిరిగా లావుగా కండలు పెంచారు. గడ్డాలు పెరిగి వున్నాయి. చేతులకు వుంగరాలున్నాయి. ముంజేతికి బ్రాస్‌లెట్లున్నాయి. గంజి పెట్టిన ఖద్దరు చొక్కాలు వేసుకుని వున్నారు.

ఆఫీసులోకెళ్ళి "చెన్నకేశవులన్నా, ఎమ్మెల్యేగారు నిన్ను రమ్మంటున్నారు" అన్నాడు అందులో ఒకడు.

చెన్నకేశవులు తలెత్తి చూశాడు.

"ఎక్కడున్నారు? " అడిగాడు చెన్నకేశవులు.

"గెస్ట్‌హౌస్‌లో".

"సరే పదండి" అని బయల్దేరాడు.

పార్కింగ్ చేసిన బైక్ దగ్గరకు వెళ్తుంటే, "నీ కోసం బండిపంపారన్నా!" అన్నాడు.

"మళ్ళీ వచ్చేటప్పుడు కావాలిగా!" అన్నాడు.

"మేము దిగబెడతాంగదా!" అంటే చెన్నకేశవులు క్వాలిస్ ఎక్కి కూర్చున్నాడు.

"నేనెవరో మీకు తెలుసా? " లోపల కూర్చున్నాక అడిగాడు చెన్నకేశవులు.

"భలేవోడివన్నా! నువ్వు తెలియనోడు ఈ వూళ్ళో ఎవుడున్నాడు" అని నవ్వాడు.

"అందరికీ ఎలా తెలుస్తాను? "

"అదేందన్నా! నువ్వెప్పుడూ టీవీలో కనపడుతుంటావుగా? "

"ఓ.. అదా? " అని నవ్వుకున్నాడు.

కాసేపటికి గెస్ట్‌హౌస్ ముందు క్వాలిస్ ఆగింది. అక్కడ లాన్‌లో, వరండాల్లో చాలామంది అటూ ఇటూ తిరుగుతున్నారు. గుంపులు గుంపులుగా ఏదో డిస్కస్ చేస్తున్నారు. వాళ్ళంతా రకరకాల పనులమీద ఎమ్మెల్యేని కలవడానికి వచ్చి వుంటారని వూహించాడు చెన్నకేశవులు.

"మీరేనా చెన్నకేశవులు..? " ఆశ్చర్యంగా అడిగాడు ఎమ్మెల్యే పొట్లూరి శ్రీనివాసులు నాయుడు.

తల వూపాడు చెన్నకేశవులు.

"చిన్నవారే? నేనింకా పెద్దవారై వుంటారనుకున్నాను" అని నవ్వాడు. తర్వాత -

"మిమ్మల్నెక్కడో చూసినట్లుంటే? " అన్నాడు.

చెన్నకేశవులు ఏం మాట్లాడలేదు. తను మునికొండ గ్రామవాసినే అనీ, ముఖ్యంగా ఆయన సర్పంచ్‌గా వున్నప్పుడు ఆయన నింట్లో పనిచేసిన వరమ్మ కొడుకుననీ చెప్పలేదు. చెప్పదల్చుకోలేదు.

"మీరిక్కడ లేబర్ యూనియన్ స్థాపించారంట? " వత్తిపలికాడు శ్రీనివాసులు నాయుడు.

"ఔనండీ! ఏదో ఒకటి మంచి చెయ్యాలి గదా? "

"మీకు ఇక్కడేం ఉద్యోగంలేదా? "

"ఒకప్పుడు వుండేదండీ. కరీం ట్రాన్స్‌పోర్టులో మేనేజర్‌గా పనిచేశాను. ఆ టైమ్‌లో క్రాస్‌రోడ్స్ దగ్గర లారీ యాక్సి

డెంట్ జరిగింది. సుబ్బారెడ్డి గారి కారును మా లారీ గుద్దింది. ఆ యాక్సిడెంట్‌లో ఆయన చనిపోయారు. అదేదో నేనే చేయించినట్లు అంతా అనుమానించారండీ. పోలీసులు, ఆర్టీఓ గూడా మా ట్రాన్స్‌పోర్ట్ లారీలను ఆపడం, కేసులు రాయడం ఇవన్నీ చేశారు. చివరికి హోమ్ మినిస్టర్ పేషీ నుంచి కరీంకి ఫోన్‌చేసి నన్నిక్కడ నుంచి పంపించెయ్యమని అన్నారట. కరీం భయపడిపోయాడు. నన్ను ఇక్కడ్నుంచి వచ్చెయ్యమన్నాడు" చెప్పాడు చెన్నకేశవులు.

శ్రీనివాసులు నాయుడు ముఖం నల్లబడింది.

"మిమ్మల్ని ఉద్యోగంలోనుంచి తీసేశాడా? "

"లేదండీ! హైదరాబాద్ వచ్చెయ్యమన్నాడు".

"మరి వెళ్ళొచ్చుగా? మీరొచ్చింది గూడా సిటీనుంచేగా? "

"ఔననుకోండి. నాకెందుకో ఇక్కడ బాగా నచ్చింది. మా కులం వాళ్ళుగూడా ఎక్కువగా వున్నారు. ఇక్కడే సెటిలైపోవాలని నిర్ణయించుకున్నాను" అన్నాడు.

"ఇప్పుడేం చెయ్యడానికి లేక లేబర్ యూనియన్ స్థాపించారా? "

"నిజం చెప్పాలంటే అది కాదు కారణం. ప్రజలకు సేవ చెయ్యాలంటే ఏదో ఒకటి చేయాలి. దానికి ఇలాంటిదేదైనా పదవి కావాలికదండీ? ఎలక్షన్లో నిలబడి గెలిచి పదవి పొందేంత కెపాసిటీ నాకు లేదు. అందువలన నేనే ఈ పదవి క్రియేట్ చేసుకున్నాననుకోండి."

చెన్నకేశవులి మాటలు ఎమ్మెల్యేకి ఎక్కడో గుచ్చుకుంటున్నాయి. వీడు సామాన్యుడు కాదని మాటలనుబట్టి గ్రహించాడు.

ఇంతలో యూనియన్ లీడర్ బ్రహ్మయ్య వచ్చి నమస్కారం పెట్టి కూర్చున్నాడు.

"బ్రహ్మయ్యగారు తెలుసుగదా? " చెన్నకేశవుల్ని ఉద్దేశించి అడిగాడు శ్రీనివాసులు నాయుడు.

"అయ్యో ఆయన తెలీకపోవడం ఏంటి సార్? బాగా తెలుసు" అన్నాడు చెన్నకేశవులు.

బ్రహ్మయ్య నవ్వి ఊరుకున్నాడు.

"మీ ఇద్దరికీ రాజీ చేయాలని పిలిపించాను" అన్నాడు.

"మాకు విభేదాలు ఏమున్నాయిసార్ రాజీ చేయడానికి? " అడిగాడు చెన్నకేశవులు.

"ఎందుకు లేవూ? ఉండబట్టే గదా! కొత్తగా ఒక లేబర్‌యూనియన్ పెట్టింది" నిష్ఠూరంగా అన్నాడు శ్రీనివాసుల నాయుడు.

"ముందే చెప్పాను కదా సార్! ప్రజాసేవ చేయడానికని. ఇన్నాళ్లు ఆయన చేస్తున్నారు. నేనూ చేయాలనుకున్నాను. అంతే సార్! ఇప్పుడు ప్రజాసేవ చేయడానికి ఎందరో ఎన్నో రాజకీయ పార్టీలు పెడుతున్నారు కదాసార్! అలాగన్నమాట" చెప్పాడు చెన్నకేశవులు.

"సరే! విషయానికొద్దాం. ముఖ్యంగా గెలాక్సీ గ్రానైట్ కంపెనీ కార్మికులు లారీ యాక్సిడెంట్‌లో చనిపోయిన కేసు"

"ఆయన్ని కలిసాను సార్! పదముగ్గురు చనిపోయారు. ఒక్కొక్కరికి పదిలక్షలు ఇప్పించమన్నాను" అన్నాడు చెన్నకేశవులు.

"గ్రూప్ ఇన్సూరెన్స్ డబ్బేదో వస్తుంది కదా? "

"అదెంత సార్? ఏభై వేలు"

"చెన్నకేశవులుగారూ! ఒకేసారి అంత డబ్బు డిమాండ్ చేస్తే ఎలా? "

"యాక్సిడెంట్‌లో చనిపోయింది ముసలి వాళ్లు కాదుసార్! యువకులు. పెళ్ళిళ్లయి

పిల్లలు, ముసలి తల్లిదండ్రుల భారం ఉన్న వాళ్లు ఉన్నారు. వాళ్ల జీవితాలు అర్ధాంతరంగా ముగిసిపోయాయి. ఇప్పుడు డబ్బు విలువ పడిపోయిన విషయం మీకు తెలియంది కాదు. వందల కోట్లు బిజినెస్ చేస్తున్నారు. వాళ్లకి ఇదేమంత పెద్ద మొత్తంకాదు సార్!"

ఎమ్మెల్యే తల పట్టుకున్నాడు.

"మీరు చెప్పింది నిజమే! బ్రహ్మయ్య వెళ్లి లక్షరూపాయలు ఇప్పించమని అడిగాడు. మీరు పదిలక్షలు అంటున్నారు. నేను మధ్యే మార్గంగా కుటుంబానికి ఐదు లక్షలు ఇప్పిస్తాను" అన్నాడు సీరియస్‌గా.

బ్రహ్మయ్య, చెన్నకేశవులు ఇద్దరూ మాట్లాడలేదు.

"నేను చెప్పింది సమ్మతం కాకపోతే మీరు కోర్టులో తేల్చుకోండి" కోపం ప్రదర్శించాడు శ్రీనివాసులు నాయుడు.

"అయ్యో! అలా అనకండి. మీరు చెప్పినట్టే కానివ్వండి. మీరు చెప్పాక మేము వినకపోతే బాగుండదు కదా!" అన్నాడు చెన్నకేశవులు లౌక్యంగా.

శ్రీనివాసులు నాయుడు ప్రసన్నవదనుడై చిరునవ్వు నవ్వాడు.

"సార్! నాదొక రిక్వెస్ట్. క్వారీలు దగ్గరికి షటిల్ సర్వీసులు నడిపించండి. అందువలన వర్కర్స్ లారీలు ఎక్కకుండా ఉంటారు. ఇటువంటి యాక్సిడెంట్స్ జరక్కుండా ఉంటాయి" అన్నాడు చెన్నకేశవులు.

"అలాగే మాట్లాడతాను. ఆర్టీసీ వాళ్లు ఒప్పుకోకపోతే గ్రానైట్ కంపెనీలతో ప్రైవేట్ బస్సులు ఏర్పాటు చేయిస్తాను" అని హామీ ఇచ్చాడు ఎమ్మెల్యే.

చెన్నకేశవులు నమస్కారం చేసి బైటకు నడిచాడు.

బ్రహ్మయ్య ముఖం మాడ్చుకుని కూర్చున్నాడు.

★ ★ ★

సత్యం గీతాంజలి కాన్వెంట్ స్కూల్‌కి వెళ్లేసరికి వర్షం మొదలైంది. ఆఫీస్ రూంలో మనోరమ ఒంటరిగా కూర్చుని రాసుకుంటోంది.

సత్యాన్ని చూసి "రండి. మీకోసమే ఎదురు చూస్తున్నాను" అన్నది నవ్వుతూ.

"మీరు ఇంత పెద్ద కాన్వెంట్ నడుపుతూ కూడా రచనలు చేయడం నిజంగా గ్రేట్ అండీ" అన్నాడు సత్యం.

"అంతగా పొగడకండి. ఇందులో గ్రేట్ ఏమీ లేదు. అభిరుచి అంతే. ఏదో రాయాలని తపన. రాయకుండా ఉండలేని బలహీనత. రచన పూర్తయితే అదొక రిలీఫ్. రొటీన్ వర్కు నుంచి ఇది రిలీఫ్‌గా కూడా ఉంటుంది. మీరు కూడా పగలు ఆఫీసు పని చూసుకుంటూ నాటకాలు వెయ్యడం లేదూ? "

"సరే! ఇప్పుడు అసలు విషయం చెప్పండి. కథ ఏమిటి? "

"నేను కథలు రాశానండీ. నాటకాలు రాయలేదు. ఇప్పుడు మీరు నాతో నాటకం రాయించాలి."

నేను రాయించడం ఏమిటండీ? మీరే రాస్తారు."

"ఔననుకోండి. కథను సీన్లుగా విభజించడం, పాత్రల రూపకల్పన, డైలాగ్స్ ఎలా వుండాలి వంటి విషయంలో నన్ను గైడ్ చెయ్యాలి" అన్నది మనోరమ.

"సరేనండీ. ముందు కథ చెప్పండి"

"ఇది నిజంగా జరిగిందండీ. 'ఔనండీ.. ఎక్కడో కాదు.. మన వూళ్ళోనే"

"అలాగా!"

"మధ్య తరగతి కుటుంబానికి అదృష్టం కలిసొచ్చింది. ధనవంతులై పోయారు. అప్పుడు కుటుంబంలోని వ్యక్తుల మనస్తత్వాలు ఎలా మారిపోయాయి? నైతిక విలువలు ఎలా పతన మ య్యాయి అనేదే

ఇందులో మనం చెప్పదల్చుకుంది"

"పొలంలో గ్రానైట్ రాయి పడితే నడమంత్రపు సిరివచ్చినట్లు" అన్నాడు సత్యం.

"మనోరమ ఆశ్చర్యంతో అతని ముఖం లోకి చూసింది.

"భలే క్యాచ్ చేశారే. టైటిల్ కూడా మీరే చెప్పేశారు. 'నడమంత్రపు సిరి' అని"

"నడమంత్రపు సిరి అనేది పాత టైటిల్. మన నాటకానికి 'రంగురాళ్ళు' అని పెడదాం. సరిగ్గా అతుకుతుంది. మనిషి మనసు గూడా ఎలా రంగు మారిందీ చూపిస్తాం. రంగు రాళ్ళవల్ల వీళ్ళు బాగు పడ్డారు. వీళ్ళ రంగు మారింది".

"మీ ఐడియా మార్వలెస్" మెచ్చుకుంది మనోరమ.

"సరే చెప్పండి"

"ఇంటి యజమాని కనకయ్య ఓ రైతు. అతని భార్య నాగమ్మ. వీరికి ఒక్కడే కొడుకు పోతురాజు. కూతురు పుష్పవల్లి. వీరి పొలంమెట్ట. వర్షాధారం పంటలు. బాగా పండితే మార్కెట్లో రేటు వుండదు. పంట సరిగా పండనప్పుడు మంచి రేటు పలుకుతుంది. వీళ్ళు మిర్చి వేసినప్పుడు పత్తికి గిరాకీ.. సరేనని పత్తివేస్తే మిర్చికి మంచిరేటు పలుకుతుంది. బ్యాంకులో అప్పులు, ఎరువుల కొట్లో అప్పులు, కూలీ లకు ఇవ్వలేక బాధ పడడం. అంతా గాజుల బేరం అంటారే అట్లా సాగుతూ వుంటుంది సంసారం. ఎట్లాగో కూతురు పుష్పవల్లి పెళ్ళి చేస్తారు.

ఇప్పుడు పొలంలో గ్రానైట్ పడింది. కోటీశ్వరుడయ్యాడు కనకయ్య. నాగమ్మ నాయకురాలైంది. ఇంట్లో చక్రం తిప్పసా గింది. కొడుకుతో పెట్రోలు బంక్ పెట్టిం చింది. మూడంతస్తుల మేడ కట్టించింది. కారులో దర్జాగా తిరగసాగింది. పోతురా జుకి పిల్లనివ్వడానికి పోటీలు పడ్డారు ఆడ పిల్లల తండ్రులు. తమకి కట్నం ముఖ్య కాదనీ, అమ్మాయి అందంగా వుండాలన్నది నాగమ్మ. గుంటూరు నుండి ఒక సంబంధం వచ్చింది. అమ్మాయి అందంగా వుంది. పేరు భవాని. బి.ఎ., బి.ఇడి చది వింది. అక్కడ ఒక స్కూల్లో టీచర్‌గా పని చేస్తోంది. భవానీ నాగమ్మకు నచ్చింది. వాళ్ళు లేనివాళ్ళయినా అందగత్తె అని భవానీని కోడలు చేసుకుంది.

ఇక సమస్య ఇప్పుడు మొదలైంది. పోతురాజు నపుంసకుడు. భవానీకి పిల్లలు కలిగే యోగం లేదు. ఈ సంగతి నెమ్మ దిగా అత్తకి చెప్పుకుంది భవాని. నాగమ్మకి దిగులు మొదలైంది. వారసులు లేకపోతే ఇన్ని కోట్ల ఆస్తికి సార్థకత ఏముంది? అదీగాక పిల్లలు పుట్టకపోతే కోడలు ఎంత కాలం ఈ ఇంట్లో వుంటుంది? అని తీవ్రా లోచనలో మునిగిపోయింది.

నాగమ్మ ఇలా దిగులుపడుతూ వుండగా మరిది కొడుకు అనంత్ వచ్చి "పెద్దమ్మా! ఇక్కడ నాకేదైనా పని చూపించు" అని వచ్చాడు.

నాగమ్మ మెదడులోకి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. అనంత్‌ని ఇంట్లోనే అట్టిపెట్టుకుంది. పెట్రోల్ బంకులో పని చూసుకోమన్నది. అనంత్ ఇంట్లో కలిసిపో యాడు. భవానీకి నిజాయితీగా తన మన సులో మాట వెల్లడించింది. అనంత్‌ని దారికి తెచ్చుకో. పిల్లల్ని కను. ఇంటిగుట్టు కాపాడు. వంశాన్ని నిలబెట్టు. భవానీకి గూడా ఈ ఏర్పాటు అంగీకారమైంది. అంతకంటే ఆమెకు దారిలేదు. పోతురా జుకి విడాకులిచ్చి తను ఒంటరిగా జీవించ లేదు. పుట్టింట్లో తనకు ఆదరణ లేదు.

భవానీకి మగపిల్లవాడు పుట్టాడు. నాగమ్మ సంతోషానికి అంతులేదు. వార సుడు పుట్టాడని కనకయ్య గూడా ఆనం దించాడు. పోతురాజు తాగుడు అలవాటు

చేసుకుని తనలోకంలో తను వున్నాడు.

ఐతే భవానీకి ఇప్పుడు అనంత్ తోడున్నాడు. అనంత్‌తో జీవితాంతం అలా వుండడం సాధ్యంకాదని భవానీ గ్రహించింది. అనంత్ పెళ్లి చేసుకుని వెళ్లిపోతాడు. అప్పుడు తన గతేంటి అని ఆలోచించింది. పోతురాజుని వదిలించుకుంటాను, అనంత్‌ని పెళ్లి చేసుకుంటాను అని ప్రపోజ్ చేసింది. అనంత్ ఒప్పుకున్నాడు.

ఒక రోజు గుంటూరు పుట్టింటికి వెళ్తానని కొడుకుని తీసుకుని వెళ్లింది భవాని. ఆ తర్వాత అనంత్ వెళ్లాడు. ఇక భవాని పోతురాజుకి విడాకుల నోటీసు పంపించింది. నాగమ్మ లబోదిబోమన్నది. అనంత్ మీద పోలీస్ కేసు పెట్టింది. డబ్బు ఆశ చూపించింది. ఎన్ని చేసినా అనంత్ లొంగలేదు.

భవానీ జీవితంతో ఆడుకున్న నాగమ్మ కుట్ర బైట పడింది.

మనోరమ చెప్పడం ముగించింది.

సత్యం ఆమెవైపు చూసి నవ్వాడు.

“ఎలా వుంటుంది ఈ కథ? ” అడిగింది మనోరమ.

“రివల్యూషనరీ సబ్జెక్ట్” అన్నాడు.

“ఎప్పుడూ సమాజానికి పనికిరాని రాజకీయాలు, కులాలు పోవాలి, మతాలు పోవాలనే కథలేనా? స్త్రీల సమస్యలు గూడా తీసుకోవచ్చుగా? వెరైటీగా వుంటుంది. ఇటువంటి అత్తలు గూడా వుంటారా? అని జనం ఆలోచిస్తారు” అన్నది.

“నిజమే! నపుంసకులైన కొడుకుల బలహీనత దాచిపెట్టి పెళ్ళిళ్ళు చేసి లేనిపోని సమస్యలు సృష్టించే అత్తలకు గుణపాఠంగా వుంటుంది” అన్నాడు సత్యం.

★ ★ ★

చంద్రకళ అక్క, తమ్ముడు వచ్చి గొడవ చేసిపోయారు. తమ అవసరాలకి డబ్బు ఇవ్వడం లేదని వాళ్ళకి బాధగా ఉంది. పైగా చెన్నకేశవులు ఆమెకు అండగా వున్నాడు. ఏం చెయ్యడానికి వీల్లేకుండా వుంది. వీధిలో గొడవ చేస్తే.. పరువు పోతుందని చంద్రకళ భయపడి డబ్బు ఇస్తుందనుకున్నారు. అలా జరగలేదు.

"ఒంటరి ఆడదాని దగ్గర డబ్బు గుంజ టానికి వచ్చారా" అని ఆ వీధిలో చాలా మంది వాళ్ళని తిట్టారు.

చెన్నకేశవులు తమకి ఏ కష్టం వచ్చినా ఆదుకుంటున్నాడని అందరికీ అతనంటే ఇష్టంగా ఉంది. వ్యతిరేకించేవాళ్ళు, ఈర్ష్య పడే వాళ్ళు ఎవరూలేరు.

"డబ్బంతా చెన్నకేశవులుకి దోచి పెడుతున్నదనీ, వాడు దీనికి మందు పెట్టాడనీ, అందుకే ఇంట్లో పెట్టుకుందనీ" కేకలు పెట్టారు ఆమె పరువు తియ్యడానికి.

"చెన్నకేశవులు ఆమె ఇంట్లో అద్దెకుంటున్నాడు. ఆమె అవసరాలు చూస్తున్నాడు. పెద్ద దిక్కుగా వుంటున్నాడు. అతన్నేమైనా అంటే నాశనమైపోతారు" అని ఆ వీధిలో కొందరు ఆడవాళ్ళు అతన్ని వెనకేసుకొచ్చారు.

చంద్రకళ అక్క, తమ్ముడు తమ ఆటలు సాగవని తిట్టుకుని వెళ్ళిపోయారు.

"డబ్బు లేకపోతే సహాయం చెయ్యడానికి ఎవరూ ముందుకురారు. డబ్బుంటే పీక్కు తింటారు" అని చంద్రకళ అక్కని, తమ్ముణ్ణి జనాలు తిట్టిపోశారు.

ఆరోజు శనివారం. చెన్నకేశవులు ఇంటికొచ్చేసరికి ఎనిమిదిన్నరైంది. తెల్లవారితే ఆదివారం. ఉదయం స్కూలు వుండదని పిల్లలు టీవీలో కార్టూన్లు చూస్తున్నారు.

"ఇక వెళ్ళిపడుకోండి" అని రెండు, మూడుసార్లు చెప్పింది. వాళ్ళువినడం లేదు.

చంద్రకళ అదోలావుంది. అసహనంగా ఉంది. ఎప్పుడూ చిరునవ్వుతో అదీ ఇదీ మాట్లాడుతూ వుండేది. ఇప్పుడు మౌనంగా ఉంది.

బాత్‌రూమ్‌లో వేడినీళ్లు పెట్టి వచ్చింది. అతను చూస్తూనే వున్నాడు. వెళ్ళి స్నానం చేసివచ్చాడు.

పిల్లలు ఇంకా టీవీ చూస్తూనే వున్నారు.

"పడుకోమంటే వినరేరా? " అని ఇద్దర్నీ కొట్టింది.

వాళ్లు ఏడుస్తూ చెన్నకేశవులు వైపు చూశారు.

"ఎందుకు అనవసరంగా వాళ్ళని కొడతావు? రేపు ఆదివారమే కదా? " అన్నాడు.

"అందుకే ఇప్పటిదాకా చూడనిచ్చాను. తొమ్మిది కావస్తోంది. ఇంకెప్పుడు నిద్రపోయేది? ఇదే అలవాటైపోతుంది. పొద్దున్నే లేచి చావరు" అన్నది సీరియస్‌గా.

అతను వాళ్ళిద్దరినీ బుజ్జగించి పడుకోబెట్టి వచ్చాడు. డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు.

ఆమె ప్లేటులో ఉప్మా పెట్టుకుని వచ్చింది. అది చూసి అతను ముఖం చిట్లించాడు. అతను రాత్రిళ్లు అన్నం తినడం మానేశాడు. ఒళ్ళొస్తుందని పుల్కాలు చేయించుకుని తింటున్నాడు. శనివారం చంద్రకళ గూడా టిఫిన్ తింటుంది. ఆ రోజు పెసరట్లు వేస్తుంది. ఇద్దరూ తింటారు. అతనికి వేడి వేడి పెసరట్లు, అల్లం ముక్కలు, జిలకర చల్లిన వంటే బాగా ఇష్టం. పెసరట్లు బదులు తనకి అసలు సహించని ఉప్మా చూసేసరికి మండింది. తనకు అయిష్టమని తెలిసి ఉప్మా చెయ్యడం ఏమిటని అనుకున్నాడు.

"ఇదేమిటి? " అన్నాడు.

"ఉప్మా"

"అది నేను తినననని తెలుసా గదా? "

"ఏం చేసేది? పెసలు అయిపోయాయి" అన్నది.

"పోనీ పుల్కాలైనా చేసి వుండాల్సింది" అన్నాడు.

"గోధుమ పిండి గూడా లేదు" అన్నది.

చెన్నకేశవులుకి కోపం వచ్చింది.

"నాకు ఫోన్ చేసి చెప్తే, వచ్చేటప్పుడు తెచ్చేవాడినే గదా? " అన్నాడు.

"మీరెప్పుడు వస్తారో? మీకెన్ని పన్లు? చెప్పినా గుర్తుంటుందని ఏవుంది? " అన్నది.

చెన్నకేశవులు డైనింగ్ టేబుల్ ముందు నుంచి లేచి డ్రెస్ చేసుకుని వెళ్ళిపోయాడు. ఆమె ఏమీ మాట్లాడలేదు.

అతను సరాసరి బార్ కెళ్లి కూర్చున్నాడు. మేనేజర్ వచ్చి నమస్కారం పెట్టాడు. స్టీవార్డ్‌కి ఏదో చెప్పాడు. అతను వచ్చి ఆర్డర్ తీసుకుని వెళ్ళాడు.

చెన్నకేశవులుకి బాగా ఆకలిగా ఉంది. చంద్రకళ అలా వుండడం చిరాకు కలిగిస్తోంది. నిన్న ఆమె అక్క, తమ్ముడు వచ్చి తిట్టిపోయిన దగ్గర్నుంచి ముభావంగా వుంటోంది.

అతను తాగుతూ, తింటూ కూర్చున్నాడు. కాసేపటికి మత్తు ఆవరించింది. మనసు ప్రశాంతంగా ఉంది. చంద్రకళ గురించి ఆలోచనలు వచ్చాయి. ఆమె పరిస్థితిలో ఎవరున్నా బాధపడతారు. స్వంత అక్క, తమ్ముడు వీధిలో పడి తిడితే ఎలా వుంటుంది? ఆమె దగ్గర డబ్బు చేరడం అసలు కారణం. ఆమె ఇవ్వడం మొదలు పెడితే దానికి అంతుండదు. ఆ విషయంలో గట్టిగానే వుంటోంది.

కాని తనతో అలా ఎందుకు ప్రవర్తిస్తోంది? తన మీద కోపంవల్ల పిల్లల్ని కొట్టిందా? తనకు ఇష్టం లేని ఉప్మా ఎందుకు చేసింది?

తనను ఇంట్లో నుంచి వెళ్ళిపొమ్మని చెప్పలేక అలా ప్రవర్తిస్తోందా? తను కావాలని ఆమె ఇంట్లో చేరలేదు కదా? ఆమె కష్టాల్లో తోడుగా వుండమని బ్రతిమాలితే వున్నాడు. ఎవరేమనుకుంటారో అని ఆలోచించలేదు. ఆమెగూడా తన పాలిటదేవుడివని పొగుడుతుంది. ఇప్పుడు ఆమె కష్టాలు తీరినట్లేనా? ఇక తన అవసరం ఆమెకు లేదా?

పాలిషింగ్ యూనిట్ బాగా నడుస్తోంది. ఒకటికి రెండు నడుస్తున్నాయి. లాభాలు బాగానే వస్తున్నాయి. ఆమె నడపలేకపోతే ఎవర్నికైనా అద్దెకు ఇచ్చినా తీసుకుంటారు.

ప్రస్తుతం ఆమె అద్దె ఇంట్లో వుంటోంది. ఏదైనా ఒక ఇల్లు స్వంతది ఏర్పాటు చేస్తే ఆమెకు స్థిరత్వం వస్తుంది. చూస్తుండగానే పిల్లలు పెద్దవాళ్లయిపోతారు. ఆమెకు అంది వస్తారు. ఇంకేం దిగులు లేదు.

హౌసింగ్ బోర్డులో ఇళ్ళు అమ్మకానికి వస్తుంటాయి. అక్కడ ప్రశాంతంగా వుంటుంది. అన్ని సౌకర్యాలు వుంటాయి. ఏదైనా అమ్మకానికి వుంటే చెప్పమని ఇళ్ళ బ్రోకర్‌కి చెప్పాలి అనుకున్నాడు.

అతను వాచీలో టైమ్ చూశాడు పది కావస్తోంది. స్టీవార్డ్‌ని పిలిచి బిల్లు తీసుకురా అన్నాడు.

"మీకు బిల్లు ఇవ్వొద్దని సార్ చెప్పారు" అన్నాడు.

"అదేం? "

అతను నవ్వి వూరుకున్నాడు.

చెన్నకేశవులు లేచి కౌంటర్ దగ్గరకు వెళ్ళి "ఏమిటి నావద్ద డబ్బు తీసుకోరా? " అన్నాడు.

"మీరు ఎప్పుడోగాని రారు సార్! రాక రాక వచ్చారు. మీ దగ్గర డబ్బు తీసుకుంటామా? " అన్నాడు.

"రాక రాక వచ్చానని డబ్బు తీసుకోరా! రోజూ వస్తే? "

"రండి సార్! మోస్ట్ వెల్‌కమ్" అన్నాడు. చెన్నకేశవులు బైటకు నడిచాడు. బైక్ ఎక్కి బయల్దేరాడు. రోడ్లమీద రష్ తగ్గింది.

ఒకప్పుడు తను ఈ వూరు నుంచి కట్టు బట్టలతో పారిపోయాడు. ఇప్పుడు తను ఇక్కడ పాపులర్ పర్సన్, వి.ఐ.పి.

నవ్వుకున్నాడు. ఇంటికి వెళ్లేసరికి గేటు మూసివుంది. హారన్ కొట్టాడు. రెండు మూడు సార్లు హారన్ కొట్టాక ముందు వరండాలో లైటు వెలిగింది. తలుపు తీసుకుని వచ్చింది చంద్రకళ. గేటుకున్న తాళం తీసి గేటు తెరిచింది. అతను లోపలకు వచ్చాక మళ్ళీ తాళం వేసింది. బైక్ షెడ్‌లో పెట్టి వచ్చాడు.

"గేటు తాళం వేశావేం? " అడిగాడు.

"మీరు రారనుకున్నాను" నేల చూపులు చూస్తూ అన్నది చంద్రకళ

"రాననుకున్నావా? "

"ఔను"

"ఎక్కడుంటాననుకున్నావ్? "

"ఏమో!" అని గబగబా లోపలకు వెళ్ళిపోయింది.

అతను తన రూమ్‌లోకి వెళ్ళి పడుకున్నాడు.

## 6

చెన్నకేశవులు ఆఫీసులో కూర్చున్నాడు.

"నమస్తే సార్!" అని వచ్చాడు రామకృష్ణ.

"రా... వచ్చికూర్చో!" అన్నాడు చెన్న కేశవులు.

"హౌసింగ్ బోర్డ్‌లో ఇల్లు కావాలన్నారుగా? "

"ఔను"

"ఒక యం.ఐ.జి. ఇల్లుంది. లక్కీ నెంబర్ తొంభై తొమ్మిది"

"నెంబర్ సరేలే! ఇల్లు ఎలా వుంది? ఎన్ని గజాలు? ఎంత చెప్తున్నాడు? అది చెప్పు? " అన్నాడు చెన్న కేశవులు.

"మూడు వందల గజాలు. మూడు బెడ్ రూమ్‌లు. తూర్పు ఫేస్. చుట్టూ కాంపౌండ్ కట్టి వుంది. కారు షెడ్ గూడా వుంది. పైన వాటర్ ట్యాంక్, ప్రతి రూమ్ లోకి పైప్‌లైన్ వేయించారు. నీళ్ళు బాగా వస్తాయి"

"ఎంత చెప్తున్నాడు? "

"పదిహేను లక్షలు"

"అంతలేదు లేవయ్యా! పన్నెండుకి ఈ మధ్యనే మా ఫ్రెండ్ కొన్నాడు" అన్నాడు చెన్నకేశవులు నవ్వుతూ.

"ఒక్కో ఏరియాని బట్టి వుంటుంది. ఇది రెండో లైన్‌లో వుంది. బస్టాండ్, షాపింగ్ కాంప్లెక్స్ అంతా దగ్గర్లోనే వున్నాయి. అదీ గాక లక్కీ నెంబర్ తొంభై తొమ్మిది"

"నెంబర్ ఏదైతేనేం? నెంబర్ని బట్టి డబ్బులొచ్చి పడతాయా? మనం చేసే దాన్ని బట్టి వస్తుంది గాని"

"అమ్మమ్మ.. అంతమాటనకండి. ఆ నెంబర్ కారుకి కావాలనుకోండి. లక్షలు ఇచ్చికొంటారు"

"కొంటార్లేవయ్యా నమ్మకం వున్నవాళ్ళు. నాకు అలాంటి నమ్మకాలు లేవు. మరి ఆ ఇంటి ఓనర్ ఎందుకు అమ్ముతున్నాడు? " అడిగాడు చెన్నకేశవులు.

"ఆయన పేరు శరణప్ప. ఎలక్ట్రికల్ డిపార్టుమెంట్‌లో ఇంజనీరు. రిటైరైపోయాడు. పిల్లలు బెంగుళూరులో సెటిలయ్యారట. అందుకని అమ్ముకుని వెళ్ళిపోతున్నాడు"

"ఇప్పుడు వున్నాడా? "

"లేదు. తాళం వేసే వుంది. ఖాళీ చేసి పోయాడు. ఏదైనా పార్టీ వుంటే చూసి పెట్టమని కీస్ నాకిచ్చిపోయాడు"

"ఇప్పుడు చూద్దామా? "

"పదండి" అన్నాడు రామకృష్ణ

రామకృష్ణ స్కూటర్ మీద వెళ్తుంటే, చెన్నకేశవులు అనుసరించాడు.

హౌసింగ్ బోర్డులో యం.ఐ.జి. తొంభై తొమ్మిది నెంబర్ ఇంటి ముందు ఆగారు. రామకృష్ణ తాళం తీశాడు. ఇల్లంతా చూపించాడు. బాగానే వుంది. చెన్నకేశవులికి నచ్చింది. తిరిగి ఆఫీసుకి వచ్చారు.

"సరే. కీస్ నాకిచ్చి వెళ్ళు. ఆడవాళ్ళు కూడా చూడాలి కదా!" అన్నాడు చెన్నకేశవులు.

"మీ దగ్గరే వుంచండి. బహుశా శరణప్పగారు రేపు ఫోన్ చేస్తారు. రేపు మాట్లాడుకుందాం" అని తాళం చెవి చెన్నకేశవులికి ఇచ్చి వెళ్ళాడు రామకృష్ణ.

"మధ్యాహ్నం లంచ్‌కి ఇంటికి వెళ్ళాడు. చంద్రకళ భోజనం వడ్డించింది.

"తొందరగా తయారవ్వు" అన్నాడు.

"ఎందుకు? " అడిగింది చంద్రకళ

"హౌసింగ్ బోర్డులో ఇల్లుంది. చూద్దువు గాని"

"ఇది బాగానే వుందిగా? "

"ఇది అద్దె ఇల్లేగా! సంవత్సరానికొకసారి అద్దె పెంచుకుంటూ పోతాడు ఓనర్. ఎన్నాళ్ళు అద్దె ఇంట్లో వుంటావు? ఇప్పుడే స్వంత ఇల్లు కొనుక్కుంటే మంచిది. రోజు రోజుకూ భూమి ధర పెరుగుతూ వుంటుంది. ముమ్ముందు పిల్లలు పెద్ద చదువులకెళ్తే బాగా ఖర్చువుంటుంది" అన్నాడు.

చంద్రకళ ఏం మాట్లాడలేదు. లోపలకు వెళ్ళి చీర మార్చుకుని వచ్చింది. ఆమెను బైక్ మీద ఎక్కించుకుని హౌసింగ్ బోర్డుకి తీసుకెళ్ళాడు. తాళం తీసి ఇల్లంతా చూపించాడు.

"నీకు నచ్చిందా? " అడిగాడు.

ఆమె తల వూపింది.

"పదిహేను లక్షలు చెప్తున్నాడు. బేరం ఆడుతున్నాలే. తగ్గుతాడు" అన్నాడు.

"మీ ఇష్టం" అన్నది.

"నా ఇష్టం ఏంది? డబ్బునీది. నీకు నచ్చితేనే కొనుక్కో" సీరియస్‌గా అన్నాడు.

"ఇప్పుడు నేనేమన్నానని కోప్పడుతున్నారు" అని కళ్ళనీళ్ళు పెట్టుకుంది చంద్రకళ.

"కోప్పడ్డానా? బాగానేవుంది. ఇప్పుడు నువ్వెందుకు ఏడుస్తున్నావు? నాకేం అర్థం కావడం లేదు" కోపంగా అన్నాడు.

"ఎందుకేడుస్తున్నానంటే ఏడుపొచ్చి ఏడుస్తున్నాను. ఏం ఏడవగూడదా? ఏడవడం గూడా తప్పేనా? " అన్నది కళ్ళుతుడుచుకుంటూ.

"ఎందుకొస్తుంది ఏడుపు? ఏదైనా కారణం వుండాలి కదా? నేను చూస్తూనే వున్నాను. మీ అక్క, తమ్ముడూ గొడవ చేసి వెళ్ళిందగ్గర్నుంచి బిగుసుకుపోయావు."

"వాళ్ళొచ్చి కొత్తగా గొడవ చేసిందేవుంది? అంతకు ముందు మా బావ రాలేదా? తాగి గొడవ చెయ్యలేదా? మీరు తన్ని బైటకు గెంటెయ్యలేదా? దానికంటే ఇది పెద్ద గొడవేం కాదు"

"మరి"

చంద్రకళ సీరియస్‌గా చూసి తలవంచుకుంది. ఏదో అనబోయి వూరుకుంది.

★ ★ ★

సత్యం ఆఫీసులో కూర్చుని అప్పుడే వచ్చిన వీక్లీ తిరగేస్తున్నాడు. ఒక పేజీలో మనోరమ ఫొటో చూసి ఆశ్చర్యపోయాడు. ఉత్సాహంగా చదివాడు. ఉగాది కథల పోటీలో మనోరమ రాసిన 'రంగురాళ్ళు' అనే కథకు మొదటి బహుమతి పదివేల రూపాయలు వచ్చినట్లుగా వుంది. ఆమె గురించిన వివరాలు ప్రచురించారు.

సత్యం ఆమె ఫొటో వంకే చూస్తుండిపో

# సాహస క్రీడల కాణాచి




న్యూజిలాండ్‌లోని క్వీన్స్‌టౌన్ ప్రపంచంలోని సాహస క్రీడలు ఆడేవారికి రాజధాని. ఏటా వేలమంది అక్కడికి వచ్చి, అనేక సాహసక్రీడలలో పాల్గొంటారు. ఏడాదికి వారినుంచి ఆదాయంగా 36 కోట్ల విలువ గల అమెరికన్ డాలర్స్ అందుతున్నాయి.

క్వీన్స్ టౌన్ ఇలాంటి సాహసికులతోనే స్థాపించబడింది. 1860లో విలియం గిల్బర్ట్ రీడ్స్ అనే ఓ గొర్రెల కాపరి తొలిసారిగా ఇక్కడికి వచ్చి సెటిలయ్యాడు. రెండేళ్ళ తర్వాత సమీపంలోని ఓ నది పక్కన బంగారపు గనిని కనుగొన్నాడు. త్వరలోనే ఈ సంగతి అందరికీ తెలిసి, చాలా పాశ్చాత్యా దేశాలనించి బంగారపు వేటలో అనేకమంది సాహసికులు వచ్చారు. నేడు దాని జనసంఖ్య 17 వేలు. కాని ఏటా వచ్చి వెళ్ళే సందర్శకుల సంఖ్య 12 లక్షలు!



1947లో మొదటిసారిగా విమానంనించి పారాచూట్‌తో దూకే సాహసక్రీడ ఇక్కడే మొదలైంది. 1960లో జెట్ బోటింగ్ అనే సాహసక్రీడ ఇక్కడ ఆరంభమైంది. జెట్ బోటింగ్ అంటే గంటకి 85 కిలో మీటర్ల వేగంతో బోటులో ప్రయాణించడం. ఆ తర్వాత వాటర్ రాఫ్టింగ్. రబ్బర్ పడవలో వేగంగా ప్రవహించే నదిలో వెళ్ళడం కూడా ప్రారంభమైంది. 1980లలో అవెన్ జాన్ హాకెజ్, హెన్రీవేన్ అనే ఇద్దరు బంగీజంప్ క్రీడని ఇక్కడ ప్రవేశపెట్టారు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ డేంజరస్ స్పోర్ట్స్ క్లబ్ సంస్థ తీసిన ఓ వీడియో చూసి ఈ ఆటని ఇక్కడ పరిచయం చేసారు.

ఆక్లాండ్ యూనివర్సిటీ శాస్త్రజ్ఞులు అభివృద్ధి చేసిన తెగిపోని తాడుని కాలికి కట్టుకుని ఎత్తు నించి దూకడమే బంగీజంప్. 1987లో హెకెట్ ఈఫిల్ టవర్‌నించి బంగీజంప్ చేసాక ఈ క్రీడ ఊపందుకుంది. 2002 దాకా 5 లక్షల మంది ఇక్కడి నాలుగు బంగీ జంప్ ప్రదేశాలని ఉపయోగించుకుని జంప్ చేసారు.

విమానంలోంచి కిందకి దూకడం కూడా ఇక్కడ ఇంకా సాహస క్రీడగా కొనసాగుతూనేవుంది. మరో సాహస క్రీడ ఫ్లై- బై- వైర్‌ను నీల్ అనే సాహసికుడు కనుగొన్నాడు. వైర్‌కి అనుసంధానం చేసిన రాకెట్ వేగంతో వెళ్ళే వాహనంలో కూర్చుని ప్రయాణించడం గొప్ప సాహసమే. అయితే ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా అరుదుగా ప్రమాదాలు కూడా జరుగుతూంటాయి. 1999లో ఓ జపానీస్ వ్యక్తి జెట్ బోట్ ప్రయాణంలో మరణించాడు. యాంత్రిక లోపంవల్ల 2003లో ఓ గ్రీక్ యాత్రికురాలు హేంగ్ గ్లైడింగ్ సాహసక్రీడలో మరణించింది. బంగీజంపింగ్‌లో గాయాలవడం కూడా సాధారణమే. తల నీటిని తాకేటప్పుడు తలని రక్షించుకోకపోవడం వల్ల ఈ గాయాలవుతుంటాయి.

క్వీన్స్ టౌన్ ఇప్పుడు సాహసక్రీడలతో బంగారాన్ని పండించుకుంటోంది.

యాడు. మనోరమని చూస్తుంటే చరిత్ర లోని ఏ రాజకుమారినో చూస్తున్నట్లు అనుభూతి కలుగుతుంది. గంభీరమైన కోలముఖం. పొడుగు ముక్కు. నల్లగా మెరుస్తున్న కళ్ళు. తెల్లటి చీరలో అద్భుతంగా వుంటుంది. చూసిన కొద్దీ చూడాలనిపిస్తుంది. కాని ఆమె ఏమనుకుంటుందో? సభ్యత కాదని చూసీ చూడనట్లుగా చూస్తుంటాడు.

ఆమె పుట్టిన తేదీ చూసి అదిరిపడ్డాడు. 'ఆమెకు అంత వయసున్నదా?' అని ఆశ్చర్యపోయాడు. మనోరమ సత్యానికన్నా ఏడేళ్లు పెద్దది. అంత వయసున్న దానిలా కనిపించదు. ఆమె ఒంటరిగా జీవిస్తున్నదని అతనికి తెలుసు. వివరాలు తెలియవు. ఆమెకు పెళ్ళయిందా? విడాకులు తీసుకున్నదా లేక విధవనా? ఏమో తెలియదు. ఎందుకు ఒంటరిగా వుంటున్నది? కారణం ఏమిటి? ఆమె తన సమయమంతా కాన్వెంట్ స్కూలుకే అంకితం చేసింది.

★ ★ ★

హౌసింగ్ బోర్డులో యం.ఐ.జి. తొంభై తొమ్మిది ఇంటి ఓనర్ శరణప్ప మునికొండకు వచ్చాడు బెంగుళూరు నుంచి. తనకు రావాల్సిన డబ్బు తీసుకుని ఇంటిని చంద్రకళ పేరుతో రిజిస్ట్రేషన్ చేశాడు.

ఆమె ఇంటిలోని మొజాయిక్ ఫ్లోరింగ్ అంతా పగలకొట్టించి తెల్లటి మార్బుల్ స్టోన్ పరిపించింది. తనకు నచ్చిన రంగులతో గోడలకు పెయింట్ వేయించింది. పాత సింకులు పగలగొట్టించి రంగురంగుల సింకులు పెట్టించింది. బాత్ రూమ్స్ రీమోడల్ చేయించింది. డెకరేషన్ లైట్లు పెట్టించిన తర్వాత తృప్తి పడింది. ఇప్పుడు ఆ లైనులో చంద్రకళ ఇల్లు సరికొత్త దానిలా డాబుగా కనిపిస్తోంది. ఆమెకు కావాల్సింది గూడా అదే.

ఇల్లు కొన్నదానికి అదనంగా రెండు లక్షలు ఖర్చయింది. చెన్నకేశవులు ఆమె చెప్పిన పనులన్నీ కాదనకుండా చేయించాడు. పనులన్నీ పూర్తయిన తర్వాత ఆమెకు బిల్లులతో సహా లెక్కరాసి చూపించాడు.

"ఇవన్నీ నేను చూడడం అవసరమా?" అని అడిగింది చంద్రకళ.

"అవసరమే! డబ్బు నీది కదా!" అన్నాడు.

"నీ డబ్బు, నీ డబ్బు అని మాటమాటకీ ఎందుకు అంటారు?"

"మాట మాటకి ఎందుకంటాను? అవసరమున్నప్పుడే కదా అంటున్నాను. లెక్కలు చెప్పాల్సిన బాధ్యత నాకుంది. తర్వాత మాట రాకూడదు"

"నేను లెక్కలు అడగడంలేదు"

"నువ్వు అడక్కపోయినా నేను చెప్పాలి గదా?"

"సరేనండీ! మీతో వాదించలేను. నన్ను పరాయిదానిలా చూస్తున్నారు. స్వంతమనిషి అనే ఆలోచనే లేదు మీకు?" ముఖం చిట్లించి అన్నది.

చెన్నకేశవులుకి నవ్వొచ్చింది. ఆమె మనసేమిటో అతనికి అర్థంకావడంలేదు. చాలా కాలం క్రితం తను స్వంతంత్రంగా వుండడంలేదని బాధపడింది. తను అలిగింది కూడా!

ఒక రోజున "ఏమండీ! మీరు నన్ను స్వంత మనిషిలా అనుకోండి. ఏం కావాలన్నా అడగండి. మొహమాటపడకండి" అన్నది.

"సరే!" అన్నాడు.

"అలా అంటే కాదు. నాకు నమ్మకం కలిగేట్టు చేయండి" అన్నది.

"నీకు నమ్మకం కలగాలంటే నేనేం చేయాలి?" అని అడిగాడు.

ఆమె కుంకుమ భరిణ అతని చేతికి

ఇచ్చింది.

"మీరు నాకు బొట్టుపెట్టండి. నాకు నమ్మకం కలుగుతుంది" అన్నది.

ఆమె దోసగింజంత తిలకం బొట్టు పెట్టుకుంటుంది.

"నువ్వు రోజూ బొట్టు పెట్టుకుంటున్నావుగా? నేను పెట్టడం ఏమిటి? బొట్టు పెట్టడం అంటే ఒట్టేయడం లాంటిదా?" అని అడిగాడు.

"ఔను. అలాంటిదే!" అని నవ్వింది.

అతను కుంకుమ బొట్టు పెట్టాడు. ఆమె ఆనందించింది.

అదంతా ఇప్పుడు చెన్నకేశవులుకి గుర్తొచ్చింది. మళ్ళీ ఇప్పుడు ఈమెకు వచ్చిన డౌట్ ఏమిటి? ఎందుకు ముభావంగా ఉంటోంది? ఘర్షణ వైఖరితో ఎందుకుంటోంది? ఏమీ అర్థం కావడంలేదు.

చంద్రకళ స్వంత ఇంట్లోకి మారిన తర్వాత తను పాలిషింగ్ యూనిట్లోనే వుండడం, లేదా యూనియన్ ఆఫీసులో మకాం పెట్టడమో చేయాలి అనుకున్నాడు.

"గృహప్రవేశం చేసినప్పుడు మన వాళ్ళందర్నీ పిలిచి భోజనాలు పెట్టాలి కదండీ" అన్నది చంద్రకళ.

"నేను చెప్పేది కాస్త విను. నువ్వు డబ్బు విషయంలో చాలా జాగ్రత్తగా వుండాలి. ఉన్నది కదా అని ఖర్చు పెట్టుకుంటూ పోతే అవసరం వచ్చినప్పుడు అప్పులు చేయాల్సి ఉంటుంది" అన్నాడు.

"ఐతే వద్దంటారా?"

"నేనెందుకు వద్దంటాను? ఏదైనా పులిని చూసి నక్క వాత పెట్టుకున్నట్లు వుండకూడదు. ఎవరో వెయ్యిమందిని పిలిచి భోజనాలు పెట్టారని నువ్వుగూడా అలా చేస్తే లక్ష రూపాయలు వదుల్తాయి. పోనీ వచ్చి తిని పోయిన వాళ్లు నిన్ను మెచ్చుకుంటారా అంటే అదీ వుండదు. ఒకప్పుడు నువ్వెంత హీనంగా బతికావో చెప్పుకుని, ఇప్పుడేదో నడమంత్రపు సిరి వచ్చి బలిశావని అంటారు. అందుకని ఆర్భాటాలు వద్దు. నీ దగ్గర పనిచేసే వర్కర్లు, ఇరుగు పొరుగువాళ్ళని పిలిచి సింపుల్‌గా చేసుకుంటే బాగుంటుంది" అన్నాడు.

చంద్రకళకి అతని మాటలు నచ్చడం లేదు. ఆమె ఆలోచనలు వేరుగా ఉన్నాయి.

మనకు నచ్చకపోయినా, ఇష్టం లేకపోయినా కొన్ని పనులు చేయాల్సి వస్తుందని చంద్రకళకి అర్థమైంది. సింపుల్‌గా చేద్దాం అంటూనే మూడొందల మందికి కొత్త ఇంట్లో భోజనాలు పెట్టింది.

ఇక్కడ డిన్నర్ జరుగుతుంటే, అక్కడ లేబర్ కాలనీలో గుడిసెలు తగలబడ్డాయి. ఫైర్ ఇంజన్లు వచ్చి మంటలు ఆర్పేసరికే అంతా నాశనమైంది. చెన్నకేశవులు వెళ్ళేసరికే ఆడవాళ్ళు గుండెలు బాదుకుంటూ ఏడుస్తున్నారు. కాలగా మిగిలిన సామాన్లు మగవాళ్ళు పక్కగా పడేసుకుంటున్నారు. అగ్ని ప్రమాదం ఎలా జరిగిందనే దాని మీద రకరకాల కథనాలు చెప్తున్నారు. ఎలా జరిగితేనేం? ఒకప్పుడు గుడిసెలతో జన సమూహంతో సందడి సందడిగా వున్న ప్రదేశం ఇప్పుడు శ్మశానంలా మారిపోయింది.

చెన్నకేశవులు అప్పటికప్పుడు ఒక పక్కగా షామియానాలు వేయించి, కేటరింగ్ వాళ్ళని పిలిచి వంటలు వండించి ఆ రాత్రి ఎవరూ పస్తులుండకుండా భోజనాలు పెట్టించాడు.

తెల్లవారుజామున రెవిన్యూ సిబ్బందిని వెంటవేసుకుని కలెక్టర్ వచ్చాడు. మున్సిపాల్టీ వార్డు మెంబర్లు, ఛైర్మన్, ఎమ్మెల్యే శ్రీనివాసులు నాయుడు, అతని అనుచరులు, ప్రతిపక్షం వాళ్ళు వచ్చారు. మొసలి కన్నీరు కార్చి గుడిసెకు ఇంత ఇస్తాం అని ఓదార్చి వెళ్ళిపోయారు.

తర్వాత సరివి బాదులు, వాసాలు, తాటాకులు తెచ్చుకుని మళ్లీ గుడిసెలు వేసుకుంటున్నారు జనం.

అప్పుడు కొంతమంది చెన్నకేశవులు దగ్గరి కొచ్చారు.

"అయ్యా! మాకు ఈ గుడిసెల్లో బతుకు ఎన్నాళ్ళు? పక్కాఇళ్ళు కట్టుకోవడానికి తలా కాస్త స్థలం ఇప్పించయ్యా! మా తంటాలు మేము పడి ఇల్లు కట్టుకుంటాం" అన్నారు.

"అయ్యా! నువ్వు ఎందరికో సాయం చేస్తున్నావు. దిక్కులేనిదానిని చేరదీసి మంచి ఇల్లు ఇప్పించావు. మాకూ చిన్న ఇల్లు కట్టుకోవడానికి స్థలం ఇప్పించు" అన్నాడొక ముసలాయన.

చెన్నకేశవులుకి అతను అన్న మాటలు అర్థమయ్యాయి. చంద్రకళ గురించే అతను ప్రస్తావించాడు. పేరు మాత్రం అనలేదు. తను ఇప్పుడు యూనియన్ నాయకుడు. చంద్రకళకు మాత్రమే ఇల్లు ఇప్పించావు, మా సంగతి ఏమిటి? అని నిలదీసినట్లుగా ఫీలయ్యాడు. అతను అన్న దాంట్లో తప్పేముంది? ఆమెను నీ స్వంత మనిషిగా భావించి బాగోగులు చూస్తున్నారు. మా సంగతి ఏమిటి? ఎప్పటికీ గుడిసెల బతుకులేనా? అతను ఆలోచనలో పడిపోయాడు.

★ ★ ★

చింతలపూడి చెంచురామారెడ్డి గెస్ట్ హౌస్‌లో కూర్చుని చెన్నకేశవులు కోసం ఎదురు చూస్తున్నాడు.

అప్పుడు రాత్రి ఎనిమిది దాటింది.

బైక్ చప్పుడు విని గెస్ట్ హౌస్ వరండాలోకి వచ్చి చెన్నకేశవుల్ని చూసి "రండి.. మీ కోసమే ఎదురు చూస్తున్నాను" అన్నాడు.

"సారీ అండీ! కొంచెం ఆలస్యమైంది" అన్నాడు చెన్నకేశవులు నొచ్చుకుంటూ.

"డోంట్ వర్రీ! నేనే మీకు ఫోన్ చేద్దామనుకున్నాను. మీరే చేశారు" అన్నాడు చెంచు రామారెడ్డి లోపలకు దారి తీస్తూ.

అటెండర్ డ్రింక్ ఏర్పాట్లు చేసి, ఏసీ ఆన్‌చేసి వెళ్ళిపోయాడు.

"చెప్పండి సార్! మీ కేసు ఎంతవరకూ వచ్చింది? " అడిగాడు చెన్నకేశవులు.

"లారీ డ్రైవర్ని మనవైపుకు తిప్పుకుంటే కేసు గెలుస్తాం. వాడు బైటకు రాకుండా ఇన్‌స్పెక్టర్ పెద్దలెవల్లో ట్రై చేస్తున్నాడు. అప్పటికీ వాడిని ఇక్కడ్నుంచి ట్రాన్స్‌ఫర్ చేయించాలని ప్రయత్నం చేశాను. వాడికి ఎమ్మెల్యే స్ట్రాంగ్ సపోర్టు ఉంది. అదీగాక ఇన్‌స్పెక్టర్ మీద కోర్టు వేటు వేస్తే ఎమ్మెల్యేకి గూడా నష్టమే గదా! అందుకని వాడిని అక్కడ్నుంచి కదలకుండా చూస్తున్నారు. మంత్రి లెవల్ వరకూ భారీగా ముడుపులు అందజేస్తున్నారు. ఎలక్షన్స్ దగ్గరకొస్తున్నాయి. కాబట్టి అంతా ఫండ్స్ వసూలు చేసుకోవడంలో తీరిక లేకుండా వున్నారు."

"దేనికైనా పాపం పండాలి అంటారు కదండీ. ఏదో ఒకరోజు అటువంటిది జరుగుతుంది."

"ఏది ఏమైనా ఈసారి నేను ఎలక్షన్స్‌లో గట్టి పోటీ ఇవ్వదల్చుకున్నాను. మీ సహకారముంటే నాయుడ్ని ఓడించడం తేలికే" అని నవ్వాడు చెంచురామారెడ్డి.

"మీరు చూస్తున్నారుగా రెడ్డిగారూ? వున్నవాళ్ళ దగ్గరికే డబ్బు చేరిపోతోంది. ఒకప్పుడు లక్షాధికారి అంటే గొప్పగా వుండేది. ఇప్పుడు కోటి అంటే లెక్కలేదు. అంతా వందల కోట్లు సంపాదిస్తున్నారు. మేడలు కట్టుకుంటున్నారు. విమానాల్లో ప్రపంచమంతా టూర్లు చేస్తున్నారు. అవసరం వున్నా లేకపోయినా ఒక్కో ఇంట్లో నాలుగైదు కార్లు వుంటున్నాయి. పూర్వం రాజులు, జమీందార్లు గూడా ఇన్ని భోగాలు అనుభవించి వుండరు"

చెంచురామారెడ్డి నవ్వాడు. "ప్రపంచీకరణ వల్ల సంపద పెరుగుతోంది అనుకోండి. లేదా వాళ్ళ అదృష్టం అనుకోండి."

"ఆ విషయం ఒప్పుకుందాం. మరీ బీద వాడికి, ధనవంతుడికి ఇంత తేడా వుండ గూడదు. అందరి గురించి కాదుగాని కొందరు వేలకోట్లు పెట్టి ఇళ్ళు కట్టుకుంటున్నారు. మరొకవైపు జనం గుడిసెల్లో వుంటున్నారు. అది సమాజానికి మంచిది కాదు"

"అది నేనూ ఒప్పుకుంటాను. అందరికీ కూడు, గుడ్డ, గూడు వుండాలనేదే నా సిద్ధాంతం. అందుకు నేను సహకారం అందిస్తాను."

"నేను ఇప్పుడు కోరేది అదే. మీకు తెలుసు మునికొండ ఒకప్పుడు కుగ్రామం. ఇప్పుడు పట్టణమైంది. ఎక్కడెక్కడి నుంచో వర్కర్స్ వచ్చి పనులు చేస్తున్నారు. ఎందరో కూలీలు బతుకుతున్నారు. ఎవరికీ పక్కా ఇళ్ళు లేవు. మేము ఎలాగో గవర్నమెంటుతో పోట్లాడి భూమి తీసుకుంటాం. ఇళ్ళు కట్టుకోవడానికి మీ గ్రానైట్ వ్యాపారులు తోడ్పాటు ఇవ్వాలి. అప్పుడు వర్కర్స్ సపోర్టు మీకే వుంటుంది'' అన్నాడు చెన్నకేశవులు.

"అలాగే చేద్దాం. బీదవాళ్ళ గుడిసెలు తగలబడిపోయాయని తెలిసి నేనూ ఎంతో బాధపడ్డాను."

"అటువంటి ప్రమాదాలు ఎప్పుడూ జరుగుతూనే ఉన్నాయి. తుపాన్లు వచ్చినప్పుడూ అంతే. వారికి నీడ వుండడం లేదు. నేను అనుకోని పరిస్థితుల్లో యూనియన్ స్థాపించాల్సి వచ్చింది. ఇప్పుడు నా ధ్యేయం ఒక్కటే. అందరికీ ఇంటి స్థలం ఇప్పించడం. తర్వాత వారు ఇళ్ళు కట్టుకోవడానికి సహకరించడం. అది జరిగితే చాలు. నాకు ఇక ఏమీ అక్కర్లేదు" అన్నాడు చెన్నకేశవులు.

తర్వాత కొంచెంసేపు మాట్లాడుకున్నారు. అతను ఇంటికి బయల్దేరాడు. దూరంగా ఎవరో ఇద్దరు సరివి బాదు రోడ్డుకి అడ్డంగా పట్టుకుని నిల్చున్నారు. చెన్నకేశవులు సడన్ బ్రేక్ వేశాడు. అంతలో తలమీద కర్రతో దెబ్బ! అతను బైక్‌తో పాటు రోడ్డుమీద పడిపోయాడు. ఆ తర్వాత వాళ్లు పారిపోయారు.

అప్పుడు రాత్రి పదయింది.

రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. చెన్నకేశవులు నెత్తురు మడుగులో స్పృహ తప్పి రోడ్డు మీద పడిపోయి వున్నాడు.

అతని అదృష్టం. అప్పుడే అటుగా అంబులెన్స్ వచ్చింది. అందులో ఉన్న హాస్పటల్ సిబ్బంది చెన్నకేశవుల్ని అంబులెన్స్‌లో ఎక్కించి తీసుకెళ్ళారు. అతన్ని ఎమర్జెన్సీ వార్డులో చేర్పించారు. అతనికి ట్రీట్‌మెంట్ మొదలైంది. ప్రాణాపాయం తప్పింది.

ఆ రోజు లేటుగా వస్తానని చంద్రకళకు చెప్పే వెళ్లాడు చెన్నకేశవులు. ఆమె గేటుకి తాళం వేయకుండా ఉంచింది. తను భోజనం చేసి పిల్లల దగ్గర పడుకుని నిద్రపోయింది. అతను లేటుగా వస్తానంటే ఎక్కడో భోజనం చేసి వస్తానని అర్థం. అందుకని ఆమె గిన్నెలన్నీ సర్దుకుని పడుకుంటుంది.



మీ వ్యాఖ్య...

**కులం**
**కూడు పెట్టదు**
**మరోపక్క-**
**మతం**
**మంటపెడుతుంది**

*– లోగిశం లక్ష్మీనాయుడు,*
సింహాచలం

ఆమెకు ఒక రాత్రివేళ మెలకువ వచ్చింది. లేచి లైట్‌వేసి వాల్‌క్లాక్ వైపు చూసింది. అప్పుడు పన్నెండు కావొస్తోంది. అతను ఇంకా రాలేదేమిటని అనుకుని సెల్‌కి రింగ్ ఇచ్చింది. మోగుతోంది కాని ఎత్తడం లేదు. ఎక్కడ ఉండి ఉంటాడు? ఫోన్ ఎందుకు ఎత్తడం లేదు?

ఆమెకు ఏం చేయాలో తోచలేదు. పాలిషింగ్ యూనిట్ లాండ్ లైన్‌కి ఫోన్ చేసింది. అక్కడ ఇంత రాత్రివేళ వాచ్‌మెన్ తప్ప ఎవరూ ఉండరు. వాచ్‌మెన్ ఫోన్ ఎత్తి అక్కడ ఎవరూ లేరని చెప్పాడు. ఇక సత్యానికి ఫోన్ చేసింది.

అతను నిద్రలేచి "ఏమిటక్కా? " అన్నాడు.

"సత్యం మీ అన్నయ్య లేటుగా వస్తానని చెప్పి వెళ్లాడు. ఇంతవరకూ ఇంటికి రాలేదు. ఎక్కడికెళ్లాడు? నీకేమైనా తెలుసా? " అడిగింది చంద్రకళ.

"ఇంతవరకూ రాలేదా? పన్నెండైందిగా? " అన్నాడు.

"ఔను. నీకు ఏమైనా తెలుసేమోనని ఫోన్ చేశాను? "

"నాకు తెలియదు"

"సత్యం నీకు సీత అనే ఆవిడ తెలుసా? "

"సీతా? ఆవిడెవరు? "

"ఏమో? నేనూ చూడ్లేదు? "

"మరి సీత గురించి ఎందుకు అడుగుతున్నావు? "

"మీ అన్నయ్య ఒకరోజు స్నానం చేస్తున్నప్పుడు ఫోన్ వచ్చింది. నేను ఫోన్ ఎత్తాను. 'చెన్నకేశవులూ' అన్నది ఆవిడ. ఆయన స్నానం చేస్తున్నారు. మీరెవరు? అని అడిగాను. నా పేరు సీత అన్నది. ఆయనతో ఏం పని? ఏం చెప్పమంటారు? అని అడిగాను. సొంతపని లేండి. నేను మళ్లీ ఫోన్ చేస్తానన్నది. తర్వాత ఆమె ఫోన్ చేస్తూ ఉంటుంది. ఈయన గంటల తరబడి ఏమిటో మాట్లాడుతుంటాడు" అన్నది చంద్రకళ.

"పోనీ తర్వాతైనా అన్నయ్యను అడిగావా? సీత ఎవరని? " అడిగాడు సత్యం.

"అడిగాను. సీత సంగతి నీకెందుకు? అయినా నేను లీడర్ని. ఎవరెవరికో నాతో అవసరం ఉంటుంది. సహాయం కోసం ఫోన్ చేస్తారు. అవన్నీ నీకవసరమా? అని కసురుకున్నాడు సత్యం" చెప్పింది చంద్రకళ రుద్ధమైన కంఠంతో.

"అక్కా! సీత ఎవరో నాకు తెలియదు" అన్నాడు.

"మీ అన్నయ్య ఇక ఈ ఇంట్లో ఉండడని అనిపిస్తోంది సత్యం" ఆమె ఏడుపు వినిపిస్తోంది ఫోన్‌లో.

"ఛ.. ఛ.. ఏమిటక్కా! ఇప్పుడు ఏమైందని? ఇప్పుడు నీకు కష్టాలు ఏమున్నాయి? బ్రహ్మాండమైన ఇల్లు కొనుక్కున్నావు. హాయిగా ఉన్నావు. వ్యాపారం బాగా సాగుతోంది. ఇంకేంటి? " అడిగాడు సత్యం.

"నీకు తెలియదులే. కష్టాలు ఇప్పుడే మొదలయ్యాయి" అన్నది చంద్రకళ.

"సరే... సరే! నువ్వు వర్రీకాకు. ఎక్కడున్నాడో నేను కనుక్కుంటాలే" అని ఫోన్ కట్ చేశాడు.

★ ★ ★

చెన్నకేశవులు కళ్లు తెరిచాడు.

అది హాస్పటల్ గది. మందుల వాసన వస్తోంది. బైట ఎవరెవరో అటూ ఇటూ తిరుగుతున్న చప్పుడు వినిపిస్తోంది. తలుపు దగ్గరికి వేసివుంది.

అతనికి జరిగినదంతా గుర్తు రాసాగింది. తను చెంచు రామారెడ్డిని కలుసుకుని బైక్‌మీద తిరిగి వస్తున్నాడు. హౌసింగ్ బోర్డు దగ్గర పడుతూ ఉండగా

బాగా చీకటిగా ఉంది. స్ట్రీట్ లైట్లు లేవు. దూరంగా రోడ్డు పక్కన మనుషులు కనిపించారు. హఠాత్తుగా సరివిబాదు అడ్డంగా పట్టుకున్నారు. తను సడన్‌బ్రేక్ వేశాడు. ఎవరో తలమీద దెబ్బ కొట్టారు. ఇక ఆ తర్వాత ఏమీ గుర్తులేదు.

తనను ఎవరు కొట్టి ఉంటారు? తనను భయపెట్టడానికి కొట్టారా? లేక చంపాలనా? తనకు శత్రువులు ఎవరు? ఎమ్మెల్యే వర్గం తనను శత్రువుగా భావిస్తోంది. తను చెంచు రామారెడ్డితో సన్నిహితంగా ఉంటున్నాడనీ, కేసు పెట్టించి కోర్టు చుట్టూ తిప్పుతున్నాడని ఇన్‌స్పెక్టర్‌కి కూడా కోపంగా ఉంది. వర్కర్స్‌కి పెద్ద ఎత్తున నష్ట పరిహారం ఇప్పించేవరకు గొడవ చేస్తున్నాడని గ్రానైట్ యజమానులకూ తను శత్రువే.

చంద్రకళ బావ తమలపాకుల తిమ్మయ్య, ఆమె తమ్ముడు తోకల కోటయ్యలకు తనమీద పీకల వరకూ కోపంగా ఉంది. తన మూలంగా వాళ్లను ఆమె చేరనీయడం లేదనీ, డబ్బు ఇవ్వడం లేదనీ మంట.

వీళ్లందరిలో తనమీద దాడిచేసిన వాళ్లెవరై ఉంటారు? చెన్నకేశవులు ఆలోచిస్తున్నాడు. అతనికి దాహంగా ఉంది. గదంతా పరికించి చూశాడు. బెడ్ పక్కనే గోడకి స్విచ్‌బోర్డు కనిపించింది. బెల్ నొక్కాడు.

తలుపు తెరుచుకుంది.

నర్స్ వచ్చింది. దాహంగా ఉందని సైగ చేసాడు. ఆమె బాటిల్‌లో నుంచి గ్లాసులోకి నీళ్లు వంపి తాగించింది.

"ఇప్పుడు మీకు ఎలా ఉంది? " అడిగింది నర్స్.

"బాగానే ఉంది" అన్నాడు.

"ఏమైనా బాధగా ఉందా? "

"తల దిమ్ముగా ఉంది"

"తగ్గిపోతుందిలెండి" అన్నది.

నర్స్ అతనితో మాట్లాడుతూ ఉండగా చంద్రకళ వచ్చింది. పీక్కుపోయి ఉన్న ఆమె ముఖంలో ఆనందం కనిపించింది.

"ఏమండీ! ఎంతపని జరిగిందీ? " అంటూ ఏడుస్తోంది. కొంగుతో కన్నీళ్లు తుడుచుకుంటోంది.

"మేడమ్! ఏడవకండి. ఆయనకేం కాలేదు. బాగానే ఉన్నారు. వేడిపాలు తాగించండి ముందు" అని నర్స్ వెళ్లింది.

చంద్రకళ స్టూల్ మీద కూర్చుంది. అతని ఛాతిమీద చెయ్యివేసి నిమిరింది. అతని కళ్లల్లోకి చూస్తూ ఏడుస్తోంది. ఆమెకు దుఃఖం ఆగడం లేదు.

"ఏయ్! ఎందుకు ఏడుస్తున్నావు? " అన్నాడు.

"మీకు ఏమైనా ఐతే నా గతేమయ్యేదండీ? " అన్నది.

"ఏంటే నీ పిచ్చి? నువ్వు పుట్టిన దగ్గర్నుంచి నీ దగ్గరున్నానా నేను? కలకాలం కలిసి ఉంటామా? ఎవరు ఎప్పుడు పోతారో తెలీదు. నీకేమైంది? నీకు ఇప్పుడు ఏ కష్టాలు లేవు. పిల్లల్ని బాగా చదివించుకో. స్వతంత్రంగా బతకడం అలవాటు చేసుకో" అతను అప్పగింతలు చెప్తున్నట్టు అంటుంటే ఆమెకు దుఃఖం ఇంకా ఎక్కువైంది.

డాక్టర్లు, నర్సులు ఒక బృందంలా వచ్చారు లోపలకి. చంద్రకళ దుఃఖం ఆపుకుని ఫ్లాస్క్ తీసుకుని కేంటీన్‌కి బయల్దేరింది.

చెన్నకేశవులు స్పృహలోకి వచ్చాడని తెలిసి సత్యం వచ్చాడు. అతని తల్లి అన్నమ్మ, ఇతర బంధువులు వచ్చి చూసి వెళ్ళారు. కాసేపటికి పోలీస్ ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు, యస్సై, కానిస్టేబుల్స్ వచ్చారు.

"బాగున్నారా? " పలకరించాడు ఇన్‌స్పె

క్టర్.

చెన్నకేశవులు తల వూపాడు.

"చెప్పండి. మిమ్మల్ని ఎవరు కొట్టి వుంటారు?"

"ఏమోనండి. అక్కడంతా చిమ్మ చీకటిగా వుంది. స్ట్రీట్ లైట్లు లేవు, నేను బైక్ మీద వస్తుంటే ఇద్దరు వ్యక్తులు రోడ్డుకు అటూ ఇటూ నిల్చుని సరివి బాదు అడ్డం పెట్టారు. నేను సడన్ బ్రేక్ వేశాను. తల మీద ఎవరో దెబ్బకొట్టారు. తర్వాతి ఇక ఏమీ గుర్తులేదు. కళ్ళు తెరిచేసరికి ఇక్కడున్నాను" చెప్పాడు చెన్నకేశవులు.

"మిమ్మల్ని శత్రువులుగా భావించే వాళ్ళు ఎవరున్నారు?"

"నాకు ఎవరూ శత్రువులని అనుకోవడం లేదు."

"మీకు ఎవరిమీదా అనుమానం లేదా?"

"లేదు"

"మీ వల్ల నష్టపోయిన వాళ్ళు మీ శత్రువులు కాదా?"

"కావొచ్చు కాని నావల్ల ఎవరికి నష్టం జరిగింది?"

"మీరు వర్కర్స్ యూనియన్ స్థాపించారు. ఏ సంఘటన జరిగినా పెద్ద ఎత్తున నష్టపరిహారం డిమాండ్ చేస్తున్నారు. అందువల్ల గ్రానైట్ కంపెనీ వాళ్ళు మిమ్మల్ని శత్రువుగా అనుకుంటూ వుండొచ్చుగా?"

"వాళ్ళకి నష్టం జరగడం ఏమిటి? నష్టం జరిగేది వర్కర్స్‌కి. చచ్చిపోయేది వర్కర్స్. వాళ్ళు ఇచ్చే పరిహారం వారి లాభాల్లో నుంచి ఇస్తున్నారు. వాళ్ళు కోట్లు సంపాదిస్తున్నారంటే అదంతా వర్కర్స్ శ్రమ శక్తే గదా? అంతేగాని తామేదో నష్టపోతున్నామనే భావన సరైంది కాదు"

"మీరిక్కడికి రాకముందు కూడా యాక్సిడెంట్లు జరిగాయి. అప్పుడూ యూనియన్ వుంది. నష్టపరిహారం చెల్లించడం వుండేది. మీరు మరీ ఎక్కువగా డిమాండ్ చేసి ఇబ్బంది పెడుతున్నారు."

"పదేళ్ళ క్రితం మీ జీతం, ఇప్పుడు పుచ్చుకుంటున్న జీతం ఒకటేనా?"

"కాదు"

"పెరిగిందా లేదా?"

"పెరిగింది"

"ఎందుకు పెంచింది గవర్నమెంట్? ధరలు పెరుగుతున్నాయనే గదా? సంవత్సరానికొకసారి ఇంక్రిమెంటు, రెండుసార్లు కరువు భత్యం ఇస్తున్నారు. అలాగే డబ్బు విలువ తగ్గినప్పుడు వర్కర్స్‌కి ఇవ్వాల్సినవి గూడా ఎందుకు పెరగవు? తగినట్లుగా పెంచాల్సిన అవసరం ఉంది. గ్లోబలైజేషన్ వల్ల గ్రానైట్ వ్యాపారం పెరుగుతోంది. ఫారిన్ ఎక్స్‌పోర్ట్ చేస్తున్నారు. ఇండియాలో గూడా డిమాండ్ బాగుంది. కోట్లు గడిస్తున్నారు. ప్రభుత్వ అధికారులకు, రాజకీయ నాయకులకు నజరానాలు ఇస్తున్నారు. అందరూ బాగుపడాలి కాని వర్కర్లు మాత్రం అట్లాగే దరిద్రంగా వుండాలి. అంతేనా?"

"అవన్నీ ఇప్పుడు డిస్కస్ చెయ్యడం ఎందుకులెండి. మీకు ఎవరిమీదమైనా అనుమానం వుంటే చెప్పండి" అన్నాడు రంగూన్‌రామారావు ముఖం మాడ్చుకుని.

"ఎవరి మీదా లేదండి. నన్ను దెబ్బకొట్టిన వాళ్ళు ఎవరైనా నాకు కనిపిస్తే, వారిని నేను గుర్తుపడితే, మీకు తెలియజేస్తాను" చెప్పాడు చెన్నకేశవులు.

ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు లోపలకు వస్తున్న సీతామహాలక్ష్మిని చూసి ఛైర్‌లో నుంచి లేచి నిలబడ్డాడు.

"రండి మేడమ్! నమస్తే" అన్నాడు నవ్వుతూ.

"ఇన్‌స్పెక్టర్‌గారూ! మీకు మా సీత తెలుసా?" ఆశ్చర్యంగా అడిగాడు చెన్నకేశవులు.

"ఎందుకు తెలియదూ? మా పిల్లలు మేడమ్ దగ్గర సంగీతం నేర్చుకుంటున్నారు" అన్నాడు.

"అలాగా? "

"మేడమ్ మీరు కూర్చోండి. నేను వెళ్తున్నాను. వస్తాను చెన్నకేశవులు గారూ!" అని బయల్దేరాడు ఇన్‌స్పెక్టర్. ఆయన వెంట సిబ్బంది గూడా అనుసరించారు.

"ఏంట్రా ఇది? ఇక్కడ నీకు విరోధులు ఎవరున్నారు? నిన్ను చంపాలని చూశారటగా? " కూర్చుంటూ అడిగింది సీత.

"ఏదో జరిగిందిలే! నీకెవరు చెప్పారు? " అడిగాడు చెన్నకేశవులు.

"నువ్వు చెప్పకపోతే తెలియదనుకున్నావా? టీవీలో చూపించారు. న్యూస్ పేపర్లలో నీ ఫోటో వేసి వార్త రాశారు" అన్నది సీత.

తను తెచ్చిన పళ్ళబుట్ట, పుష్పగుచ్ఛం అతని పక్కన వుంచింది.

"ఎలా ఉందిరా ఇప్పుడు? " పరామర్శించింది.

అప్పుడే వచ్చిన చంద్రకళ సీతవైపే అదో రకంగా చూస్తూ కర్టెన్‌చాటున నిలబడిపోయింది. ఆమె ఎత్తుగా, దానికి తగ్గ లావుగా అందంగా వుంది. పసుపు రంగు మేనిఛాయ ఆమెకు హుందాతనం తెస్తోంది. నీలిరంగు పట్టుచీరలో, ముఖాన ఎర్రటి కుంకుమ బొట్టుతో రాజకుమారిలా ఉన్న సీతను చూస్తుంటే ఆమె హృదయంలో సన్నగా మంట బయల్దేరింది.

"నువ్వు ఎవరికి అపకారం చేశావు? నిన్నిలా కొట్టించారు? " అతని చేతిని తన చేతిలోకి తీసుకుని మృదువుగా నిమిరింది.

"ఇప్పుడు లోకంలో ఒకరికి ఉపకారం చేస్తే మరొకరికి అపకారం చేసినట్లుగా వుంది" అని నవ్వాడు.

కాసేపటికి యూనియన్ కార్యవర్గ సభ్యులు పళ్లు, పూలు తెచ్చి పరామర్శించారు. అక్కడంతా సందడిగా వుండడం చూసి నర్స్ వచ్చి మందలించింది.

"విజిటింగ్ అవర్స్ అయిపోయాయండీ. ప్లీజ్ పేషెంట్‌ని రెస్ట్ తీసుకోనివ్వండి" అన్నది.

వెళ్లొస్తామని చెప్పి అంతా వెళ్ళిపోయారు. సీత కూడా 'మళ్ళీ కలుస్తా!' అని వెళ్ళింది.

అప్పుడు కర్టెన్ చాటున ఉన్న చంద్రకళ అతని ముందుకు వచ్చింది.

"నువ్వు ఇక్కడే ఉన్నావా? అలా చాటుగా వెళ్ళావెందుకు అన్నాడు చెన్నకేశవులు.

"పోలీసులొచ్చారని చాటుగా వెళ్ళాను" అన్నది.

"పోలీసులంటే భయమా? " నవ్వుతూ అడిగాడు.

"ఔను. చిన్నప్పటి నుంచి భయమే. మా అమ్మ పోలీస్ వస్తున్నాడని నన్ను భయపెట్టేది. అప్పుడు అల్లరి మానేదాన్ని. పేచీ పెట్టకుండా అన్నం తినేదాన్ని" అన్నది.

"ఇప్పుడు పెద్దదానివయ్యావుగా? ఇంకా భయమేనా? "

"సినిమాల్లో పోలీసులు జనాన్ని చావగొడుతుంటారుగా! భయం ఇంకా ఎక్కువైంది. అది సరేగాని మిమ్మల్ని దెబ్బకొట్టింది ఎవరో తెలిసిందా? "

"ఊహూ... తెలీలేదు. నీకు ఎవరి మీదనైనా అనుమానం ఉంటే చెప్పమన్నారు. మీ బావ, మీ తమ్ముడి పేర్లు చెప్పాలనుకున్నాను. ఎందుకులే అని ఊరుకున్నాను. ఆ ఇద్దర్లో ఎవరో ఒకరు నన్ను కొట్టించి ఉండొచ్చుగా? "

"తాగుబోతు ఎదవలు. కొట్టించే ఉంటారు. వాళ్ల పేర్లు చెప్పాల్సింది. చావగొట్టి ఉండేవాళ్లు. వాళ్లకి నీమీద చాలా కసిగా ఉంది" అన్నది చంద్రకళ.

"చెప్పొచ్చుగాని పోలీసులు తీగ పట్టుకుని డొంకంతా లాగుతారు. వాళ్లకి నీమీద విరోధం ఎందుకు? అని అడుగుతారు. అప్పుడు నీ గురించి అడుగుతారు. అంతా చెప్పాల్సి వస్తుంది."

"మా ఇంట్లో ఒక గదిలో అద్దెకు ఉంటున్నావు. అంతేగదా?"

"అట్లా ఊరుకోరు. పత్రికల్లో ఏదేదో రాస్తారు. ఎందుకొచ్చిన గొడవ అని ఊరుకున్నాను." అన్నాడు.

"ఆ సీత ఎవరు? మిమ్మల్ని అరేయ్! ఒరేయ్ అంటుంది?" ముఖం చిట్లించి అడిగింది చంద్రకళ.

"నా స్నేహితురాలు. చిన్నప్పుడు ఒకే క్లాస్‌లో చదువుకున్నాం. సంగీతం పాఠాలు చెప్తుంది."

"ఐతే మాత్రం ఒరేయ్ అని పిలవడం నాకు నచ్చలేదు. మిమ్మల్ని అందరి ముందూ అలా పిలవడం ఏం బాగుంటుంది?"

"అందరి ముందూ పిలవదులే. నువ్వు కర్టెన్ చాటున ఉన్న సంగతి గమనించి ఉండదు. ఎవరూ లేనప్పుడే అలా చనువుగా పిలుస్తుంది" అన్నాడు చెన్నకేశవులు.

"మీరు వాళ్లింటికి వెళ్తుంటారా? వాళ్లాయన ఏం చేస్తాడు?"

"అప్పుడప్పుడూ వెళ్తుంటాను. సీతకి పెళ్లి కాలేదు?"

"ఏం?"

"నేను చిన్నప్పుడే ఊరొదిలి పారిపోయాను. నేను తిరిగి వస్తానని ఎదురు చూస్తూ పెళ్లి చేసుకోకుండా ఉండిపోయింది" చిలిపిగా ఆమెవైపు చూస్తూ అన్నాడు.

"వచ్చారుగా? పెళ్లి చేసుకోలేదేం?"

"నాకే ఇష్టం లేదు?"

"ఏం?"

"ఏవుంది? నాకు విరోధులు ఎక్కువయ్యారు. ఇప్పుడంటే ప్రాణాలతో బైటపడ్డాను కాని, ఎప్పుడూ అలా జరగదుగా! దినదిన గండం నూరేళ్ళ ఆయుష్షు అని, ఎప్పుడు పోతానో తెలియదుగా?"

"అయ్యో! అవేం మాటలండీ" అని ఆమె అరచేతితో అతని నోరు మూసింది.

చంద్రకళ కళ్లల్లో కన్నీళ్ళు గిర్రున తిరిగాయి.




మధుసూదన్ కంపెనీతో, పొట్లూరి కుటుంబం భారీ స్పిన్నింగ్ మిల్ కట్టడానికి అంగీకారానికి వచ్చారు. ఇప్పుడు లేబర్ కాలనీ ఉన్న స్థలం అనుకూలంగా ఉంటుందని నిర్ణయించుకున్నారు. అక్కడ అన్నీ గుడిసెలు వేసుకుని పేదవాళ్ళు, క్వారీలో పనిచేసే కూలీలు నివాసం వుంటున్నారు. తరచుగా అగ్ని ప్రమాదాలు జరుగుతున్నాయి. అది మునికొండ ఊరి పోరంబోకు. అక్కడ స్పిన్నింగ్ మిల్ కడితే వేలమందికి ఉపాధి దొరుకుతుందని ప్రభుత్వాన్ని ఒప్పించారు. ఎమ్మెల్యే పొట్లూరి శ్రీనివాసులు నాయుడికి గూడా భాగస్వామ్యం ఉండడంతో, అది విలువ లేని భూమి అనీ, గ్రానైట్ రాళ్లు ఆ భూమిలో లేవనీ, అంతా ఇసుక, రాళ్ళ నేలనీ, ఎకరం పదివేలకు ఇవ్వొచ్చనీ జిల్లా కలెక్టర్ రికమండేషన్ చేశాడు. ప్రభుత్వం జి.ఒ. ఇచ్చింది. అందులో వుంటున్న



వాళ్ళని ఖాళీ చేయమని యం.ఆర్.ఒ. అందరికీ నోటీసులు జారీచేశాడు. జనం గోలపెట్టి యూనియన్ ఆఫీసుకి వెళ్ళారు.

చెన్నకేశవులు యూనియన్ నుంచి ముఖ్యమంత్రికీ, గవర్నర్‌కీ, జిల్లా కలెక్టర్‌కి, ఎమ్మెల్యేకి, మంత్రులకూ టెలిగ్రామ్స్ ఇచ్చాడు. ఆ స్థలంలో కూలీలు గుడిసెలు వేసుకుని ఉంటున్నారు. కుటుంబానికి వందగజాలు పట్టాలు ఇస్తే గ్రానైట్ కంపెనీలు ఇచ్చిన విరాళాలతో పక్కా ఇళ్లు కట్టుకుంటారు. ఆ స్థలం మధుసూదన్ కంపెనీకి ఇవ్వడానికి వీల్లేదు.

చెన్నకేశవులు, చింతలపూడి చెంచురామారెడ్డి ద్వారా గ్రానైట్ కంపెనీల యజమానులలో ముఖ్యులను కలుసుకుని వర్కర్స్‌కి పక్కాఇళ్ళు కట్టించాల్సిన అవసరం ఉందని అందర్నీ ఒప్పించాడు. పోలీసులకు, రాజకీయ పార్టీలకు విరాళాలు ఇవ్వొద్దనీ, తమ యూనియన్‌కి విరాళాలు అందజేస్తే అందరికీ పక్కాఇళ్లు కట్టిస్తామనీ కన్విన్స్ చేసేసరికి అందుకు ఒప్పుకున్నారు. వర్కర్లు కంపెనీలకు అండగా ఉంటారని నమ్మారు. ఇక ఇంటి స్థలాలకు పట్టాలు ఇస్తే, పక్కాఇళ్ళు మొదలు పెట్ట

డానికి కార్పస్ ఫండ్ రెడీగా వుంది.

ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు చందాలు రావడం బంద్ అయ్యేసరికి అగ్గి మీద గుగ్గిలమయ్యాడు. రాజకీయ నాయకులు చెన్నకేశవులు మీద గుర్రుగా వున్నారు. ఇక ఎమ్మెల్యే శ్రీనివాసులు నాయుడు మండిపడుతున్నాడు. ఇక యూనియన్ నాయకుడు బ్రహ్మయ్య కార్మికులలో తన ప్రాబల్యం తగ్గిపోయినందుకు, గ్రానైట్ కంపెనీల నుంచి చందాలు రానందుకు విలవిలలాడుతున్నాడు.

పోరంబోకు స్థలంలో ఇప్పటికే గుడిసెలు వేసుకుని నివాసం ఉంటున్న పేద వాళ్ళందరి పేర్లూ సేకరించి లిస్ట్ తయారు చేశారు. ఇంకా మునికొండ ఊళ్లో అద్దెలకు ఉంటున్న కార్మికుల వివరాలు, మొత్తం ఎంతమందికి ఇళ్లు కావాలో అంచనాలు వేశారు. రెండువేల మందికి తలా వందగజాల స్థలం ఇవ్వాలని ప్రభుత్వానికి పిటీషన్ పెట్టారు. ఇళ్లు తామే గ్రానైట్ కంపెనీల సహకారంతో కట్టుకుంటామని తెలియజేశారు. అందులో రోడ్లు వేయించి, వీధి దీపాలు, మంచినీటి సౌకర్యం కలిగించమని మున్సిపాల్టీ ఛైర్మన్ని కలిసి దరఖాస్తు ఇచ్చారు.

అందరికీ స్వంత ఇళ్లు వస్తాయని కార్మికులకు ఆశ కలిగింది.

ఎమ్మెల్యే శ్రీనివాసులు నాయుడు బెంబేలెత్తిపోయాడు. దానికి తోడు ప్రతిపక్షం తరపున చెంచురామారెడ్డి పోటీగా నిలబడడం ఖాయమైపోయింది. ఇంటిస్థలాల సాధనకు అతను అండదండగా నిలబడ్డాడు. కరపత్రాలు, వాల్‌పోస్టర్ల ఖర్చులన్నీ భరిస్తున్నాడు. ఇళ్ళు కట్టుకోవటానికి గ్రానైట్ కంపెనీ యజమానులలో తనకు అనుకూలురైన వారితో కలిసి కార్పస్ ఫండ్ అని మొదలుపెట్టాడు. తమ కంపెనీ తరపున పాతికలక్షలు బ్యాంక్‌లో జమచేశాడు. అందరూ తమ వంతు విరాళాలు ఇచ్చారు. శ్రీనివాసులు నాయుడు వర్గం కూడా తాము కార్మికుల దృష్టిలో దుర్మార్గులమైపోతామని భయపడి వాళ్లు కూడా విరాళాలు ఇచ్చారు.

ఇప్పుడు ప్రభుత్వం మునికొండ పోరంబోకు స్థలం పేదలకు పంచితే వాళ్ల ఇళ్లు కట్టుకోవడం వెంటనే జరిగిపోతుంది. చెన్నకేశవులు హీరో అవుతాడు. చెంచురామారెడ్డికి ఆ క్రెడిట్ దక్కుతుంది. ఆ ప్రభావం ఎన్నికలలో తప్పక పడుతుంది. తను ఓడిపోక తప్పదు. శ్రీనివాసులు నాయుడు వణికిపోయాడు.

చెంచురామారెడ్డికి క్రెడిట్ దక్కకుండా ఉండాలంటే ఏం చేయాలని తన వర్గాన్నంతా సమావేశపరచి మంతనాలు సాగించాడు.

★ ★ ★

చెన్నకేశవులు యూనియన్ ఆఫీసులో బిజీగా ఉన్నాడు. ప్రతిపక్ష నాయకులతో బహిరంగ సభకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. వాల్ పోస్టర్లు అంటించడం, కరపత్రాలు పంచడం, నాయకుల ఫొటోలతో ఫ్లెక్సీ బేనర్లు ఏర్పాటు చేయడంలో మునిగిపోయాడు. యాక్టివ్‌గా ఉండే అనుచరులంతా పనుల మీద వెళ్లిపోయారు.

అప్పుడు ఉదయం పదకొండు కావొచ్చింది.

"అయ్యా! చెన్నకేశవులూ!" అంటూ ముసలాయన లోపలకి వచ్చాడు.

చెన్నకేశవులు ఆ ముసలాయన వైపు ఎగాదిగా చూశాడు. ఆయన్ని ఎక్కడో చూశాడు గాని గుర్తురావడంలేదు. తెలిసిన ముఖం లాగానే ఉంది. ఎంత ఆలోచించినా జ్ఞాపకం రావడంలేదు.

"పెద్దయ్యా! ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నూతలపాటి నారయ్యనురా! మీ నాన్న

# కొత్తరకం జైలు



జపాన్‌లో టోక్యో సమీపంలో ఉన్న ఇచిహరా జైలులాంటిది ప్రపంచంలో మరెక్కడా లేదు. ఇందులో బేంక్ దొంగలు, గొంతు కోసి చంపే ఘాతకులు తదితర నేరస్థులు ఉండరు. కంపెనీ ఎగ్జిక్యూటివ్స్, కేబ్ డ్రైవర్స్ లాంటి వాళ్ళు ఇందులో ఖైదీలుగా ఉంటారు. వాహనం డ్రైవ్ చేసేప్పుడు చేసే వివిధ నేరాలకు పాల్ప




డినవారిని ఈ జైలుకి పంపుతారు. నియమాన్ని మించి కారుని వేగంగా నడిపేవారు, తాగి కారు నడిపేవారు, రోడ్డు నిబంధనలకి వ్యతిరేకంగా కారు నడిపేవారు ఈ జైలుకు వస్తారు. వీరిలో ఎక్కువమంది ఏక్సిడెంట్ చేసి ఇతరుల చావుకి కారణమైనవారే.

మొదటి కొన్ని వారాలు ఈ జైలుకి వచ్చినవారిని ఒంటరిగా ఓ చిన్నసెల్‌లో బంధించి వుంచుతారు. తర్వాత వారు ఇతర ఖైదీలతో కలిసి తిరగవచ్చు. ఖైదీలంతా ఉదయం ఆరున్నరకి నిద్ర లేవాలి. ఉదయం ఎనిమిది నించి సాయంత్రం నాలుగున్నర దాకా పనిచేయాలి. రాత్రి తొమ్మిదికి లైట్లు ఆర్పేస్తారు. పని అంటే కంప్యూటర్ ముందు కూర్చుని స్టీరింగ్ వీల్ పట్టుకుని కంప్యూటర్ మానిటర్ స్క్రీన్‌లోకి చూస్తూ కారుని జాగ్రత్తగా నడిపే శిక్షణని తీసుకోవడం. సూపర్‌వైజర్లకి వీరి డ్రయివింగ్ మీద సంతృప్తి కలిగాక జైలులోని డ్రైవింగ్ ట్రాక్‌లో సూపర్‌వైజర్ పక్కన కూర్చోగా, కారుని సరిగా డ్రైవ్ చేయగలగాలి. వారు ఎక్కడైతే లోపం చేసి నేరస్తులయ్యారో దాన్ని సూపర్‌వైజర్ సమక్షంలో రోడ్డుమీద చాలాసార్లు సరిదిద్దుకోవాలి.

ఇంతేకాక వారిలో మానసిక పరివర్తన కలిగే శిక్షణ కూడా ఇవ్వబడుతుంది. వారు చేసిన ప్రమాదంవల్ల మరణించిన వ్యక్తి కుటుంబంలోని సంక్షోభం గురించి వివరించి వారు ఒక్కక్షణం జాగ్రత్తగా ఉండివుంటే అది నివారింపబడేదని పదే పదే గుర్తుచేస్తారు.

చివరగా 'ఎటోన్‌మెంట్ స్టోన్' ముందు వారు పశ్చాత్తపపడాలి. ఓ రాతి మీద "నా తప్పుల మీద నాకు అవగాహన ఉంది. సమాజంలో చక్కగా మారడానికి నేను నిశ్చయించుకున్నాను" అని చెక్కిన రాతికి వారు మొక్కాక విడుదల వుతారు. ఈ జైలులో శిక్షని అనుభవించి బయటికి వచ్చాక ఎవరూ డ్రైవింగ్ చేస్తూ సెల్‌ఫోన్ వాడకపోవడం విశేషం!

నేనూ బాగా ఉండేవాళ్ళం. అప్పుడు నువ్వు చిన్నపిలగాడివిలే" అన్నాడు.

"అట్లాగా! ఎక్కడుంటున్నావ్? ఏం చేస్తున్నావ్? పిల్లలు ఎక్కడున్నారు?" అని కుశల ప్రశ్నలు అడిగాడు.

నారయ్య తన గురించి చెప్పాడు.

"అయ్యా! నువ్వు అందరికీ ఇళ్లు కట్టించి ఇస్తానంటన్నావంటనే!" అన్నాడు.

"ఔను పెద్దయ్యా! మన వాళ్లు ఎంత కాలం పూరిగుడిసెల్లో ఉంటారు చెప్పు? ఎండాకాలం ఇళ్లు కాలిపోతున్నాయి. వానా కాలం కప్పులు లేచిపోతన్నయ్!"

"అది సరేగాని మనవాళ్ళకు నువ్వు లీడర్వా?" అడిగాడు నారయ్య.

"ఔను పెద్దయ్యా! యూనియన్ పెట్టుకున్నాం"

"బ్రహ్మయ్య యూనియన్ ఉందిగా?"

"ఉంది. కాని మన వాళ్ళకి యాక్సిడెంట్లు జరిగినప్పుడు సరిగా డబ్బులు ఇప్పించడం అదీ లేదు. అందుకే పోటీ యూనియన్ పెట్టుకున్నాం"

"యాక్సిడెంట్లు జరిగినప్పుడు డబ్బులు ఇప్పించడం ఒకటేనాయూనియన్ పని?"

"అంతేకాదు. ఇన్సూరెన్స్ చేయించడం, క్వారీలదాకా బస్సులు వేయించడం వంటివి గూడా చేస్తున్నాం"

"సరే నువ్వు హక్కులు గురించి చెప్తున్నావు. అవి బ్రహ్మయ్య గూడా చేసేవాడు. మరి బాధ్యతల గురించి ఏమైనా చెప్తున్నావా?" అడిగాడు నారయ్య.

"బాధ్యతలా? ఎవరికి?" ఆశ్చర్యపోతూ అడిగాడు చెన్నకేశవులు.

"కార్మికులకు బాధ్యతల గురించి ఎప్పుడైనా చెప్పావా? అని అడుగుతున్నానయ్యా?"

"మనం చెప్పేదేంది పెద్దయ్యా! బాధ్యతగా పనిచేస్తేనే గదా, జీతాలు వచ్చేది. పని చేస్తేనే ఎవరైనా కూలి ఇస్తారు. పని చెయ్యకుండా ఎగ్గొట్టిన వాడికి ఎవరిస్తారు? కార్మికులంతా బాధ్యతతోనే పనిచేస్తున్నారని నేను అనుకుంటున్నాను" అన్నాడు చెన్నకేశవులు.

"కంపెనీలలో పని బాధ్యతలు సరే! ఇంటి బాధ్యతల సంగతో?"

"ఇంటి బాధ్యతలా?"

"ఔనయ్యా! ఇంటికి కావాల్సిన బియ్యం, పప్పు, ఉప్పు కూరగాయలు తెస్తున్నారా? పెళ్లాం బిడ్డలకి సుఖంగా ఉండడానికి ఏం చేస్తున్నారు? పిల్లల్ని స్కూళ్లల్లో చదివిస్తున్నారా? ముందు ముందు అవసరాలకి డబ్బు కూడబెడుతున్నారా? ముసలి తల్లి దండ్రుల్ని చూసుకుంటున్నారా?"

"పెద్దయ్యా! ఏంది నువ్వు చెప్పేది? అవన్నీ ఎవడికి వాడు చూసుకోలేడా? యూనియన్‌కి ఏం సంబంధం? అది స్వంత విషయం."

"మరి వాళ్ళు సంపాదిస్తున్నారు. ఇళ్ళు కట్టుకోలేరా? యూనియన్‌కి ఏం సంబంధం? అది మాత్రం వాళ్ళ స్వంత విషయం కాదా?"

నారయ్య అన్న మాటలకి చెన్నకేశవులు తల తిరిగింది. చెంప మీద కొట్టినట్లు తగిలాయి మాటలు.

"ప్రతి ఇంట్లో ఆడ, మగ పనిచేసి సంపాదిస్తున్నారు. పిల్లల్ని బడికి పంపకుండా వాళ్లతో కూడా పని చేయించి డబ్బులు గుంజుతున్నారు. ఆ డబ్బంతా ఏం చేస్తున్నారు? ఎన్నేళ్ళున్నా వీళ్ళంతా దరిద్రంలోనే ఎందుకున్నారని ఎన్నడైనా ఆలోచించావా?" ప్రశ్నించాడు నారయ్య.

"ఏంది పెద్దయ్యా! నువ్వనేది?"

"నేను చాలా చూశారా! గవర్నమెంటు దగ్గర పట్టాలు తీసుకున్న వాళ్ళు అన్నీ అమ్ముకుని మళ్లీ ఎక్కడో ఊరి చివర గుడిసెలు వేసుకోవడం చాలా చూశాను."

"నువ్వేం చెప్పదల్చుకున్నావో చెప్పు

పెద్దయ్యా? "

"బాధ్యతలు చెప్పయ్యా! నీకు తెలియకుండా ఎట్లా ఉంటదిగాని మనవాళ్ళు ఇది వరకు చాటుమాటుగా సారా తాగుతుండేవాళ్ళు. సారా పోయి చీప్ లిక్కరు వచ్చింది. అది రాత్రిళ్ళు తాగుతుండేవాళ్లు. ఇప్పుడు నువ్వు పొద్దున్నే తొమ్మిదింటికి పొయ్యి బ్రాందీ షాపుల దగ్గర చూడు. మనవాళ్ళు షాపు ఎప్పుడు తెరుస్తారా అని ఎదురు చూస్తున్నారు. ఇప్పుడు ఉదయమే పనిలోకి వెళ్ళేటప్పుడు తాగిపోతున్నారు. మళ్ళీ పని పూర్తయ్యాక రాత్రిళ్ళు తాగుతున్నారు."

షాపుల ముందు గ్లాసుల్లో పోసుకుని అక్కడ బజ్జీల కొట్ల దగ్గర, పకోడీలు వేసే చోట, ఆమ్లెట్లు వేసే బళ్ల దగ్గర తాగుబోతులు ఈగల్లా ముసురుకున్న దృశ్యాలు చెన్నకేశవులు కళ్లముందు మెదిలాయి.

"తాగడం కోసమే పనులు చేస్తున్నాం. తాగడం కోసమే బతికున్నాం అన్నంతగా వాళ్ళ బతుకులు మారిపోయాయి. తాగి తాగి మనుషులు జంతువుల్లాగా మారిపోతున్నారు. మగాళ్ళు తాము సంపాదించేది తాగుతున్నారు. అది చాలక పెళ్ళాం, పిల్లలు కూలీనాలీ చేసి తెచ్చిందీ లాక్కుని తాగుతున్నారు. తాగి తంతున్నారు. చంపుతున్నారు. వావి వరసలు మర్చిపోయి కన్న కూతుళ్ళమీద అత్యాచారాలు చేసేవాళ్ళు ఎక్కువై పోతున్నారు"

"ఔను పెద్దయ్యా! నువ్వు చెప్పేది నిజమే"

"మీ లీడర్లు డబ్బు విలువ గురించి, పొదుపు గురించి చెప్పరు. బీదవాడు బాగుపడడానికి ఏకైక మార్గం చదువనీ, అందుకని మనం మన సుఖాలు త్యాగం చేసి పిల్లల్ని చదివిద్దామని చెప్పరు. అందుకే అంటున్నాను మీరు హక్కులు గురించి రెచ్చగొడుతుంటారు. బాధ్యతల ఊసెత్తరు. నీ పెళ్ళాన్ని ఎందుకు కొడుతున్నావురా? అని అడగరు. మీ పిల్లల్ని చదివిస్తున్నావా లేవా అని అడగరు."

నారయ్య ఆవేశంతో చెప్పుకుపోతున్నాడు.

"పెద్దయ్యా! నిన్ను లీడర్ని చేస్తాను. నువ్వు అవన్నీ చెయ్యి" అన్నాడు చెన్నకేశవులు ఏమనాలో తోచక.

నారయ్య పకపకా నవ్వాడు.

"నేను ముసలాడినై పోయాన్రా అయ్యా! ఏంచేసినా నీలాంటి పిలగాళ్లు చెయ్యాలి"

"ఏం చెయ్యమంటావో చెప్పు? "

"బాధ్యతలు నేర్పు. అందరితో బ్యాంకుల్లో ఖాతాలు పెట్టించు. నెలనెలా ఎంత జమచేస్తున్నారో చూడు. తాగుడు మానమనీ, పిల్లల్ని బాగా చదివించమనీ పోరుపెట్టు. నువ్వు ఇళ్ళు అంటూ కట్టిస్తే



నాయకులకు తెలుసు
జనం బకరాలని
జనానికి తెలుసు నాయకులు
తకరారని
పరస్పరం మోసం-
ప్రజాస్వామ్యం అపహాస్యం

– జియ్యస్ రాణి,
వి. ఎల్. పురం, రాజమండ్రి

అవి మగాళ్ళ పేర్లతో గాక ఆడవాళ్ళ పేర్లతో ఇప్పించు"

"సరే పెద్దయ్యా! నువ్వు చెప్పింది బాగానే వుంది. బాధ్యతలు నేర్పించడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు చెన్నకేశవులు.

"ముందు ప్రయత్నం ముఖ్యం. ఒకర్ని చూసి మరొకరు బాగు పడడానికి ప్రయత్నిస్తారు. నా బోటివాడు చెప్తే ఎవరూ వినరు. నువ్వు లీడర్‌వి కాబట్టి నీ మాట వింటారు. నువ్వు పెద్దలీడర్లతో మీటింగ్ ఏదో పెట్టిస్తున్నావంటనే. వాళ్ళతో గూడా

చెప్పించు".

"అట్టాగే పెద్దయ్యా!"

"ఏదో ముసలోడిని నాకు తోచింది చెప్పానయ్యా! ఏమనుకోబాకు" అన్నాడు నారయ్య.

"భలేవాడివి పెద్దయ్యా! పెద్దవాళ్ళు ఏదైనా అనుభవంతో చెప్తారు. నువ్వు చెప్పేవరకూ నాకు వాళ్లకు బాధ్యతల గురించి చెప్పాలనే ఆలోచన, అట్లాగే అందరితో బ్యాంకుల్లో ఖాతాలు తెరిపించాలనే విషయంగూడా తట్టలేదు. చూద్దాం.. మన ప్రయత్నం మనం చేద్దాం" అన్నాడు చెన్నకేశవులు.

నారయ్య వెళ్ళొస్తానని బయల్దేరాడు.

★ ★ ★

"మన ఊళ్ళో పేదవాళ్ళందరికీ పక్కా ఇళ్ళు కట్టించి ఇవ్వాలనేదే నా ఉద్దేశ్యం గూడా!" అన్నాడు ఎమ్మెల్యే శ్రీనివాసులు నాయుడు.

"చాలా సంతోషం. ఇక మీతో విభేదించేది ఏముంది? అందరికీ ఇప్పుడుంటున్న పోరంబోకు స్థలంలోనే తలా వంద గజాలు పట్టాలిప్పించండి చాలు. ఇళ్ళు కట్టుకోవడానికి మా దగ్గర కార్పస్‌ఫండ్ ఉంది" అన్నాడు చెన్నకేశవులు.

"స్థలం విషయంలోనే మీరు సర్దుకోవాలి. క్రాస్‌రోడ్సు దగ్గర ప్రభుత్వ భూమి ఉంది. అందులో అందరికీ స్థలాలు ఇప్పిస్తాను. ఇప్పుడు ఉంటున్న పోరంబోకులో గుడిసెలు ఖాళీ చేయాలి."

"క్రాస్‌రోడ్స్ ఊరికి చాలా దూరం సార్! అది మాకు సమ్మతం కాదు. పోరంబోకు స్థలం ఊరికి ఆనుకుని ఉంటుంది. ఆ ఏరియాలో ఎన్నో ఏళ్ళనుంచి ఇళ్ళు వేసుకుని అలవాటుపడి ఉన్నారు. అక్కడ్నుంచి ఖాళీ చెయ్యమని చెప్పడం న్యాయం కాదు" అన్నాడు చెన్నకేశవులు.

ఎమ్మెల్యే బ్రహ్మయ్య వైపు చూశాడు. తనను మాట్లాడవలసిందిగా ఇచ్చిన సూచన అర్థం చేసుకున్నాడు.

"చెన్నకేశవులు గారూ! పరిస్థితి అర్థంచేసుకోండి. పోరంబోకు స్థలం మధుసూదన్ ఇంటర్నేషనల్ కంపెనీకి ప్రభుత్వం అమ్మేసింది. జి.ఒ. గూడా ఇచ్చింది. ఆ స్థలం ప్రభుత్వానిదే కాబట్టి మనకు హక్కులేదు. మనం ఇళ్ళస్థలాలు అడుగుతున్నాం. క్రాస్ రోడ్స్ దగ్గర ఇస్తామంటున్నారు గదా! అది హైవేకి ఆనుకుని గూడా వుంది" అన్నాడు బ్రహ్మయ్య.

"హైవేకి ఆనుకుని ఉన్నది ఆ కంపెనీ వాళ్ళే తీసుకోవచ్చుగదా? కాని తీసుకోరు. ఎందుకంటే అవన్నీ గుట్టలు కాబట్టి. ఆ భూమి ఇళ్లు కట్టుకోవడానికి అనుకూలంగా మారడానికి ఎంత ఖర్చుపెట్టాలో అంచనా వెయ్యండి. దానికన్నా ప్రైవేటు భూమి కొనుక్కుని ఇళ్ళు కట్టుకోవడం చౌక గదా! పోరంబోకు స్థలంలో ఎన్నో ఏళ్లనుంచి పేదలు గుడిసెలు వేసుకుని ఉంటున్నారు గదా! ఆ విషయం ఎమ్మెల్యే గారికి తెలియదా? తెలిసీ ఒక కంపెనీకి ఎట్లా కట్టబెట్టారు? అదీగాక ఈ హైవే దగ్గరున్న భూమి ఊరికి పదికిలోమీటర్ల దూరంలో వుంది. అంటే అందర్నీ ఊరినుంచి వెళ్ళగొట్టినట్లే గదా! ఈ ప్రపోజల్ మాకు ఇష్టం లేదండీ" గట్టిగా చెప్పాడు చెన్నకేశవులు.

"ప్రభుత్వంతో వ్యవహరించేటప్పుడు పట్టు విడుపులు ఉండాలండీ. మనం అడిగిందే మీరు చేయాలంటే ఏదీ సాధించలేం. పదిహేనేళ్ళ నుంచి యూనియన్ ప్రెసిడెంట్‌గా ఉన్నాను. మీకంటే పెద్దవాడిని. ఎందుకు చెప్తున్నానో ఆలోచించండి" అన్నాడు బ్రహ్మయ్య.

"మీ పెద్దరికాన్ని గౌరవిస్తాను. హక్కుల్ని వదులుకోలేము" అన్నాడు చెన్నకేశవులు.

"హక్కులే కాదు బాధ్యత గూడా ఉండాలి. ఇది మీ ఒక్కరి సమస్యకాదు. వేలాది కార్మికుల సమస్య."

"బాధ్యతల గురించి మీరు చెప్పనవ సరం లేదు. మనం ఇన్నాళ్లూ హక్కుల గురించి బోధించాం. ధనవంతులు దుర్మా ర్గులనీ, పాపాత్ములనీ, డబ్బు ఆలోచనలు, కూడబెట్టే విధానాలు ధనికులకు మాత్రమే ఉంటాయని బోధించాం. ఇన్నాళ్ళూ ధన వంతులే మరింత ధనం ఎందుకు కూడబెడుతున్నారో, దరిద్రులు శాశ్వతంగా ఎందుకు అలా ఉండిపోతున్నారో పాఠాలు చెప్పలేకపోయాం. బాగుపడ్డానికి అవకాశం వున్నా, రోజూ ఇంటిల్లిపాదీ డబ్బు సంపా దిస్తున్నా కనీసం వుండడానికి ఇల్లు ఎందుకు కట్టుకోలేకపోయాం? అనే ఆలో చన ఎందుకు రావడంలేదు? కార్మికుల్ని మనం చెయ్యవలసినంత చైతన్యవంతం చెయ్యలేకపోతున్నాం. బాధ్యతలు నేర్పలేక పోతున్నాం"

చెన్నకేశవులు ఎదురుదాడికి బ్రహ్మయ్యా బిత్తరపోయాడు. తేరుకుని "దానికి ఎవరేం చేస్తారండీ. మనం జీతాలు పెంచ మని పోరాటం చేస్తాం. సౌకర్యాలు కల్పిం చడం కోసం యాజమాన్యాలతో ఘర్షణ పడతాం. ఇక వాళ్ళ ఇళ్ళల్లో విషయాలు గూడా ఎంతకని పట్టించుకోగలం?" అన్నాడు.

"ప్రతి ఇంటికెళ్ళి పట్టించుకోమనడం లేదు. ప్రతివాడూ ఇంటి వ్యవహారాలలో గూడా బాధ్యతగా ప్రవర్తించమని చెప్పడం తప్పుకాదే. భార్యాపిల్లల్ని సరిగా చూసుకో మనీ, పిల్లల్ని చదివించమనీ, తల్లిదం డ్రుల్ని పోషించమనీ, సంపాదించిన దానిలో కొంత పొదుపు చెయ్యమనీ చెప్పడం గూడా మన విధి. విలువైన డబ్బుని, చెమటోడ్చి సంపాదించిన దానిని తాగుడికి తగలేస్తూ దరిద్రంలోకి కూరుకు పోతున్నవాళ్ళని చూస్తూ వూరుకుం టున్నాం. అందుకే ఇప్పుడు ఇలాంటి స్థలం కోసం ప్రభుత్వాన్ని దేబిరించాల్సిన పరిస్థితి వచ్చింది"

"దేబిరించడం ఏమిటి? అది హక్కు?"

"మరి హక్కు అన్నారే గాని మీరు ఎవ రికైనా స్థలాలు ఇప్పించారా? మీరు మీ యూనియన్ కార్యవర్గం సభ్యులు ఇళ్ళు వాకిళ్ళు సంపాదించుకున్నారుగా? మీ పిల్లల్ని డాక్టర్లు, ఇంజినీర్లు చదివిస్తున్నా రుగా! మాలా మీరూ బాగుపడండని కార్మి కులకు మీరెప్పుడైనా బోధించారా?"

"మీరు పర్సనల్ విషయాలు మాట్లాడు తున్నారు. ఎవడి ఖర్మ వాడిది!" అని బ్రహ్మయ్య కోపంగా మాట్లాడాడు.

మొత్తానికి చర్చలు విఫలమయ్యాయి. శ్రీనివాసులు నాయుడు పేదల ఇళ్ళ పట్టాల వ్యవహారం సెటిల్ చెయ్యా లేకపోయాడు. ఇక బలాబలాలు తేల్చుకో వడమే మిగిలింది.

★ ★ ★

మనోరమకి చాలా సంతోషంగా ఉంది. తొమ్మిది నెలలు మోసి బిడ్డను కన్నప్పుడు కలిగే ఆనందంలాంటిది.. అసాధ్యమైన పని మొదలుపెట్టి పట్టుదలతో సాధ్యం చేసినప్పటి విజయానందం వంటిది ఆమెకు కలిగింది.

'రంగురాళ్ళు' నాటకం అచ్చుప్రతిని అపు రూపంగా చూసుకుంటోంది. తన చేతుల్లో పసిపాప బోసినవ్వులు నవ్వుతున్నట్లు అనుభూతి చెందుతోంది మనోరమ.

ఆమె కథలు అప్పుడప్పుడూ పత్రికలలో ప్రచురితమవుతున్నా, బహుమతులు అందుకున్నా, పుస్తక రూపంలో రాలేదు. ప్రముఖ చిత్రకారుడు వేసిన ముఖచిత్రంతో, అట్ట వెనుక ఆమె పంచ రంగుల ఫొటో చూసుకుని పొంగిపో యింది.

సత్యం ఇదే పనిమీద విజయవాడ వెళ్ళి వారం రోజులు కూర్చుని ప్రింట్ చేయించి తీసుకొచ్చాడు.

అతను ఆమె ఆనందించడాన్ని ఆస్వాదిస్తూ ఆమె ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు. ఆమె కళ్ళల్లో మెరుపులు గమనిస్తున్నాడు. మనిషి ఎన్ని కోట్లు సంపాదించినా, ఇటువంటి అనిర్వచనీయమైన ఆనందం, సంతృప్తి పొందలేడు కదా! అనుకున్నాడు.

"మీ కథలన్నిటినీ గూడా పుస్తకంగా వేస్తే బాగుంటుంది" అన్నాడు సత్యం.

"కథలా? ఎన్నో లేవు. అన్నీ కలిసి ఇరవైవరకూ వుండొచ్చు. అవి గూడా ఎక్కడెక్కడ వున్నాయో చూడాలి. కథ పడినప్పుడు చదివిస్తామని పత్రిక తీసుకెళ్ళారు. మళ్ళీ ఇవ్వరు. అలా కొన్ని మిస్సయ్యాయి'

'

"పోనీ కథలు అచ్చయిన డేట్లు వున్నా పత్రికా ఆఫీసులకెళ్ళి సేకరించుకోవచ్చు"

"చూద్దాంలెండి" అని నవ్వింది.

మనోరమ నవ్వినప్పుడు ఆమె పళ్ళు బైటపడి ముత్యాల్లా మెరుస్తుంటాయి. సత్యం తన్మయుడై చూస్తుంటాడు. ఆ దృశ్యం అతనికి ఆ తర్వాత గూడా పదే పదే గుర్తొస్తుంటుంది.

ఇంతలో సత్యం సెల్‌ఫోన్ మోగింది. మాట్లాడుతూనే అతని ముఖంలో ఆందోళన వ్యక్తమైంది.

"నేను అర్జెంటుగా వెళ్లాలి. ఘోరం జరిగిపోయింది" వణుకుతున్న కంఠంతో అన్నాడు సత్యం.

"ఏమైంది? "

"మా బావ తాగుడికి అడిక్ట్ అయ్యాడు. మా అక్కకి పద్నాలుగేళ్ల కూతురుంది. ఈయన తాగొచ్చి కన్న కూతురిమీదే అత్యాచారం చెయ్యబోయాడు. అప్పుడే ఇంట్లోకి వచ్చిన మా అక్క కోపం పట్టలేక కత్తిపీటతో వేటు వేసింది. చచ్చిపోయాడు"

"పీడా పోయింది. అటువంటి వాడు చావడమే మంచిది. మీ అక్క కుటుంబానికి విముక్తి కలిగింది" సీరియస్‌గా అన్నది.

"మా అక్క ఇప్పుడు పోలీసుల గురించి భయపడుతోంది"

"అది సహజమే. కన్నవాళ్ళ మీద దాడి జరుగుతున్నప్పుడు జంతువులైనా ఎదురు తిరుగుతాయి. ఆమె ఆత్మరక్షణ కోసం చేసింది. శిక్షపడే అవకాశం లేదు. నేను ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడతాను. మీరు వెళ్లండి" అన్నది మనోరమ.

సత్యం బయల్దేరాడు.

★ ★ ★

అంచుల రామయ్య హత్య కేసు ఎఫ్.ఐ.ఆర్. తయారుచేసి ఇన్‌స్పెక్టర్ ముందు పెట్టాడు రైటర్.

లాకప్ రూమ్‌లో నిలబడి వుంది సావిత్రి. ఆమె ముఖంలో దైన్యం తాండవిస్తోంది. ఏడ్చి ఏడ్చి ఆమె కళ్లల్లో కన్నీళ్లు ఇంకిపోయాయి. ఆమె కళ్లు శూన్యంలోకి చూస్తున్నట్లున్నాయి. లాకప్‌కి ఇవతల సత్యం నిలబడి వున్నాడు. ఆమెకు ధైర్యం చెప్తున్నాడు.

"నువ్వు భయపడకు అక్కా! నిన్ను కోర్టుకి తీసుకెళ్తారు. వారమో, పది రోజులో కస్టడీలో వుంచమంటాడు జడ్జి. తర్వాత నువ్వు బెయిల్‌మీద బైటకు వస్తావు. ఆ ఏర్పాట్లన్నీ నేను చేస్తాను గదా!" అన్నాడు సత్యం.

సావిత్రి తల వూపింది.

తర్వాత సత్యం ఇన్‌స్పెక్టర్ ముందుకు వచ్చి నిల్చున్నాడు. రంగూన్ రామారావు సత్యం వైపొకసారి చూశాడు.

"కూర్చోండి మిస్టర్ సత్యం" అన్నాడు కుర్చీ చూపుతూ.

సత్యం కూర్చున్నాడు.

"మనోరమ చెప్పింది కాబట్టి మీ సిస్టర్‌కి మావైపు నుంచి సహకారం వుంటుంది. పబ్లిక్ ప్రాసిక్యూటర్ మావాడే. మనకి అనుకూలంగానే వుంటాడు" అన్నాడు రంగూన్ రామారావు.

ఇన్‌స్పెక్టర్ కూల్‌గా, మర్యాదగా, ఓదార్పు మాటలు మాట్లాడుతూ వుండడం సత్యానికి ఆశ్చర్యంగా వుంది. మనోరమ చెప్పింది కాబట్టి అనడంలోనే అతని ఆంతర్యం అర్థమైంది. లేకపోతే ఆ ట్రీట్‌మెంట్ వేరేగా వుంటుంది. మనోరమకి ఇన్‌స్పెక్టర్ని ప్రభావితం చేయగల కెపాసిటీ వుందన్నమాట అనుకున్నాడు. అది ఏమై వుంటుందో ఊహించలేకపోయాడు.

**ప్రజాస్వామ్యం**
**మేడిపండు**
**పొట్ట విప్పి చూస్తే**
**అనువంశిక దండు**

*– పానుగోటి నరసింహారావు,*
*దుబ్బాక, నల్గొండ జిల్లా*



మనోరమ రచయిత్రి అయినంత మాత్రాన ఇన్‌స్పెక్టర్ ఎందుకు లెక్క చేస్తాడు? ఆమె విద్యాసంస్థల అధిపతి అయితే కావొచ్చు అందులో ఈయన పిల్లలు చదువుతున్నంత మాత్రాన ఆమె మాట వింటాడా?

మనోరమ చాలా కాన్ఫిడెంట్‌గా అనడం తనకు గుర్తొచ్చింది.

'ఇన్‌స్పెక్టర్‌కి నేను చెప్తాను. మీ సిస్టర్‌కి ఏమీ కాదు'.

ఆమెకు చాలా పలుకుబడి వుంది అని సత్యం అర్థం చేసుకున్నాడు. పోలీస్‌స్టేషన్‌కి వచ్చేముందు చాలా భయపడ్డాడు. చెన్నకేశవుల్ని తోడు తీసుకొద్దామనుకున్నాడు. అతను చాలా బిజీగా వుండి రావడానికి వీల్లేకుండా పోయింది. ధైర్యం కూడగట్టుకుని వచ్చాడు. ఇప్పుడు అతనికి టెన్షన్ తగ్గింది. ఇన్‌స్పెక్టర్ అనుకూలంగా వున్నాడు. సావిత్రి బైటపడినట్లే.

తను మనోరమ సమక్షంలో వున్నప్పుడు ఆ సంఘటన తాలూకు ఫోన్ రావడం, తను మనోరమకు చెప్పడం మేలైంది. అంతా యాదృచ్ఛికం.

చెన్నకేశవుల్ని తోడు తీసుకొచ్చి వుంటే అంతా వ్యతిరేకంగా వుండేది. ఘర్షణ వాతావరణం ఏర్పడేది. సావిత్ర బైటపడుతుందా లేదా? మర్డర్ కేసులో జీవిత శిక్ష పడుతుందా? మేనకోడలు పరిస్థితి ఏమిటి? అని టెన్షన్ పడాల్సి వచ్చేది. ఇప్పుడు అదంతా ఏమీ లేనందుకు వూపిరి పీల్చుకున్నాడు సత్యం.

"ఏమిటి వర్రీగా వున్నారు. మీ సిస్టర్‌కి ఏం కాదు" నవ్వుతూ అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అబ్బే అదేం లేదండీ. థాంక్యూ వెరీ మచ్" అని సెలవు తీసుకుని వెళ్లిపోయాడు సత్యం.

ఇన్‌స్పెక్టర్ నవ్వుకున్నాడు. అతని ముఖం ప్రశాంతంగా వుంది. తెగని సమస్యకు పరిష్కారం లభించినట్లు హాయిగా వుంది.

పొట్లూరి శ్రీనివాసులు నాయుడికి ఫోన్ చేశాడు.

"నమస్కారం ఎమ్మెల్యేగారూ!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నమస్తే! ఏంది రామారావ్? అపోజిషనోళ్ళు గాంధీపార్కులో మీటింగ్ పెడుతున్నారంటగా? "

"పెట్టనీయండి. మనకేంటి? "

"చెన్నకేశవులు పక్కలో బల్లెంలా తయారయ్యాడే. ఆ పోరంబోకు స్థలం ఖాళీ చేయించడం గురించి ఏం ఆలోచించావు. నేను కలెక్టర్‌తో గూడా మాట్లాడాను.

తొందరపడకండి అంటున్నాడు."

"ఆయన అన్నది నిజమే. ఇప్పుడు మన చేతిలో బ్రహ్మాస్త్రం వుంది. అవసరమున్నప్పుడు వాడుకోవడమే. దాన్నుంచి చెన్నకేశవులు తప్పించుకోలేడు"

"ఏందబ్బా అంత లావు బ్రహ్మాస్త్రం?"

"చెన్నకేశవులు పెద్దమ్మ కూతురు మొగుణ్ణి చంపి మా లాకప్‌లో వుంది" అని పక పక నవ్వాడు రంగూన్ రామారావు.




మునికొండ గాంధీ పార్క్‌లో అఖిల పక్ష నాయకులు స్టేజీ మీద కూర్చున్నారు. చెన్నకేశవులు గ్రానైట్ వర్కర్స్‌కి, ఇంకా బీదవారికి పక్కా ఇళ్లు కట్టించాల్సిన అవసరం గురించి ఉపన్యాసం ఇచ్చాడు. సభకి చింతలపాటి చెంచు రామారెడ్డి అధ్యక్షత వహించాడు. పక్కా ఇళ్ల కోసం గ్రానైట్ కంపెనీలన్నీ కార్పస్ ఫండ్ ఏర్పాటుచేశాయనీ, ప్రభుత్వం స్థలం ఇస్తే చాలనీ, దానికి గూడా స్థానిక ఎమ్మెల్యే అడ్డుపడుతున్నాడనీ, తన తమ్ముడు భాగస్వామిగా ఉన్న మధుసూదన్ ఇంటర్నేషనల్ కంపెనీకి ఆ భూమి చౌకగా కట్టపెట్టాలని చూస్తున్నాడనీ, దాన్ని అడ్డుకుని పేదలకు పట్టాలు సాధించాలనీ, అందుకు వర్కర్స్ అంతా చెన్నకేశవులు నాయకత్వాన్ని బలపరచాలనీ అధ్యక్షోపన్యాసం చేశాడు.

అఖిలపక్ష నాయకులంతా ఉపన్యాసాలు చేశారు. తర్వాత ఆడిటోరియమ్‌లో నాయకులు, కార్యకర్తల కోసం సత్యం బృందంతో 'రంగురాళ్లు' నాటకం ప్రదర్శించారు.

రంగురాళ్లు నాటకం రచయిత్రి మనోరమకు సన్మానం చేశారు. ఆమె కృతజ్ఞతలు తెలిపింది. మనం ఎంత డబ్బు సంపాదించినా భారతీయ సంస్కృతి మరువరాదనీ, మానవ సంబంధాలను, విలువలను కాపాడుకోవాలనీ చెప్పింది.

★ ★ ★

సావిత్రిని ఇరవై రోజులు కస్టడీలో ఉంచమని ఆర్డర్ ఇచ్చాడు జడ్జి. సత్యం బెయిల్ పిటిషన్ వేయించాడు క్రిమినల్ లాయర్ పల్నాటి గోపాలకృష్ణతో.

మర్నాడే చెన్నకేశవులు ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించబోతున్నాడు. మెయిన్‌రోడ్డులో యం. ఆర్. ఒ. ఆఫీసు ఎదురుగా షామియానాలు వేశారు.

ఆ రాత్రి ఇన్‌స్పెక్టర్ దగ్గర్నుంచి సత్యానికి పిలుపు వచ్చింది. క్లబ్బులో కలుసుకోమని కానిస్టేబుల్‌తో కబురు చేశాడు.

సత్యం వెళ్లేసరికి ఇన్‌స్పెక్టర్ అతని కోసం ఎదురు చూస్తున్నాడు.

వెన్నెల వెలుగులో, పచ్చగడ్డి మీద దూర దూరంగా టేబుళ్లు, కుర్చీలు వేశారు. కబుర్లు చెప్పుకుంటూ అంతా డ్రింక్ చేస్తున్నారు. వాళ్లకి కావాల్సిన డ్రింక్స్, ఆహార పదార్థాలు సప్లయి చేస్తూ హడావుడిగా వున్నారు క్లబ్ సిబ్బంది. అక్కడ వాతావరణం ఆహ్లాదకరంగా వుంది.

సత్యం, రంగూన్ రామారావుతో కరచాలనం చేసి కూర్చున్నాడు. చుట్టూ చూశాడు. లాన్ చుట్టూ పెద్ద పెద్ద చెట్లు, నడినెత్తిన చందమామ వెలుగు, చల్లటిగాలి శరీరానికి తగులుతుంటే అతనికి అద్భుతమైన అనుభూతి కలిగింది. డ్రింక్ మొదలయ్యాక శరీరం గాలిలో తేలిపోతున్నట్లు,



స్వర్గంలో విహరిస్తున్నట్లు అనిర్వచనీయ మైన ఆనందం కలిగింది.

ఇన్‌స్పెక్టర్ ఇప్పుడు లాల్చీ పైజామాలో వున్నాడు. పెద్దపులి చారలపై తెల్లరంగు పులుముకుని వచ్చినట్లుంది. అతను తనను ఎందుకు పిలిపించాడోనని వూహిం చడానికి ప్రయత్నిస్తున్నాడు. సాధారణంగా ఇటువంటి కేసుల్లో ఇరుక్కున్నప్పుడు సహాయపడడానికి డబ్బు డిమాండ్ చేస్తుం టారు. అందుకే పిలిచాడా? ఎంత అడు గుతాడు?

"నేను ఇప్పుడు మిమ్మల్నొక మాట అడు గుతాను. మొహమాటపడకుండా నిజం చెప్పాలి" అని నవ్వాడు రంగూన్ రామా రావు.

"అడగండి" అన్నాడు సత్యం అదేమై వుంటుందా అని ఆలోచిస్తూ.

"మీరు మనోరమను పెళ్లిచేసుకోవాలను కుంటున్నారా?" ప్రశ్నించాడు రంగూన్ రామారావు.

సత్యం వులిక్కిపడ్డాడు. అతని ముఖం లోకి ఆశ్చర్యంగా చూశాడు. ఆకాశంలో

వున్న చందమామ మీకు కావాలా? అని అడిగినట్లుంది. ఎక్కడ మనోరమ? తను ఎక్కడ? ఇతను అనుకోకుండా ఇప్పుడు మనోరమ ప్రస్తావన ఎందుకు తెచ్చినట్లు? అందులోనూ పెళ్లి గురించి. కలలో కూడా తను వూహించలేని విషయం.

"భలేవారే!" అని నవ్వాడు సత్యం.

"మీరు మొహమాట పడుతున్నారు. నిజం చెప్పడం లేదు"

"మనోరమ గురించి మీరు ఎందుకు అడుగుతున్నారో నాకు అర్థం కావడం లేదు."

రంగూన్ రామారావు నవ్వాడు.

"మునికొండలో మాకు తెలియని విషయాలు వుండవు. మనోరమతో మీరు సన్నిహితంగా మెలుగుతున్నారు. ఆమె ఎవరినీ ఇంటికి రానివ్వదు. మీరు యధేచ్ఛగా వెళ్తున్నారు. మీరు ఆమెతో కలిసి నెల్లూరు వెళ్లివచ్చారు కూడా!" అన్నాడు.

"నిజమే. ఆమె ఒక రచయిత్రి. నేను డైరెక్టర్ని. ఆమె రాసిన నాటకం ప్రదర్శించడానికి వెళ్లాం. పరిషత్తులో ఆమె రచనకు ప్రైజ్ వచ్చింది. అది తీసుకోవడానికి వచ్చింది. మీకు తెలుసు ఈ మధ్య 'రంగురాళ్లు' అనే నాటకం ఇక్కడ ఆడిటోరియంలో వేశారు. ఆమెకు సన్మానం చేశాం. ఆ నాటకం రాయడంలో, అంటే కథలో డ్రమెటైజ్ చెయ్యడంలో ఆమె నా సహకారం కోరారు. అందుకే ఆమెను తరచుగా కలుసుకోవడం జరిగింది. ఆమె రైటర్. నేను డైరెక్టర్. అంతకుమించి ఏమీ లేదు" అన్నాడు సత్యం.

"నేను మిమ్మల్ని సంజాయిషీ అడగడం లేదు." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మరి ఎందుకు ఇవన్నీ ప్రస్తావిస్తున్నారు?"

"నేను అడిగింది ఆమెను మీరు పెళ్లిచేసుకోవడానికి ఇష్టపడుతున్నారా? ఎందుకంటే ఆమె ఇంతవరకు ఏ మగాడితో ఇంత సన్నిహితంగా మెలగలేదు. మీలో ఆమెకు ఏవో నచ్చి వుండాలి. ఆమె గతం మీకు తెలుసా?"

సత్యం తల అడ్డంగా వూపాడు.

"మనోరమ పెద్దలు కుదిర్చిన వివాహం చేసుకుంది. భర్త డాక్టర్ నారాయణస్వామి, అతను చాలా బిజీగా వుండేవాడు. స్వంత నర్సింగ్ హోమ్ వుంది. ఎప్పుడూ డబ్బు సంపాదనే. సంసారం చెయ్యడానికి కూడా తీరిక వుండేది కాదు. మనోరమ కాలేజీలో లెక్చరర్. ఆమె భావు కురాలు. ఇద్దరికీ పొసగలేదు. ఘర్షణ పడుతూ వుండేవారు. ఎడమొఖం, పెడమొఖం. అతను తన నర్సింగ్ హోమ్‌లో ఒక లేడీడాక్టర్‌తో సంబంధం పెట్టుకున్నాడు. నీ వృత్తి వేరు. నాది వేరు. అనవసరంగా నిన్ను పెళ్లి చేసుకున్నాను. నేను ఒక డాక్టర్ని పెళ్లి చేసుకుని వుండాల్సింది అంటూ ఆమెను గాయపరుస్తుండేవాడు. ఆమె సహించలేక పుట్టింటికి వచ్చేసింది. ఉద్యోగం కూడా మానేసింది. అప్పుడు మునికొండలో గ్రానైట్ క్వారీలు మొదలయ్యాయి. జనాభా పెరుగుతున్నారు. ఆమె ఇక్కడ స్కూల్ మొదలుపెట్టింది. ఇక్కడ సెటిలైంది" చెప్పాడు రంగూన్ రామారావు.

"మనోరమ డాక్టర్‌కి విడాకులివ్వలేదా?"

"అతనే ఈమెకు విడాకుల నోటీసు పంపించాడు. మనోరమ ఒప్పుకుంది. ఆ విధంగా విడిపోయి ఒంటరిగా జీవిస్తోంది. ఇప్పుడు ఫరవాలేదు కాని ముందు ముందు తోడులేని లోటు బాధిస్తుంది కదా?" అన్నాడు రామారావు.

సత్యం తలవూపాడు.

"ఆమె డాక్టర్‌ని పెళ్లి చేసుకుంది. అతను ఇంటలెక్చువల్ కంపానియన్ కాలేకపోయాడు. అందుకే విడిపోయారు. ఆ

లోటు ఇప్పుడు మీ ద్వారా తీరుతోందను కుంటాను" అన్నాడు.

సత్యం ఆశ్చర్యంగా చూశాడు రామా రావు ముఖంలోకి. అతని మాటలు సత్యా నికి పసందుగా వున్నాయి. మనసు మత్తులో తేలిపోతోంది.

మనోరమ పక్కన నిల్చునే అర్హత తన కుందా? ఆమె విద్యాసంస్థల యజమాని, పైగా రచయిత్రి. దివి నుండి భువికి దిగి వచ్చిన దేవలోకపు కాంత. లక్ష్మి, సరస్వతి, రతీదేవిల అంశతో జన్మించినట్లు కనిపి స్తుంది ఆమెను చూస్తూంటే. ఆమె పక్కన తను బాడీగార్డులా వుంటాడు. లేదా బంట్రోతులా వుంటాడు అనుకున్నాడు.

తన ఊహకి నవ్వొచ్చింది.

"ఏమిటి నవ్వుతున్నారు? "

"ఏం లేదు" అని ఖాళీగ్లాసులో కొంచెం సోడా పోసుకున్నాడు.

"అదేంటి ఒట్టి సోడా పోసుకున్నారు? విస్కీ లేకుండా" అని తను విస్కీ సీసా ఎత్తి అందులో పోశాడు రంగూన్ రామా రావు.

"ఇక చాలండీ. నేను రెండు పెగ్గుల కంటే ఎక్కువ తీసుకోను. పైగా బైక్ నడ పాలి గూడా"

"బైక్ క్లబ్బులో వుంచి మా బండిలో వెళ్లండి. రేపు బైక్ తీసుకోవచ్చు"

"అంత అవసరం వుండదులెండి. నేను ఓవర్ డ్రింక్ చేసి వెళ్తే మా అమ్మగూడా గొడవ పెడుతుంది. ఇప్పటికే పెళ్లి పెళ్లి అని రోజూ పోరుపెడుతున్నది. తాగుడు ధ్యాసలో పడి పెళ్లి మానుకుంటున్నానని గొడవ."

"నిజమే గదా! ఆమె వయసైపోయింది. కోడలు రావాలనుకోవడం సహజమే."

"నాకు ఒక విషయం అర్థం కావడం లేదు. అడుగుతాను. ఏమనుకోకండి"

"ఇందులో అనుకోవడానికి ఏమీలేదు. ఈ సమయంలోనేగదా మనసులో మాటలు చెప్పుకునేది" అని నవ్వాడు రామారావు.

"మనోరమ పెళ్లి విషయంలో మీకు ఆసక్తి ఎందుకు? " అడిగాడు సత్యం.

"మనోరమ జీవితం సాఫీగా సాగేలా చూడాల్సిన బాధ్యత కూడా నాకుంది"

"అంటే? "

"మనోరమ నా తోడబుట్టిన చెల్లెలు"

సత్యం ఆశ్చర్యపోయాడు.

"నిజమా? ఇన్నేళ్ల నుంచి నాకీ విషయం తెలీదే. ఆమె కూడా ఎప్పుడూ అనలేదు" అన్నాడు.

చాలామందికి తెలియదు. మనోరమ గూడా గోప్యత పాటిస్తుంది. తెలిసిన దగ్గ ర్నుంచి మీ అన్నగారికి ఈకేసు గురించి చెప్పండి, ఆ కేసు విషయంలో హెల్ప్ చెయ్యండి అని మొహమాట పెట్టేస్తుం టారు. నాకు గూడా ఇబ్బందిగా వుం టుంది. ఇన్నేళ్లలో మా మనోరమ మీ అక్క కేసు గురించే నాకు చెప్పింది. దాన్ని బట్టి అర్థం చేసుకోండి. ఆమెకు మీ మీద ఎంత అభిమానం వుందో? " అన్నాడు రంగూన్ రామారావు.

"అభిమానం వుందనుకోండి. కాని అది నన్ను భర్తగా స్వీకరించేంత కాదేమో? " సందేహం వ్యక్తపరిచాడు సత్యం.

"ఆమెకు భర్త కాగలిగిన అర్హత మీకుం దని నేను నమ్ముతున్నాను. స్టేటస్ విష యంలో ఆమెతో సరితూగరు. నిజమే. ఆమెకు కావాల్సింది తన భర్త పెద్ద ఆఫీ సర్ అనో, బిజినెస్ ఎగ్జిక్యూటివ్ అనో కాదు. ఆమె సామాన్య గృహిణి కానేకాదు. ఆమె రచయిత్రి. ఆమెకు కావాల్సింది తన భావాలతో ఏకీభవించే తోడు. ఇంటలెక్చు వల్ కంపేనియన్. అందుకే ఎన్నడూ ఏ మగాడితోనూ లేనిది మీతో సన్నిహితంగా మెలుగుతోంది."




## ఏప్రిల్-09
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.




1. **వి. శ్రవణ్‌కుమార్** - కొత్తవాడ, వరంగల్ జిల్లా
2. **నెక్కంటి సత్యప్రసూన** - డాబా గార్డెన్స్, విశాఖపట్నం
3. **బి. శ్రీలలిత** - పటమట, విజయవాడ
4. **వసంత మురళీమోహన్** - కమలానగర్, అనంతపురం
5. **ఎస్.బి.డాలీదేవి** - సఫిల్‌గూడ, సికింద్రాబాద్

### సరైన జవాబులు

1. పాండురంగ 2. టీచర్ 3. రంగమణి 4. దేవి 5. స్విట్జర్లాండ్ 6. ప్రకాశ్‌పడుకొనె 7. గారిబాల్డి 8. షైనీ 9.భారతి 10. రామాయణదర్శనం

"కాని...!"

"ఏమిటి మీ సందేహం. ఆమెతో పెళ్లి జరిపించే బాధ్యత నాది."

"అది సరే...!"

"ఇంకేమిటి? మనోరమ మీకంటే వయసులో పెద్దది ఔనా? నాకు తెలుసు. ఈ రోజుల్లో అది ఏమంత పెద్దవిషయం కాదు"

తల వూపాడు సత్యం.

"ఆలోచించుకోండి. ఇప్పుడు సత్యం అంటే ట్రాన్స్‌పోర్టు కంపెనీలో వుద్యోగి. నాటకాలు వేసే మనిషి. అదే మనోరమ మీ భార్య అయితే సోషల్ స్టేటస్ మారిపోతుంది. ప్రముఖ విద్యాసంస్థల యజమాని అవుతారు. మేము గూడా బావగారూ అని గౌరవిస్తాం."

రంగూన్ రామారావు మాటలకు రబ్బరు బెలూన్ మాదిరి వుబ్బిపోయాడు సత్యం. విస్కీగ్లాసు ఎత్తి గడగడ తాగేశాడు.

"మనోరమను పెళ్లి చేసుకోవడం నాకు ఇష్టమేనండీ" అన్నాడు సత్యం.

ఆ మాటలు అంటుంటే అతని ముఖం సిగ్గుతో ఎర్రబడింది. ఆకాశమంత పందిరి, భూలోకమంత అరుగుమీద తన పెళ్లి మనోరమతో జరుగుతున్న దృశ్యం కళ్ల ముందు పంచరంగుల్లో కనిపించసాగింది.

'తనంత అదృష్టవంతుడు ఈ ప్రపంచంలోనే లేడు' అనుకున్నాడు.

"అయితే మీరు నాకు పూర్తి సహకారం ఇవ్వాలి. ఈరోజు నుంచి మీరు మా కుటుంబ సభ్యుల్లా మెలగాలి" అన్నాడు రామారావు.

"మనోరమను అపురూపంగా చూసుకుంటాను" తన్మయత్వంలో మునిగిపోతూ అన్నాడు సత్యం.

"ఆ విషయం కాదు. నాకు సహకారం ఇవ్వమని అడుగుతున్నాను"

"మీకు నేను ఎటువంటి సహకారం ఇవ్వగలను? "

"మీ అన్నయ్య చెన్నకేశవులు ఆమరణ నిరాహారదీక్ష భగ్నం చెయ్యడంలో నాకు

సహాయం చెయ్యాలి. లేకపోతే నేను చాలా చిక్కుల్లో పడిపోతాను. బహుశా నన్ను సస్పెండ్ చెయ్యొచ్చు. లేదా దూర ప్రాంతాలకు ట్రాన్స్‌ఫర్ చెయ్యొచ్చు" సీరియస్‌గా చెప్పాడు రంగూన్ రామారావు.

సత్యం గుండె గుభేలుమంది.

రంగూన్ రామారావు వెళ్లిపోతే? తన పెళ్లి మనోరమతో జరుగుతుందా? ఇక ఆ విషయం ప్రస్తావించడేమో? మూటా ముల్లె కట్టుకుని వెళ్లిపోతాడు. అదీగాక అతను తన సహాయం కోరుతున్నాడు. తను అన్నయ్యకు నచ్చచెప్పి ఆమరణ నిరాహార దీక్ష ఆపించగలడా? అది జరిగే పని కాదు.

సత్యం డీలా పడిపోయాడు. తను మనోరమని పెళ్లి చేసుకోవడానికి, చెన్నకేశవులి ఆమరణ నిరాహార దీక్షకు ముడిపెట్టిన రామారావు మీద కోపం ముంచుకొచ్చింది. అసలు దానికీ, దీనికీ ఏం సంబంధం?

"మా అన్నయ్య నిస్వార్థ జీవి. ఇతరుల కోసం ప్రాణం ఇస్తాడు. బంధుత్వంతో అతన్ని శాసించలేం. నా మాట విని ఆమరణ నిరాహారదీక్ష మానుకుంటాడని మీరెలా అనుకున్నారు? " అడిగాడు సత్యం.

రంగూన్ రామారావు పక పక నవ్వాడు.

"నేనంత తెలివితక్కువ వాడిలా కనిపిస్తున్నానా? " అన్నాడు.

సత్యం నోరు తెరిచాడు.

"మీరు యూనియన్ కార్యవర్గంలో ప్రముఖ పాత్రలో వున్నారు కదా? "

"అవును. అన్నయ్య ప్రెసిడెంట్. నేను జాయింట్ సెక్రటరీ. యూనియన్ కార్యకలాపాలలో నేను సహకారం అందిస్తుంటాను."

"రేపు మొదలు కాబోయే ఆమరణ నిరాహార దీక్ష శిబిరంలో మీరు ప్రముఖ పాత్ర వహిస్తారు"

"అవును."

"మీరు చెయ్యవలసింది చాలా సింపుల్" అని నవ్వాడు.

ఆమరణ నిరాహారదీక్ష శిబిరంలో సత్యం నిర్వహించవలసిన కీలకపాత్ర ఏమిటో రంగూన్ రామారావు చెప్పాడు.

సత్యం ఆలోచనలో పడిపోయాడు. దానివల్ల ఎవరికీ నష్టం జరగదు కదా! చెన్నకేశవులి ఆమరణ నిరాహారదీక్ష భగ్నమవుతుంది. అంతేగా? అతన్ని అరెస్ట్‌చేసి హాస్పటల్‌కి తీసుకెళ్లి ట్రీట్‌మెంట్ ఇస్తారు. అది మామూలే. తను ఇన్‌స్పెక్టర్‌కి సహకారం ఇవ్వక తప్పదు. అక్కను కేసులో నుంచి బైట పడెయ్యాలి. రెండోది తనకు మనోరమతో పెళ్లి. తనకు ఇన్‌స్పెక్టర్ సహాయ సహకారాలు చాలా అవసరం.

"ఏమిటి ఆలోచిస్తున్నారు? " అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఏంలేదు. మీరు సూచించిన విధంగా జరుగుతుంది" అన్నాడు సత్యం.

ఇన్‌స్పెక్టర్ ముఖం ఆనందంతో వెలిగిపోయింది. చిరునవ్వు నవ్వాడు. అతని నోరు పులి నోరులా విచ్చుకుని ఎర్రగా కనిపిస్తోంది.

★ ★ ★

పేదలకు ఇంటి పట్టాల కోసం చెన్నకేశవులు చేపట్టిన ఆమరణ నిరాహార దీక్ష నాలుగవ రోజుకి చేరుకుంది. అతనికి మద్దతుగా ప్రతి రోజూ కొందరు రిలే నిరాహార దీక్షలు చేస్తున్నారు.

ఆ రోజు ఆదివారం. శిబిరం సందడిగా వుంది. గ్రానైట్ వర్కర్లు ఎక్కువ సంఖ్యలో చేరుకున్నారు. ధర్నాలు, రాస్తా రోకోలు మొదలయ్యాయి.

చెన్నకేశవులు ఆరోగ్యం క్షీణిస్తోంది.

డాక్టర్లు ఆరోగ్యాన్ని చెక్ చేసి వెళ్తున్నారు.

స్థానిక ఎమ్మెల్యే పొట్లూరి శ్రీనివాసులునాయుడు నిరాహార దీక్షా శిబిరాన్ని సందర్శిస్తున్నట్లు తెలిసింది. ఎమ్మెల్యేకు వ్యతిరేకంగా ర్యాలీ నిర్వహించాలని ఏర్పాటు చేసుకున్నారు. అసలు శిబిరం లోకే రానివ్వకూడదన్నారు.

ఆ రోజు ఏదో పెద్ద గొడవ జరుగుతుందని పోలీసు బలగాలను బైట నుంచి గూడా రప్పించారు. ఎమ్.ఆర్.ఒ. ఆఫీసు చుట్టుపక్కల పోలీసులు తుపాకులతో మొహరించారు.

"ఎమ్మెల్యేగారు వస్తున్నారట" సత్యం, చెన్నకేశవులు పక్కనే కూర్చుని చెప్పాడు.

"వస్తే రానీ" అన్నాడు చెన్నకేశవులు.

"ఎందుకు రావడం? పోరంబోకులో పట్టాలు ఇవ్వకుండా అడ్డం పడుతున్నది ఆయనేగా? " అని ఆగ్రహం వ్యక్తం చేశాడు సత్యం.

"ఆ సంగతి మన వాళ్ళందరికీ తెలుసు"

"మరి వచ్చి ఏం చెప్తాడు? గిల్లి జోల పాట పాడడం ఎందుకు? " అన్నాడు సత్యం.

"రాజకీయ నాయకులు అంతేగా? " అని పేలవంగా నవ్వాడు చెన్నకేశవులు.

శిబిరం బైట కలకలం చెలరేగింది. సత్యం శిబిరం బైటకు వచ్చాడు.

దూరంగా ఎమ్మెల్యే ప్రయాణిస్తున్న లాన్సర్ కారు ఆగింది. అందులో నుంచి దిగాడు ఎమ్మెల్యే.

"ఎమ్యెల్యే శ్రీనివాసులునాయుడు జిందాబాద్" అని ఆయన అనుచరులు కేకలు పెట్టారు.

అందుకు ప్రతిగా "ఎమ్మెల్యే డౌన్ డౌన్"

"ఎమ్యెల్యే నిరంకుశత్వం నశించాలి"

"పోరంబోకులో ఇళ్లకు పట్టాలు ఇవ్వాలి" అని శిబిరం దగ్గర చుట్టూ పోగైన వర్కర్లు స్లోగన్లు ఇచ్చుకుంటూ ఎదురువెళ్లారు.

"గో బ్యాక్. ఎమ్మెల్యే గోబ్యాక్."

"కార్మిక వ్యతిరేకి శ్రీనివాసులు నాయుడు ముర్దాబాద్"

కేకలు వేసుకుంటూ ముందుకు వెళ్తున్నారు వర్కర్స్. అటు నుంచి ఎమ్మెల్యే, అతని అనుచరులు వస్తున్నారు.

పోలీసులు మధ్యలోకి వచ్చారు.

"సార్! మీరు ఆ శిబిరం దగ్గరకు వెళ్లొద్దు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు.

"ఎందుకు వెళ్లొద్దు? " సీరియస్‌గా అడిగాడు ఎమ్మెల్యే.

"అక్కడంతా మీకు వ్యతిరేకంగా వుంది. చూస్తున్నారుగా! వాళ్లంతా కోపంగా వున్నారు. పోరంబోకు భూమి వాళ్లకు ఇవ్వకుండా అడ్డం పడుతున్నది మీరే అని ఆగ్రహంగా వున్నారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నేనెందుకు అడ్డం పడుతున్నాను. ఆ పోరంబోకు మధుసూదన్ కంపెనీకి గవర్నమెంట్ అమ్మింది. మధ్యలో నేను అడ్డు పడింది ఏముంది? ఎవరికో అమ్మిన స్థలం ఇవ్వమని వాళ్లే మొండి పట్టు పడుతున్నారు. వేరేచోట ఇవ్వడానికి ప్రభుత్వం సిద్ధంగా వుంది. అందుకు ఒప్పుకోమని నచ్చ చెప్పడానికి నేను వెళ్లాలి" అన్నాడు ఎమ్మెల్యే.

"అది నిజమే సార్! గొడవలు జరిగే ఛాన్స్ ఎందుకివ్వాలి మీరు? " అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఎమ్మెల్యేకి కోపం ముంచుకొచ్చింది.

"ఏందయ్యా నువ్వు మాట్లాడేది? గొడవలు జరుగుతాయని నన్ను వెళ్లొద్దంటావా? అవతల ఒక లీడర్ నిరాహారదీక్ష చేస్తున్నాడు. మనం చూస్తూ వూరుకుంటే ప్రాణాపాయం జరుగుతుంది. అప్పుడు ఇంకా పెద్ద గొడవలు జరిగే ఛాన్సుంది" అన్నాడు.

"యస్సార్" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు బిక్కముఖం పెట్టి.

"ఆ ఎదురు వచ్చేవాళ్లని తరిమికొట్టు. లాఠీచార్జి చెయ్యి. అయ్యో! బాబూ! అంటే వెళ్తారా!" అన్నాడు ఎమ్మెల్యే.

"మీరు కొంచెం ఆగండి సార్! వాళ్లను దూరంగా వెళ్లనియ్యండి" అన్నాడు పక్కనే ఉన్న యం.ఆర్.ఒ.

"సరే! ఇక్కడే నిలబడతాను. ఇదుగో ఇప్పుడే చెప్తున్నా. నేను అతన్ని పరామర్శించి రావాలి. వాళ్లు అడ్డుకుంటే వెనక్కి పోయాడని రేపు పేపర్లో రాకూడదు. మనకు ప్రిస్టేజీ ఇష్యూ" అన్నాడు ఎమ్మెల్యే.

యం.ఆర్.ఒ. తల ఊపాడు.

"అవసరమైతే గాలిలోకి కాల్పులు జరపమను. పొగ బాంబులు వేయించు. అందుకు నువ్వు ఆర్డర్స్ ఇవ్వు ఇన్‌స్పెక్టర్‌కి" అన్నాడు ఎమ్మెల్యే.

వర్కర్స్ స్లోగన్స్ ఇస్తూ ముందుకు దూసుకుని వస్తున్నారు. దగ్గరకు వస్తున్నారు. నినాదాలు మిన్నుముట్టాయి.

"చార్జ్" అని కేకపెట్టాడు ఇన్‌స్పెక్టర్.

పోలీసులు లాఠీలు తీసుకుని వర్కర్స్‌పై విరుచుకుపడ్డారు. అంతా వెనక్కి తిరిగి పరిగెత్తారు. శిబిరం చుట్టూ చేరారు. అక్కడ్నుంచే నినాదాలు చేస్తున్నారు.

పోలీసులు వెనక్కి వచ్చి ఎమ్మెల్యేకి రక్షణగా నిలబడ్డారు. అక్కడ యుద్ధ వాతావరణం ఏర్పడింది.

ఉన్నట్టుండి సత్యం అరిచాడు.

"ఎమ్మెల్యే ఇక్కడకు రాకూడదు. తరిమికొడదాం" అంటూ రోడ్డు పక్కన కుప్పగా ఉన్న కంకరరాళ్లు తీసుకొని పోలీసులవైపు విసిరాడు.

ఇక అంతే! జనం పూనకం వచ్చిన వాళ్లలా రాళ్లు తీసుకొని విసరసాగారు. పోలీసులకు దెబ్బలు తగులుతున్నాయి. కొందరి తలలు పగిలి నెత్తురు చిమ్మింది. అందులో ఇన్‌స్పెక్టర్ రంగూన్ రామారావు తలకి రాయి తగిలింది. తల పగిలి నెత్తురు కారుతుంటే చేత్తో అదిమి పట్టుకున్నాడు.

అతనికి అంతులేని ఆగ్రహం కలిగింది.

"ఫైర్...!" అని పెద్దగా అరిచాడు.

పోలీసుల చేతుల్లో గన్స్ పేలుతున్నాయి. జనం హాహాకారాలు చేస్తున్నారు. అరుపులు కేకలు మిన్నుముట్టాయి. ఏడుపులు పెడబొబ్బలు వినిపిస్తున్నాయి. అంతా పారిపోతున్నారు. కొందరు పడిపోతున్నారు. బులెట్ తగిలిన వాళ్లు విలవిలలాడుతున్నారు. పిట్టల్లా రాలుతున్నారు.

టివి కెమేరాల్లో అదంతా చాటునుంచి చిత్రీకరిస్తున్నారు కెమేరావాళ్లు. వెనక్కి పారిపోతూ, ఎడ్లబళ్లు చాటున నిలబడి, పోలీసుల వెనక్కి వచ్చి వారు కవరేజ్ చేస్తున్నారు.

కొంతసేపటి తర్వాత ఇరవై నాలుగు గంటల న్యూస్ టెలికాస్ట్ చేసే ఛానల్స్‌లో ఫ్లాష్ న్యూస్ మొదలైంది.

"మునికొండలో భూపోరాటం చేస్తున్న పేదలపై పోలీసు కాల్పులు"

"ఇళ్ల పట్టాల కోసం నిరాహార దీక్ష చేస్తున్న శిబిరం దగ్గరకి వెళ్లడానికి ఎమ్మెల్యే శ్రీనివాసనాయుడు ప్రయత్నం. అడ్డుకున్న వర్కర్స్."

"ఆమరణ నిరాహార దీక్ష చేస్తున్న యూనియన్ నాయకుడు చెన్నకేశవులు మరణం."

"పోలీస్ కాల్పుల్లో మరొక ఇరవైమంది చనిపోయారని ప్రాథమిక అంచనా"

యాంకర్ పోలీసుల కాల్పులు గురించి చెప్తోంది. తర్వాత కాల్పులు జరుగుతున్న దృశ్యాలు తెరమీద కనిపిస్తున్నాయి.

మునికొండ పేరు ప్రపంచవ్యాప్తంగా మారుమోగిపోతోంది. ©

# రాజకీయం

## చతుర కత

'అనిల్ గారూ! మిమ్మల్ని ఆఫీసర్ గారు రమ్మంటున్నారు. ఎమ్.ఎల్.ఎ. గారొచ్చారు. ఏదో ఫైలు కావాలట" ఆత్రుతగా చెప్పిన అటెండరు మాట విని, ఆఫీసరు గదిలోకి అడుగుపెట్టాడు అనిల్.

అడుగు లోపల పడిందో లేదో "ఏమయ్యా అనిల్! ఎమ్మెల్యేగారి ఫైలు ఏం చేశావ్? వీరి పని అర్జంటుగా పూర్తిచేయాలి. నోట్ పెట్టు" అంటూ గద్దించాడు ఆఫీసర్.

"సారీ సార్! నా వల్ల కాదు" స్థిరంగా చెప్పాడు అనిల్.

"ఏం? "

"అది వారికనుకూలంగా రాసి, పేద ప్రజలకు అన్యాయం చేయలేను కాబట్టి"

ఆ మాట విన్న ఎమ్మెల్యే అనిల్ వంక కోపంగా చూశాడు. ఆఫీసరు అదిరిపోయాడు. అసలే ఈ ఎమ్మెల్యే తక్కువవాడు కాదు. ఒక మర్డర్ కేసులో శిక్ష కూడా అనుభవించాడు. ప్రస్తుతం ఏడెనిమిది క్రిమినల్ కేసులు విచారణలో ఉన్నాయి. ఏం కొంప మునుగుతుందోనని భయపడ్డాడు.

"నేను చెబుతున్నాను చెయ్. ఒబే ది ఆర్డర్స్" ఆఫీసరు దబాయింపు.

"మీరు ఎంత దబాయించినా, పాలకపక్షం ఎమ్మెల్యేగారైన మీరు చెప్పినా ఆ పని చేయడానికి వీలుకాదు సార్"

"నేనెవరో తెలిసే ఆ సమాధానం చెబుతున్నావా? నిన్నేం చేస్తానో తెలుసా? " హూంకరించాడు ఎమ్మెల్యే.

"ఏం చేస్తారండీ! మీరేమీ చేయలేరు. నా తల తీయలేరు. నా ఉద్యోగం ఊడబెరకలేరు"

"అంతేనా? "

"కాకపోతే ఏం చేయగలరండీ? రూలింగ్ పార్టీవారు, పలుకుబడి, పరపతి ఉన్నవారు గాబట్టి ఈ చివర వున్న చిత్తూరు నుంచి లేపి ఆ చివర వున్న శ్రీకాకుళం జిల్లాలో వేయించగలరు. అంతకు మించి మీరేమీ చేయలేరు. దానికి నేనేం భయపడి పాంటు తడుపుకోను. మీరేం చేస్తారో చేసుకోండి" నిర్భయంగా అన్నాడు అనిల్.

"అలాగా? ఏమీ చేయలేనా? చూస్తాను, నువ్విక్కడెలా ఉద్యోగం చేస్తావో చూస్తాను. నువ్వనుకున్నట్టే పది రోజుల్లోపల నిన్ను శ్రీకాకుళం నక్సలైట్ ఏరియాలో అడవులు పట్టించకపోతే నేను నా ఎమ్మెల్యేగిరీకే రాజీనామా చేస్తాను. చూసుకో" కోపంతో ఊగిపోతూ లేచి కారెక్కి వెళ్ళిపోయాడు ఎమ్మెల్యే.

కచ్చితంగా పదకొండో రోజు ఉదయాన్నే పళ్ళ బుట్టతో తన ఇంట్లో ప్రత్యక్షమైన అనిల్ ని చూసి



ఆశ్చర్యపోయాడు ఎమ్మెల్యే.

"థ్యాంక్యూ సార్! మీ మేలు జన్మలో మరచిపోలేను. ఎన్నాళ్ళుగానో మా వూరికి దూరంగా ఈ చిత్తూరు జిల్లాలో నానా అవస్థలూ పడుతున్నాను. అటు రాజకీయ పలుకుబడిగాని, డబ్బుగాని ఏది ఉపయోగించినా ఫలితం లేకపోయింది. మీ దయవల్ల నా సొంత జిల్లా శ్రీకాకుళానికి ట్రాన్స్‌ఫర్ అయింది. మిమ్మల్నిలా రెచ్చగొట్టినందుకు క్షమించాలి. మామూలుగా అడిగితే 'చూద్దాం, చేద్దాం' అంటారు. అందుకే ఈ రూట్లో వచ్చాను. పనైపోయింది. అంతేసార్!" అంటూ వినయంగా నమస్కరించాడు అనిల్.

"భలేవాడివయ్యా! మేమే రాజకీయాల్లో ఆడుకుంటుంటే మమ్మల్ని మించిపోయింది గదయ్యా నీ రాజకీయం. భేష్, సైకాస్త్రావ్" అంటూ అనిల్ భుజం తట్టాడు ఎమ్మెల్యే.

—అయినాల కనకరత్నాచారి





# కాలాతీతం

# ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్

ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్ నవలలోని కథానాయకుడు డాక్టర్ ప్రిమ్‌రోజ్ (వికార్) తన గురించి ఇలా చెప్పుకుంటాడు.

"జనాభా పెంచటం ఎలాగ? అని శుష్క ప్రసంగాలు చేసే రాజకీయ నాయకుల కన్నా, పెళ్లిచేసుకుని, పిల్లల్ని కన్న నిజాయితీపరులే దేశానికెక్కువ మేలు చేస్తున్నారు. పారిష్‌లో అందరికీ ఆదర్శంగా ఉండాలని, నేను కూడా వయసు మించకముందే పెళ్లి చేసుకుని ఆరుగురు పిల్లల్ని కన్నాను. మా పెద్దవాడి పేరు జార్జి. వీలునామాలో మా పేర పదివేల పౌండ్లు రాసి స్వర్గస్థుడైన వాడి అంకుల్ పేరే పెట్టాం. ఆ తర్వాత అలీవియా, సోఫియా, మోజెస్ పుట్టారు. పన్నెండేళ్ల విరామం తర్వాత మరో ఇద్దరు మగపిల్లలు కలిగారు. నా భార్య డెబోరా అంత అనుకూలవతి ఈ లోకంలోనే మరొకరుండరని నమ్ముతాను. మా సంసారం స్వర్గమే. వయసుతోపాటు మా మధ్య అనురాగం కూడా పెరిగింది. అలీవియాకిప్పుడు పద్దెనిమిదేళ్లు. ఈ చుట్టుపక్కల అంత అందగత్తె లేదంటారు. ఆక్స్‌ఫర్డ్‌లో జార్జి చదువుతున్నాడు. మోజెస్‌ను వ్యాపారంలో ప్రవేశపెట్టాలని ఆలోచిస్తున్నాను.

కాలేజీ చదువు ముగించిన మా పెద్దోడు నా మిత్రుని కూతురు అరాబెల్లా విల్మాట్‌ను పెళ్లిచేసుకోవాలనుకున్నాడు. ఆమె తండ్రి విల్మాట్‌కు కూడా నాలాగే చర్చితో సంబంధాలున్నాయి. అంతో ఇంతో రాసే



అలవాటున్న నేను విల్మాట్‌కు ఏకపత్నీ వ్యవస్థ అత్యుత్తమమైనదని ఒక వ్యాసం రాసి చూపించాను. ఇంకేముంది? మిన్ను విరిగి మీద పడినంత ఘోరం సంభవించింది. వివాహాన్ని గురించి ఆయన అభిప్రాయాలు భిన్నం. ముఖ్యంగా నైతిక విలువలకు ప్రాధాన్యమిచ్చే ప్రీస్టులైనా ఒకే వివాహానికి పరిమితం కావాలని నా అభిప్రాయం. కాని ఆయనకిప్పుడు నాలుగో భార్య. అప్పటిదాకా ఎంతో ఆత్మీయంగా ఉన్న వ్యక్తి ఆ క్షణంనుండీ నన్ను పరమ శత్రువుగా భావించాడు. నా జీవితంలోంచి ఏటా ముప్పైనాలుగు పౌన్లు అనాథల కోసం ఖర్చు చేస్తాను. మిగిలిందేమన్నా ఉంటే ఓ షావుకారు వద్ద దాచుకుంటాను. గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు ఇప్పుడా పెద్దమనిషి ఊరు విడిచి పారిపోయాడు. చేతిలో చిల్లిగవ్వలేదు. సంసారం గడిచేదెట్లా?

అదే సమయంలో తన కూతుర్ని మా అబ్బాయికిచ్చేది లేదని తేల్చేశాడు విల్మాట్. ఆదాయం లేకుండా ఇక్కడ ఉండటం వీలుపడదు. డెబ్బైమైళ్ళ దూరంలో ఇరవై ఎకరాల పొలం కౌలుకు తీసుకున్నాను. నా వెంట ఉంటే మనోవ్యథతో మరింత కుంగిపోతాడని, మా పెద్దవాడిని లండన్ పంపించాను. అక్కడేదో ఒక పని దొరక్కపోదు.

మా భూస్వామి స్క్వైర్ థార్న్‌హిల్ ఒకనాడు మా ఇంటికి వస్తానని కబురంపించాడు. అంతటి సంపన్నుడు మా ఆతిథ్యం స్వీకరిస్తానన్నందుకు మా ఆవిడ ఆనందానికి అవధుల్లేవు. స్క్వైర్ యువకుడూ, అందగాడూ. అతడి అంకుల్ సర్ విలియం థార్న్‌హిల్ దివాళా తీసి ఎక్కడికో వెళ్ళిపోయాడు. అతని ఆస్తి కూడా ప్రస్తుతం స్క్వైర్ అధీనంలోనే వుంది.

"ఎలా ఉన్నాడే అబ్బాయి?" అంటూ ఆరా తీసింది మా ఆవిడ.




"సంస్కారవంతుడిలాగే కనిపించాడు. అతడికి తెలియని విషయం లేదు. దేని గురించయినా అనర్గళంగా ఉపన్యసిస్తాడు" అంది సోఫియా.

"నాకు నచ్చలేదు" అంటూ మూతి విరిచింది ఒలీవియా.

తమకు నచ్చిన వ్యక్తుల గురించి ఆడపిల్లలు ఇష్టం లేనట్టుగానే నటిస్తారని సరిపెట్టుకున్నాను.

ఆ తర్వాత ఒకసారి థార్న్‌హిల్ సేవకుడు, 'ఇది మా అయ్యగారి బహుమానం' అంటూ జింక మాంసం తెచ్చాడు.

ఏదో సాకుతో భూస్వామి తరచూ ఇంటికి వస్తూనే ఉన్నాడు.

ఒలీవియాకు మంచి వరుడు దొరికితే నాకూ సంతోషమే. ఈలోగా ఒకసారి ప్రమాదవశాత్తు నీళ్లలో పడినప్పుడు, మిస్టర్ బర్చెల్ దాన్ని రక్షించాడు. ఈ బర్చెల్ గురించి నాకెక్కువగా తెలియదు. మనిషి మంచివాడే కాని, 'పూర్ జెంటిల్మన్' అంటారతణ్ణి. కృతజ్ఞతగా మేమతణ్ణి తరచూ భోజనానికి ఆహ్వానిస్తుంటాం.

బర్చెల్ ఎప్పుడు ఇంటికి వచ్చినా వ్యవసాయ పనుల్లో సాయం చేస్తాడు. అయితేనేం? పేద ఆడపిల్లలకు పేదకుర్రాళ్ల నచ్చరు.

ఓనాడు థార్న్‌హిల్ గౌరవార్థం మా

## ఆలివర్ గోల్డ్‌స్మిత్ (1728 - 1774)

గోల్డ్‌స్మిత్ జన్మస్థలం, పుట్టిన తేదీల గురించి భేదాభిప్రాయాలున్నాయి. 1728 లేదా 1730లో పుట్టి వుంటాడు. తండ్రి ఆంగ్లికన్ క్యూరేట్. డబ్లిన్(ఐర్లాండ్)లోని ట్రినిటీ కాలేజీలో బాచిలర్ డిగ్రీ తీసుకున్న ఆలివర్, యూనివర్సిటీ ఆఫ్ ఎడిన్‌బరోలో వైద్యాశాస్త్రం కూడా అభ్యసించాడు. లండన్‌లో స్థిరపడి, డబ్బుకోసం చవకబారు రచనలనేకం చేశాడు. ఆ కాలంలోనే డాక్టర్ సామ్యుయెల్ జాన్సన్‌తో పరిచయమేర్పడింది. జూదం, మద్యం కారణంగా జీవితమంతా అప్పుల వూబిలో కూరుకుపోయిన ఈ రచయిత 'ది క్లబ్'(లండన్‌లోని రచయితల, మేధావుల చర్చా వేదిక) వ్యవస్థాపక సభ్యుల్లో ఒకడు. ఈయన నాటకాలు ది గుడ్ నేచర్డ్‌మాన్ (1768), షి స్టూప్స్ టు కాంకర్(1771) ఇప్పటికీ ప్రదర్శిస్తూనే వున్నారు. అలాగే పిల్లలకథ 'ది హిస్టరీ ఆఫ్ లిటిల్ గుడీ టూ షూస్' తెలియని ఇంగ్లీషు బాలలుండరు. గోల్డ్ స్మిత్ సమకాలీన బ్రిటిష్ సమాజం మీద చేసిన అధిక్షేప వ్యాఖ్యలు, (చైనా యాత్రికుడు లియోన్‌చి రాసిన వూహా లేఖల రూపంలో), 'ది సిటిజన్ ఆఫ్ ది వరల్డ్'గా ఆ రోజుల్లో సంచలనం సృష్టించాయి.

'ది వికార్ ఆఫ్ ది వేక్‌ఫీల్డ్' వెలుగు చూడటానికి కారణం డాక్టర్ జాన్‌సన్. ఆయన మాటల్లోనే, "కష్టాల్లో వున్నాను. ఆదుకొమ్మని ఓ ఉదయం గోల్డ్‌స్మిత్ నుంచి సందేశం వచ్చింది. మొదట ఒక గినీ పంపించి, కాసేపటికి నేనూ బయల్దేరాను. అద్దె ఇవ్వనందుకు ఇంటి యజమానురాలు అతణ్ణి అరెస్టు చేయించింది. గినీ మార్చుకుని మద్యం తెచ్చుకున్నాడు గోల్డ్‌స్మిత్. ఈ సమస్యకు పరిష్కారం ఏమిటో తననే చూచించమన్నాను. ఒక నవల ప్రచురణకు సిద్ధంగా ఉందని చెప్పాడు. అక్కడక్కడ చదివాను. అద్భుతంగా ఉంది. కాసేపట్లో వస్తానని చెప్పి, ఆ వ్రాతప్రతిని పబ్లిషర్‌కమ్మి అరవై పౌండ్లు తెచ్చాను".

"ఇంగ్లీష్ భాష ఉన్నంతకాలం ఈ నవలకు పాఠకాదరణ తగ్గదు" అని మెకాలే ప్రశంసలు పొందిన 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' 1766లో అచ్చయింది.

తరువాతి తరాల రచయితలనేకులను ప్రభావితం చేసింది ఈ నవల. మేరీషెల్లీ 'ఫ్రాంకెన్‌స్టీన్'; గోథే 'ది సారోస్ ఆఫ్ యంగ్‌వెర్టర్'; చార్లొట్ బ్రాంటీ 'ది ప్రొఫెసర్', 'విల్లెట్'; డికెన్స్ 'ఎ టేల్ ఆఫ్ టూ సిటీస్', ఇతర నవలల్లో దీని ప్రస్తావన వస్తుంది.

★ ★ ★

ఇంట్లో విందు ఏర్పాటు చేశాం. వెంట మరో ఇద్దరు మిత్రుల్ని కూడా తీసుకొచ్చాడతడు. భోజనాలు చేసినంతసేపూ వాళ్ల చూపులు మా అమ్మాయిల మీదే ఉన్నాయి. ఆ ఆకతాయితనం నాకు నచ్చలేదు. భూస్వాములకు కౌలుదార్లంటే అంత లోకువా?

ఇక బర్కెల్ మా ఇంటికి వచ్చినప్పుడల్లా ఒక్కడే నలుగురి పనిచేస్తాడు. కాని ఇంత కాయకష్టం చేసేవాడు తన పిల్లలకు తగిన వరుడు కాలేడనుకుంటుంది మా ఆవిడ.

థార్న్‌హిల్ ఒక సాయంత్రం పార్టీ ఇచ్చాడు. మరికొందరు యువతీయువకులు కూడా వచ్చారు. పాటలు పాడారు. "అలీవియాను సంతోషపెట్టడానికి సగం ఆస్తి ఇస్తాను" అంటూ నావైపు చూశాడు భూస్వామి. ధనమదంతో అతడెంత దిగజారాడో అప్పుడర్థమైంది నాకు.

మా అమ్మాయిలిద్దరూ అందగత్తెలు, విద్యావంతులు కూడా. ఈ కుగ్రామంలో ప్రతిభకు గుర్తింపు దొరకదు. వాళ్లను లండన్ పంపాలన్న మా ఆవిడ సలహా నాకూ నచ్చింది. అక్కడ తగిన వరులు

దొరికే అవకాశముంటుంది.

మేం పిల్లల ప్రయాణాలకు సన్నాహాలు చేస్తున్నప్పుడే థార్న్‌హిల్ మాకో సందేశం పంపించాడు. నన్ను ఆకాశానికెత్తేసి నా పరిచయంతో తన జన్మ ధన్యమైందని దాని సారాంశం. అయితే ఆ మధ్యాహ్నమే మా ఇంటికి వచ్చిన బర్కెల్, 'పొగడ్తలను నమ్మవద్దంటూ' హెచ్చరించాడు.

"థార్న్‌హిల్‌ను చూసి కుళ్లి చస్తున్నాడు" అంటూ విసుక్కుంది మా ఆవిడ. ఇలాంటి అసూయాపరుడు ఇంటికి రావటం ఆవిడ కిష్టం లేదు.

భూస్వామి తరచుగా రావటం చూసి ఇరుగుపొరుగు చెవులు కొరుకున్నారు. "అలీవియాను పెళ్లి చేసుకుంటానని అతడు బహిరంగంగా చెప్పేస్తే మనకు కూడా గౌరవంగా ఉంటుంది" అంది మా ఆవిడ.

"కాస్త ఓపిక పట్టు" అన్నాన్నేను.

ఆ తర్వాత రెండు రోజులకు, మా అబ్బాయి డిక్ పరిగెత్తుకుంటూ వచ్చి శరాఘాతంలాంటి వార్త చేరవేశాడు.

"అక్కను ఇద్దరు వ్యక్తులు గుర్రబ్బండీలో తీసికెళ్లారు. ఒకడు దాన్ని ముద్దు పెట్టుకున్నాడు"

ఈ నీచానికొడిగొట్టేది థార్న్‌హిల్ అనటంలో సందేహంలేదు. వాడి అంతు చూడాల్సిందేనని కోపంతో రగిలిపోతూ పిస్టల్స్ తీసుకుని బయల్దేరాను. తొందర పడవద్దంటూ వారించింది మా ఆవిడ.

"దీనికి కారణం థార్న్‌హిల్ అనే ఎందుకనుకుంటున్నారు? బర్కెల్ కూడా కావచ్చుగా" అన్నాడొక మిత్రుడు. ఎవరైనా సరే పరిస్థితి చేజారకముందే నా కూతుర్ని కాపాడాలి.

ఆ గుర్రబ్బండి వెళ్లిన దారిలో రెండు గంటలు నడిచి విశ్రాంతి కోసం ఆగినప్పుడు నాటక కంపెనీ వాహనమొకటి కనిపించింది. ఆ రంగంలో నేను కూడా కొంత కృషిచేశాను. నటీనటులతో ముచ్చటిస్తూ రాత్రికి ఒక సత్రంలో బస చేశాను. మాకు ఆతిథ్యం ఇచ్చిన వాళ్ళే చక్కటి విందు ఏర్పాటు చేశారు.

ఆ తర్వాత మేమంతా సరదాగా రాజకీయాల గురించి చర్చించుకుంటున్నప్పుడు ఓ యువతి వచ్చి నన్ను పలకరించింది. నా ఆశ్చర్యానికి అంతులేదు. ఆ పిల్ల మరెవరో కాదు, మా జార్జి పెళ్లి చేసుకోవాలనుకున్న అరాబెల్లా విల్మాట్. అక్కడే మరికొన్నాళ్లుండమని బలవంతపెట్టాడు కంపెనీ యజమాని. మరునాడు నేను నాటక ప్రదర్శనకు వెళ్లినప్పుడు అక్కడ 'హొరేషియో' వేషం వేసిన నటుడు మా అబ్బాయి జార్జి అని గుర్తుపట్టాను. కాని వాడు నన్ను గుర్తించనట్టే నటించాడు.

రెండు రోజుల తర్వాత థార్న్‌హిల్ కూడా వచ్చి చేరాడు. అలీవియా కోసం నేను వెదుకుతున్నానని తెలిసి ఆశ్చర్యపడ్డాడు. అది ఎవరి వెంట వెళ్లిందో తెలియదట. మా అబ్బాయి జార్జి ఉద్యోగ ప్రయత్నాల్లో ఉన్నాడని తెలిసి సహాయం చేస్తానన్నాడు.

ఆ తర్వాత అలీవియా అన్వేషణలో నేను మరో ఇరవైఅయిదు మైళ్లు ప్రయాణం చేసి రాత్రికి ఒకరింట్లో తల దాచుకున్నాను. అక్కడ ఇంటి యజమానురాలు ఒక యువతిని నిర్దాక్షిణ్యంగా తూలనాడడం విని, గది వెలుపలికి వచ్చి చూద్దును గదా, ఆ పిల్ల మరెవరో కాదు.. నా కూతురు అలీవియా! 'నేను నీతిమాలిన దాన్ని కాను. నాకు పెళ్లయింది. నా భర్త స్క్వైర్ థార్న్‌హిల్' అంటూ రోదిస్తున్నది. దాన్ని అక్కున చేర్చుకుని జరిగిన కథంతా సవివరంగా తెలుసుకున్నాను. ఒక ప్రీస్ట్ ఇద్దరికి వివాహం జరిపించాడు. కాని చట్టప్రకారం అది చెల్లదు. థార్న్

హిల్ ఇప్పటికే ఏడెనిమిదిసార్లు ఇలాంటి పెళ్లిళ్లు చేసుకున్నాడట! అమాయకులైన ఎంతమంది ఆడపిల్లల్ని ఇలా దగా చేస్తాడు ఆ దుర్మార్గుడు! వీడి నయవంచనకు బుట్టలో పడిన యువతులందరూ తర్వాత తిరస్కృతులై వేశ్యా గృహాలకు చేరుకున్నారు. నా కూతురు తనను బందీ చేసిన ముష్కరుల్ని ఎదిరించి పారిపోయి ఇక్కడికి వచ్చింది!

అలీవియాను తీసుకుని సంతోషంగా ఇల్లు చేరాను. కాని దురదృష్టం నన్ను వెంటాడుతున్నది. అగ్నిప్రమాదంలో ఇల్లంతా కాలిపోయింది. నేను దాచుకున్న కొద్ది డబ్బూ, వస్తువులూ బూడిదైనా, భార్యాపిల్లలు మాత్రం క్షేమంగా ఉన్నారు. ఈ ఆనందమైనా నాకు మిగిల్చినందుకు భగవంతునికి కృతజ్ఞతలు చెప్పుకొన్నాను. తిరిగి వచ్చిన అలీవియాను చూసి నా భార్య సంతోషించలేదు. స్త్రీల తప్పులను, పురుషులు క్షమించినంత సులభంగా సాటి స్త్రీలు క్షమించరు.

అలీవియా తనని ధిక్కరించినందుకు, మేకవన్నెపులిలాంటి తన నైజాన్ని బహిర్గతం చేసినందుకు థార్న్‌హిల్ నా మీద పగబట్టాడు. కౌలు చెల్లించటం లేదనీ, తన వద్ద కొన్న పశువులకు డబ్బు బాకీ పడ్డాననీ నా మీద ఫిర్యాదు చేశాడు. కోర్టు అమీన్ వచ్చి, నన్ను అరెస్టు చేసి జైలుకు తరలించాడు. అలీవియా తనకు తలవంపులు తెచ్చింది గనక పరిహారంగా, అరాబెల్లా విల్మాట్‌తో పెళ్లి జరిపిస్తే, నన్ను విడుదల చేయిస్తానని చెప్పాడు. నా భార్య కూడా చాలా ఒత్తిడి చేసింది. కాని నా స్వార్థం కోసం ఆడపిల్లల జీవితాలు నాశనం చెయ్యనా? ససేమిరా కాదన్నాను.

జైల్లో ఉన్నప్పుడే పిడుగులాంటి మరో వార్త విన్నాను. అలీవియా మరణించిందట!

నా కష్టాలకు అంతులేదు. నా అంతటి దురదృష్టవంతుడైన తండ్రి మరొకడుండడు. జైలు నిర్బంధం సరిపోదన్నట్టుగా మా రెండో అమ్మాయి సోఫియానెవరో అపహరించారని తెలిసింది. ఏం చెయ్యగలను? ఒంటరిగా కుమిలిపోవటం తప్ప. ఒకనాడు నా జైలు గదిలోకి మరో యువకుడు ప్రవేశించాడు. వాడెవరనుకున్నారు? మా అబ్బాయి జార్జి! మాకు చేసిన అన్యాయాలకు థార్న్‌హిల్‌ను ద్వంద్వయుద్ధానికి ఛాలెంజి చేశాడట. ధనబలంతో వాడు, మావాణ్ణి అరెస్టు చేయించాడు.

మరికొన్నాళ్లకు మోజెస్ తీపి కబురందించాడు. సోఫియాను బర్కెల్ రక్షించాడట. జైలు నుండి విడుదలై వచ్చాక విచారణలో మాకు అనేక కొత్త విషయాలు తెలిశాయి.

బర్కెల్ మరెవరో కాదు. థార్న్‌హిల్ వంచనకు గురైన అతని అంకుల్ సర్ విలియం థార్న్‌హిల్. స్క్వైర్ మోసాలు ఎండగట్టే ఉద్దేశంతో ఇన్నాళ్లూ అజ్ఞాతంగా ఉన్నాడు. జార్జి సహాయంతో తిరిగి తన ఆస్తి చేజిక్కించుకున్నాడు. అలీవియా నిజానికి మరణించలేదు. పాపానికి నిష్కృతిగా స్క్వైర్ దాన్ని వివాహం చేసుకున్నాడు. నా డబ్బులతో పలాయనం చిత్తగించిన షావుకారు తిరిగి వచ్చి, వడ్డీతో సహా వాపసు చేశాడు. జార్జికి అరాబెల్లాతో వివాహం జరిగింది. సోఫియా, సర్ విలియంను పెళ్లాడి లేడీ థార్న్‌హిల్‌గా మాకు కనువిందు చేసింది.

★ ★ ★

ఇంగ్లీష్ సాహితీప్రియులకు సుపరిచితమైన కవితలు ది హెర్మిట్, ఎడ్విన్ అండ్ ఏంజెలినా, ఎలెజీ ఆన్ ది డెత్ ఆఫ్ మ్యాడ్ డాగ్, వెన్ లవ్లీ ఉమెన్ స్టూప్స్ టు ఫాలీ ఈ నవలలోనివే.

–ఎం.వసంత



# గుజరాతీ కవికౌస్తుభం

# ఉమాశంకర్ జోషి

**పురాణేతిహాస కావ్యాదుల్లో ఘూర్జర దేశంగా ప్రస్తావితమైన గుజరాత్ ద్వారకాధీశుని పాద స్పర్శతో నాడు, మహాత్ముని జననంతో నేడు పునీతమైన సీమ. దేశ పశ్చిమాగ్రాన వున్న ఈ రాష్ట్రం భాష గుజరాతీకి హిందీతోనూ, రాజస్థానీతోనూ ఎక్కువ సంబంధముంది. ఇది పన్నెండో శతాబ్దిలో రూపుదిద్దుకున్నట్లు భాషావేత్తల భావన. నరసింహ మెహతా, మీరాబాయి, ప్రేమానంద్, సామల్‌భట్, దల్పత్‌రామ్, నానాశంకర్, రత్నాజి భట్ ప్రభృతులు గుజరాతీ సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. ఆధునికుల్లో వివిధ ప్రక్రియల్లో ఉత్తమ రచనలు చేసిన ఉమాశంకర్ జోషి అగ్రపంక్తిన నిలుస్తారు. కన్నడ కవిశేఖరుడు కె.వి.పుట్టప్ప, ఉమాశంకర్ జోషి 1967లో జ్ఞానపీఠ పురస్కారాన్ని సంయుక్తంగా అందుకోవడం వీరివురు సమస్కంధులైన ప్రతిభామూర్తులని నిరూపిస్తుంది.**

ఉమాశంకర్ జేఠాలాల్ జోషి గుజరాత్ రాష్ట్రంలోని సబర్‌కాంత్ జిల్లా బామణ గ్రామంలో 1911 జులై 21న జన్మించారు. సబర్‌కాంత్ ప్రకృతి సౌందర్యానికి పెట్టింది పేరు. అక్కడి వాగులు, కొండలు, వనాల శోభ జోషి పసి హృదయాన్ని పరవశింపజేసేది. స్వగ్రామంలో ప్రాథమిక స్థాయి విద్య తర్వాత అహ్మదాబాద్‌లో చదువు సాగించి మెట్రిక్యులేషన్ పరీక్ష ఉత్తీర్ణుడయ్యాడు. పదిహేడోయేట గుజరాత్ కళాశాలలో చేరాడు. సహజ సాహిత్యాభిమానానికి తోడు జోషికి పఠనాసక్తి మెండు. ఆ వయస్సులోనే కవితారచనకు ఉపక్రమించాడు. ప్రాచీన, ఆధునిక రచయితల కృతులను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. అద్భుత పద్యాలు వెలయించిన దల్పత్‌రామ్, సాహిత్యంలో కొత్త బాటలు పరచిన నర్మదాశంకర్, బృహన్నవలా రచనకు శ్రీకారం చుట్టిన త్రిపాఠి, గుజరాతీ కవిచక్రవర్తిగా పేరొందిన నానాలాల్, సరళశైలికి ప్రాధాన్యమిచ్చి సత్యాగ్రహన్ని విశదం చేసిన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ మొదలైనవారి రచనలు యువ జోషిపై ప్రభావం చూపాయి. గాంధీజీ నాయకత్వాన సాగుతున్న స్వాతంత్ర్యోద్యమానికి అన్ని




రంగాలవారు క్రియాశీలంగా స్పందిస్తున్న రోజులవి. చదువుమాని ఉమాశంకర్ ఉద్యమంలో పాల్గొని 1930లో జైలు శిక్ష అనుభవించాడు. ఆ కాలాన్ని సద్వినియోగం చేసుకుని పలు రచనలు

సృజించాడు. శిక్షపూర్తి అయిన తర్వాత గుజరాత్ విద్యాపీఠంలో చేరి ఉన్నత విద్య కొనసాగించాడు. విద్యా ప్రమాణాలకు, క్రమశిక్షణకు ఆ సంస్థ ప్రతిరూపం. అక్కడ గొప్ప దేశభక్తుడు, మేధావి కాకాసాహెబ్ కాలేల్కర్ మార్గదర్శనం జోషికి ఎంతగానో తోడ్పడింది. భావాలు పరిణతి చెందాయి. ఎల్ఫిన్‌స్టన్ కళాశాలలో చేరి బి.ఎ. పట్టా పొందాడు. పిమ్మట జోషి సంస్కృతం, గుజరాతీ భాషల్లో ఎం.ఎ. పట్టాలు కూడా స్వీకరించాడు. 1938లో గుజరాత్ విద్యాసభలో అధ్యాపక పదవి చేపట్టాడు. జ్యోత్స్నబెన్‌ను వివాహమాడాడు. 1954లో గుజరాత్ విశ్వవిద్యాలయం భాషా, సాహిత్యశాఖ సంచాలక బాధ్యతలు నిర్వహించాడు. 1966లో పూనా విశ్వవిద్యాలయ ఉపాధ్యాయ పదవి వరించింది.



ఉమాశంకర్‌జోషి విద్య, సాహిత్య రంగాలకు చేసిన సేవలు అసమానం. ఆయన భావుకుడు, ఛందస్సులో నిపుణుడు, భాషావేత్త, సృజనశీలి, దేశభక్తుడు, మానవతావాది, గేయ నిర్మాణంలో సిద్ధహస్తుడు. ఆయన శైలి రమణీయం. ఆయన కలం నుంచి జాలువారిన ఒక నవల, రెండు నాటకాలు, ఎనిమిది కవితా సంపుటాలు, నాలుగు కథాసంపుటాలు, రెండు అనువాదాలు, ఎనిమిది విమర్శన గ్రంథాలు, రెండు పరిశోధనాత్మక రచనలు ఆధునిక గుజరాతీ సాహిత్యానికి వెలలేని అలంకారాలుగా భాసిస్తున్నాయి. మహాత్ముడు ఆచరించి చూపిన అహింసా విధాన మహత్తర శక్తికి కావ్యాకృతి 'విశ్వశాంతి'. మానవీయ మూల్యాల మహనీయతను ఆవిష్కరించిన 'గంగోత్రి' కావ్యం రెండున్నర పదుల ప్రాయంలోనే జోషికి ఉన్నత సాహితీపురస్కారం చేకూర్చడం గమనార్హం. మహాప్రస్థాన్, నిశీథ్, ఆతిథ్య, వసంత్ వర్షా ఇత్యాది కావ్యాలు ఆయన రచనా పాటవానికి తార్కాణాలు. జోషి రచించిన నవల 'పారకాం జణ్యాం' గుజరాతీ భాషలో వచన మహాకావ్యంగా గుర్తింపు పొందింది. సంస్కృత నాటకాలను జోషి సాకల్యంగా అధ్యయనం చేశారు. నాటక కర్తగా 'సాప్ నాభీరా' ఏకాంకిల సంపుటి ఆయనకు మంచి ఖ్యాతిని చేకూర్చింది. పద్యరూపక సంపుటి 'ప్రాచీన'కు పురాణగాథలు ఆధారం. జోషి సమర్థుడైన విమర్శకుడు కూడా. 'శైవ ఆనే స్వరూప్', 'అభిరుచి', 'కలీనా సాధనా' తదితర రచనల్లో ఆయన విశ్లేషణ ప్రాభవం వ్యక్తమవుతుంది. ఆయన పరిశోధనా పటిమకు 'పురాణోమాం గుజరాత్' అద్దం పడుతుంది. సృజనాత్మక రచనలో ఎంత దక్షుడో జోషి అనువాద ప్రక్రియలో సహితం అంతటి దక్షత ప్రదర్శించారు. 'ఉత్తరరామచరితమ్', 'పిలసుద్ధీ' ఇందుకు నిదర్శనాలు.

జోషికి జ్ఞానపీఠ పురస్కారం అందించిన 'నిశీథ్' (అర్ధరాత్రి) 1939లో ప్రచురితమయింది. నాలుగు పదులైనా నిండని జోషి ఈ కృతిలో చూపిన భావపరిణతి సాహితీ లోకాన్ని అబ్బురపరచింది. ఇది 116 కవితా ఖండికల సంపుటి. ప్రతి పంక్తిలోనూ భావసౌష్ఠవం ప్రస్ఫుటమవుతుంది. ఆనాటి భారతదేశ స్థితిగతులతోపాటు, ప్రపంచ సంగ్రామానంతరం ప్రపంచదేశాల సంక్షుభిత మానవాళి మనోభావాల చిత్రణ కనిపిస్తుంది. వస్తువైవిధ్యం, శిల్పవైభవం, శబ్దచాలనం ప్రతి కవితను ఒక మణిపూసగా తీర్చిదిద్దాయి. 'దుఃఖరాశి అలరించినట్లుగా/సుఖసందోహం నన్ను సంతోషపెట్టడంలేదు' అంటూ ఒక కవితలో ఆనాటి వేదనామయ జగత్తును చిత్రించారు. ప్రకృతి, దేశభక్తి, ప్రజాస్వామ్యం, నియంతృత్వం, సంఘర్షణ, పీడితులు, మనిషి ఆకాంక్షలు, పతితులు, చరిత్ర, మానవీయత, ఆదర్శవాదం వంటి ఇతివృత్తాలను సమున్నత భావుకతతో చిత్రీకరించారు. ఆయన ఛందస్సులో రమణీయ ప్రయోగాలు చేశారు. గేయ ప్రక్రియను చక్కగా వాడుకున్నారు. 'నిశీథ్' గుజరాతీకే కాదు, భారతీయ సాహిత్యరంగానికే ఉత్కృష్ట భూషణం.

జోషి సాహిత్య అకాడమీ అధ్యక్షులుగా, లలిత కళా అకాడమీ సభ్యులుగా, గుజరాతీ సాహిత్యపరిషత్తు అధ్యక్షులుగా విశేషకృషి చేశారు. ఆయన అమెరికా, రష్యా, జపాన్, ఫ్రాన్సు, ఇటలీ, గ్రీసు, జర్మనీ మొదలైన దేశాలు సందర్శించారు.

సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు, నర్మదా సువర్ణచంద్రన్, రంజిత్‌రామ్ సువర్ణచంద్రన్ వంటి ప్రతిష్ఠాత్మక పురస్కారాలు అందుకున్నారు. ఉమాశంకర్‌జోషి 1988 డిసెంబరు 19న ముంబాయి నగరంలో పరమపదించారు.

– గోవిందరాజు రామకృష్ణారావు

# వీడని నీడ

టాంక్‌బండ్ 19 కథలు

ఎందుకో పదేపదే అతనే గుర్తొస్తున్నాడు. ట్యాంక్‌బండ్‌పై కూర్చుని ఇటు బిర్లామందిర్‌ను.. అటు సాగర్‌లోని తథాగతుడ్ని మార్చిమార్చి చూసినా మనసుకు ఊరట కలగడంలేదు. కళ్లముందే మెదుల్తున్నాడు. మధ్యాహ్నం లంచ్‌బాక్స్ తెచ్చుకోలేదని గ్రహించి అప్పటికప్పుడు బయటకువెళ్లి అరడజను అరటిపండ్లు తెచ్చి టేబుల్‌పై ఉంచాడతను. చిరాకుగా ఉండడంతో కనీసం వాటివంకైనా చూడలేదు నేను. సాయంత్రం ఆఫీసు నుంచి వస్తుంటే- 'మీరు ఇవ్వాళేం తినలేదు.. ఈ కొబ్బరినీళ్లయినా తాగండి' అంటూ గ్లాసు అందించబోతే కోపంగా చూసి వచ్చేశాను.

వచ్చానన్నమాటే గానీ పదేపదే అతని ముఖమే గుర్తొస్తోంది. పాతికేళ్లుగా నాకతను తెలుసు. అప్పటికీ ఇప్పటికీ ఒకటే తీరు! నన్ను చూస్తేచాలు అతని మొహం మతాబులా వెలిగిపోతుంది. సంతోషమంతా మొహంలో విరబూస్తుంది. మొదట్లో అతనలా చూడ్డం ఎబ్బెట్టుగా అన్పించినా తర్వాత అలవాటైపోయింది.

నిజం చెప్పాలంటే- అతనలా సంతోషపడిపోడానికి ఐశ్వర్యలా నేనేం భూలోకరంభను కాను. కాకపోతే చూడ్డానికి రూపురేఖలు రవంత బాగుంటాయని చుట్టపక్కాలు, తెలిసినవాళ్లు అంటారు. అంతెందుకు? మా ఆఫీసుకు నాకంటే బాగుండే అమ్మాయిలు ఎందరో తమ పనులమీద వస్తారు. వాళ్లను మా మగోద్యోగులు నోరు తెరుచుకుని చూడడం ఎన్నోసార్లు గమనించాను. అతను మాత్రం వాళ్లనసలు పట్టించుకోడు. నాలో అతన్నంత ఆకర్షించేది ఏంటో నాకిప్పటికీ తెలియదు..

ఇంతకీ అతనెవరోకాదు.. మా సుబ్రమణ్యాం. ఆఫీసులో ప్యూను! ఇద్దరం ఇంచుమించు ఒకేసారి చేరాం కనుక నా వయసే. మీ వయసెంతనకండి! ఆడవాళ్లను వయసడగరాదనీ, అడిగినా నిజం చెప్పరని తెలీదూ? కాకపోతే ఇప్పుడిద్దరికీ అక్కడక్కడా తలనెరిసింది..

సుబ్రమణ్యాం మహాభక్తుడు. సోమవారం శివాలయానికి, మంగళవారం ఆంజనేయుడి గుడికి, గురువారం బాబా ఆలయానికి, శనివారం బిర్లామందిర్‌కి వెళ్లొచ్చేవాడు. ప్రసాదం పంచడంలోనూ పక్షపాతమే. అందరికీ రెండు కొబ్బరి ముక్కలు పెడితే నాకు నాలుగు పెట్టేవాడు. ఏంటో ఈ పిచ్చి మాలోకం అనుకునేదాన్ని!

కొన్నేళ్లక్రితం నాటి మాట-

ఆఫీసుకు రాగానే మంచినీళ్లు తెచ్చిచ్చి 'మేడమ్.. నాకో చిన్న సాయం చేయరూ?' అని మెల్లగా అడిగాడు.

'ఏంటి సుబ్రమణ్యాం?' అన్నా మాములుగా.

'మా ఆవిడకి కలర్ టీవీ కావాలంట! నెలనెలా జీతంలో కట్ చేసుకుంటారు.. అయితే ఇద్దరి హామీ సంతకాలు కావాలంట! తమరో సంతకం పెడితే..'

అప్పటికే ఇలాంటి విషయాల్లో తలబొప్పి కట్టింది. అందుకే-

'సారీ సుబ్రమణ్యాం! నాకిలాంటివి నచ్చవు.. కావాలంటే దాని ఖరీదు పదిహేను వేలన్నావు కదా? నేనో రెండువేలిస్తా తీసుకో! తిరిగి ఇవ్వక్కర్లేదు కూడా'



అన్నాను.

రెండువేలతో పీడవిరగడ అవుతుంది. సంతకం పెడితే తర్వాత పదిహేనువేలూ తలకు చుట్టుకోవచ్చన్నది నాలోని ఆర్థికవేత్త మనసు.

ఆ మాటతో సుబ్రమణ్యం అదోలా అయిపోయాడు.. ఆ తర్వాత నాలుగురోజులకు స్వీట్ బాక్స్‌తో సంబరంగా వచ్చాడతను.

'ఏంటి స్పెషల్' అన్నాను.

'టీవీ కొన్నాను మేడమ్' అంటూ నా టేబుల్ మీద రెండు స్వీట్లు పెట్టి మిగిలిన స్టాఫ్‌కు ఇవ్వడానికి వెళ్లాడు.

ఛెళ్లున కొరడాతో చరిచినట్లయింది.

అప్పుడే పక్కాయన సుబ్బుకు మీరంటే ఎంతిదో చూశారా? స్వీట్స్ తెచ్చావ్.. పెట్ట వేంటోయ్ అంటే మేడమ్‌ను రానీయండి అన్నాడు తప్ప బాక్స్ తీయలేదు. కొంపతీసి మీరు డుమ్మాకొడితే ఇవ్వాళ మా నోట్లో కరక్కాయే' అన్నాడు నవ్వుతూ.

ఆశ్చర్యపోతూ సుబ్బు వైపు చూశాను. తమ టీవీ గురించి అకౌంటెంట్ సుబ్బారావుతో సంబరంగా చెబుతున్నాడు. హామీ సంతకాలు ఎవరు పెట్టారో తెలియదు. తర్వాత కూడా నేను అడగనూ లేదు, తను చెప్పనూ లేదు.

ఓసారి టైఫాయిడ్ వచ్చి నెలపాటు మంచం దిగలేదు నేను. ఆ రోజుల్లో వారానికి రెండుసార్లు ఇంటికొచ్చి కాసేపు కూర్చుని వెళ్లేవాడు సుబ్బు. వద్దంటున్నా




పండ్లు, కొబ్బరి బొండాలు తెచ్చేవాడు. మావాళ్లు అతని పరోక్షంలో 'నీ హను మంతుడు కన్పించడం లేదేమే?' అనేవాళ్లు సరదాగా.

ఒకరోజున సుబ్బు వచ్చి నా టేబుల్ దగ్గర నిలబడితే తలెత్తాను..

'మేడమ్ ఇవ్వాళ మా రోహిత్ బర్త్ డే! సాయంత్రం కేక్ కట్ చేస్తాడు. వచ్చి ఆశీర్వదించి వెళ్లండి మేడమ్! వెళ్లేదారే గనుక ఒక్క అయిదు నిముషాలు ఆటో దిగితే చాలు..'

'ఓకే అలాగే.. మన కొలీగ్స్ అంతా వస్తున్నారా?'

అతను తలొంచుకున్నాడు.

'అందర్నీ పిలిచే శక్తిలేదు మేడమ్. మిమ్మల్ని ఒక్కర్నే..'

చిరాకొచ్చింది.. కానీ పైకి చూపకుండా 'సారీ సుబ్బూ! మర్చేపోయాను. అమ్మను హాస్పిటల్ కు తీసుకెళ్లాలి. అపాయింట్ మెంట్ తీసుకున్నాను. మరెప్పుడైనా వస్తానేం?' అంటూ అప్పటికప్పుడు అబద్ధ మాడేశాను.

నిరాశగా వెళ్లిపోయాడతను. నిజానికి చేయగలిగి కూడా ఏ సాయమూ నేను చేయలేదతనికి. చివరికి డబ్బుతో పనిలేనిదైనా సరే!

కామెర్లొచ్చి ఆరువారాలు పడకేసినప్పుడు, యాక్సిడెంటై ఆస్పత్రి పాలైనప్పుడూ ఏ రోజునా వెళ్లి పరామర్శించాను కాను.

అలాగే కొడుకు ప్రతి పుట్టినరోజుకూ తను పిలిచినా ఏదో సాకుతో ఎగ్గొట్టేదాన్ని. అయినా తప్పుపట్టేవాడు కాదు. పైగా మర్నాడు కేకు ముక్కలు, చాక్‌లెట్లు తెచ్చి చ్చేవాడు.

హయత్‌నగర్‌లో నేను ప్లాట్ కొన్నప్పుడు దాని ఈసీ తేవడానికి, లింకు డాక్యుమెంట్లు తేవడానికి సుబ్బు ఎంత కష్టపడ్డాడో ఆ దేవుడికే తెలుసు. సైకిల్‌మీద సిటీ ఈ చివర నుంచి ఆ చివరకు ఎండలో కనీసం పదిసార్లయినా తిరిగుంటాడు. ఎలాగైతేనేం? సాధించుకొచ్చాడు. ఆ రోజు నాచేతి మీదుగా కాఫీ ఇస్తే 'అమృతంలా ఉంది మేడమ్' అని తాగేడు.

కొడుక్కు కిడ్నీజబ్బు వచ్చినప్పుడు 'మేడమ్ పెద్దాస్పత్రుల్లో చాలామంది మీకు తెలుసు.. ఎవరికైనా చెప్పి రోహిత్‌ను బతికించండి మేడమ్' అని గుడ్లనీళ్లు కుక్కుకుంటూ అడిగితే సరే అన్నాను తప్ప చెప్పలేదు.. కారణం ఆ హాస్పిటల్స్‌లో పనిచేసే నా ఫ్రెండ్సంతా డబ్బు మనుషులే! వాళ్లను అడిగి లేదనిపించుకోవడం ఎందుకు? అలాగని నేను పైసాకూడా ఇవ్వలేదు.. నిజానికి అతని మంచితనమే అతనికి పుత్రభిక్ష పెట్టింది. పుట్టపర్తిలో బాబా ఆస్పత్రిలో ఆ బాబుకు నయమైందట.

నిరాదరణ ఎంత దుర్భరమో నాకిప్పుడిప్పుడే తెలుస్తోంది.. ఆయన ఎప్పుడో పోయారు.. పిల్లలులేరు.. ఆర్థిక పరిస్థితికి ఢోకాలేదు.. పైగా మంచి ఉద్యోగం.. తప్పనిసరి పరిస్థితుల్లో అన్నదమ్ముల పంచన కాలక్షేపం చేస్తున్నాను. నా రూపాయినే నేను తింటున్నా వదినా మరదళ్ల మూతివిరుపులు.. పెడసరం మాటలు తప్పడం లేదు..

'మీ చెల్లికి ఇంతవయసు వచ్చింది పదారేళ్ల బాలాకుమారిలా ఆ నైలెక్స్ చీరలేంటి? ఏ ఖాదీవో కట్టుకోక?' అంటూ వదిన అన్నయ్యతో అనడం తనోసారి వింది. ముతక చీరలుకట్టి, డబ్బు మూటలుకట్టి వాళ్లకు నేనివ్వాలనేది మా ఆడపడుచుల అభిమతం మరి! వాళ్లపిల్లలూ అంతే! చిన్నప్పుడు 'అత్తా అత్తా' అంటూ కొంగుపట్టుకు తిరిగినవాళ్లు పెద్దవాళ్లయ్యాక అవసరమైతే తప్ప పిలిచినా పలకడంలేదు..

పొద్దునకి పొద్దున తమ్ముడి కొడుకు సుహాస్ 'అమెరికా వెళ్లడానికి ఓ రెండులక్షలివ్వు అత్తా' అంటే లేదన్నానని ఇంటిల్లిపాదీ ఎన్ని సణిగారో! కనీసం 'కాఫీతాగావా? అన్నం తిన్నావా?' అని అడిగిన వాళ్లు లేరు? ఆఫీసుకు వస్తుంటే 'టిఫిన్ బాక్సు తీసుకెళ్లరేంటి?' అని కూడా మరదలు అనలేదు.. డబ్బుతోనే మానవబంధాలు.. ఆప్యాయతలు!

అందుకే ఆఫీసయ్యాక మనసు బాగోక ట్యాంక్‌బండ్‌కు వచ్చాను. పొద్దున సంఘటన మనసును తీవ్రంగా గాయపరిచింది. సుబ్బు విషయంలో నేను మాత్రం దీనికి భిన్నంగా ప్రవర్తించానా అన్పించింది.

తెలిసిన బ్యాంకు మేనేజర్ ఉన్నాడు. రేపు ఆఫీసుకు వెళ్లగానే అతనితో మాట్లాడి సుబ్బు కొడుక్కు విద్యారుణం ఇప్పించాలి. కొడుకు కాలేజి చదువుకు డబ్బుల్లేక అల్లాడుతున్నాడని అకౌంటెంట్ సుబ్బారావు నిన్న ఎవరితోనో అంటుంటే వింది తను..

ఇంటికి వెళ్దామని మెల్లగా లేచి వెనక్కు తిరిగాను.. అక్కడ సైకిల్ పట్టుకుని కన్పించాడు సుబ్బు.

'పొద్దున్నుంచీ అదోలా ఉన్నారు... ట్యాంక్‌బండ్‌కు పోనీమని ఆటోవాడితో చెబుతుంటే విన్నాను.. భయంవేసి మీ వెనుకే స్పీడుగా వచ్చాను..' రొప్పుతూ నసిగాడతను.

'ఈడియట్' మనసులో నవ్వుకుంటూ అతని వెనుకే నడిచాను.

– చంద్రప్రతాప్

# మనసున ఉన్నదీ...



★ ఏప్రిల్ చతురలో వచ్చిన థ్రిల్లింగ్ నవల ఒకటి+ఒకటి=మూడు అపరాధ పరిశోధనలో ఉన్న చిక్కుల్ని చక్కగా వివరించింది. ఇది చాలా కష్టమైన పని. ఎవరిని అనుమానించాలో, వద్దో తెలియని పరిస్థితి. నేరం చేసినవాడు మన పక్కనే ఉన్నా పోల్చుకోలేం. అందుకే ఎవడికి వాడు భద్రత కల్పించుకోవాలన్న సందేశం అంతర్గతంగా ఉన్న ఈ నవల ఏకబిగిన చదివించింది. 'కొత్తగాలి' కవితలు బాగున్నాయి. కాలాతీతం, జ్ఞానపీఠాలు బాగా ఆకట్టుకుంటున్నాయి.

**–జి.వి.యస్. ప్రియంవద, శ్రీకాకుళం**

★ ఏప్రిల్ చతురలో కొత్తగాలి కవితల ద్వారా ఎన్నికల మీద యలమర్తి అనూరాధ, సి.కామేశ్వరరావు, వోలేటి శ్రీనివాసరావు, లలిత మానస, బద్ది నాగేశ్వరరావు, ఆర్.ఎస్. హైమవతి సంధించిన బాణాలు బాగున్నాయి. ప్రతి పుటలోనూ కొత్తగాలి వీస్తే మరింత హాయిగా ఉంటుంది. రాజేష్ కుమార్ తమిళ నవల ఉత్కంఠభరితంగా ఉండి, ఏకబిగిన చదివించింది. మన కొవ్వలిలాగా వీరు కూడా వేయి నవలలు రాయడం గొప్పే కదా! జిల్లేళ్ల బాలాజీ అనువాదం సాఫీగా సాగింది.

**–మాధవీ సనారా, అనకాపల్లి**

★ ఏప్రిల్ చతురలో మెరుపుతీగ దీపిక, తెగ నవ్వించేసిన అపార్ట్‌మెంటాలజీ బాగున్నాయి. ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదికలో త్రీ మస్కటీర్స్ రచయిత అలెగ్జాండర్ డ్యూమా ముందుచూపుగల, సమకాలీన వ్యవస్థకి దర్పణం పట్టిన మహారచయితగా నాకు బాగా నచ్చారు. కన్నడ మణిపూస కె.వి.పుట్టప్పపై అందించిన అంశం ఆకట్టుకుంది. జ్ఞానపీఠాలపై వచ్చే వ్యాసాలన్నీ సాహితీ ప్రియులకు విజ్ఞాన గుళికల వంటివే.

**–పి.సూర్యనారాయణ రాజు, హైదరాబాద్**

★ ఈ నెల చతుర నవల చాలా బాగుంది. నవల మొదటి నుంచి చివరి వరకూ ఎంతో ఆసక్తికరంగా, తర్వాత ఏం జరుగుతుందోననే ఉత్కంఠ రేకెత్తిస్తూ సాగింది. పట్టుదలగా పరిశోధన సాగించిన వివేక్ పాత్ర నాకు నచ్చింది. ఎందరో అనుమానితులు, కానీ హంతకులు వేరు. హత్యకు గురయింది దేవి కాదు, స్వస్తికా అని నిర్ధారించిన తీరు విపరీతంగా పాఠకుల్ని అలరిస్తుంది. కన్నడ మణిపూస కె.వి.పుట్టప్ప గురించి అందించిన వివరాలు కూడా బాగున్నాయి.

**– తుళ్లూరు ప్రసన్నలక్ష్మి, గుంటూరు**

★ మెరుపుతీగ దీపిక ఆరోగ్య రహస్యాలను ఏప్రిల్ చతుర చక్కగా తెలియజేసింది. క్రేజీ హీరోయిన్ల జీవన విధానాన్ని వారి మాటల ద్వారానే అక్షరబద్ధం చేయడంవల్ల ఎక్కువ మంది దాన్ని అనుసరించే అవకాశం మెండు. 'నిన్నటి నిజం'లో ఎమ్మెస్ సుబ్బులక్ష్మి మహోన్నత వ్యక్తిత్వం, మానవీయత ప్రస్ఫుటమయ్యాయి. శరత్ చంద్ర చతురోక్తులు చాలా బాగున్నాయి.

**–నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం**

★ తమిళ థ్రిల్లర్ రాజేష్ కుమార్ నవల చాలా బాగుంది. క్రైమ్ కేసులో జరిగే ఇన్వెస్టిగేషన్స్, నేరానికి సాక్ష్యాలు రాబట్టే విధానాన్ని వివరించిన తీరు అద్భుతం. మేగజైన్ ముఖచిత్రం చాలా ప్రత్యేకంగా ఉంది. మెరుపు తీగ దీపిక పడుకొనె చెప్పిన విషయాలు, ఇతర శీర్షికలూ చాలా ఆకట్టుకున్నాయి.

**–ముమ్మిళ్ల వందన, హన్మకొండ**

★ ఏప్రిల్ కొత్తగాలిలోని కవితలు బాగున్నాయి. ఒకటి+ఒకటి=మూడు నవల ఉత్కంఠభరితంగా సాగింది. అనువాదకులు బాలాజీకి, మూలరచయితకు ధన్యవాదాలు.

**– జి.గోపాలకృష్ణ, శ్రీకాకుళం**

---

చిరునామా: మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ –500 082

ఈ మెయిల్ చిరునామా: chatura@eenadu.net



# చతుర ప్రవేశిక



## మే - 09

మే 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపిక చేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ముట్నూరి కోటి వీరయ్య భార్యపేరు?
2. చెన్నకేశవుల్ని అరేయ్ ఒరేయ్ అనే స్నేహితురాలు?
3. సుబ్బారెడ్డిని యాక్సిడెంట్ చేసిన లారీ డ్రైవర్?
4. అవకాశవాద యూనియన్ లీడర్ పేరేమిటి?
5. ఎమ్మెల్యేకి సహకరించే ఇన్‌స్పెక్టర్ ఎవరు?
6. పరమహంస తరచుగా ఎవరిని పొగిడేవారు?
7. వికార్ ఆఫ్ ది వేక్‌ఫీల్డ్ రచయిత?
8. ఉమాశంకర్ జోషి ఏ సంవత్సరంలో పుట్టారు?
9. 'వీడని నీడ' ఎవరు?
10. అందం నాకు వరం అన్నదెవరు?

---

పంపినవారి పేరు: ---------------------------- వయసు (    )

చిరునామా: ----------------------------------------

----------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ప్రవేశికలకు చివరి తేదీ 16

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.

ఈనాడు

ఈనాడు
పెళ్ళిపందిరి.నెట్

# మీ ఇంట మంగళవాద్యాలు మోగించండి -
# ఒకే ఒక్క క్లిక్‌తో

www.eenadupellipandiri.net



ఎన్నో ఇంటలను ఏకం చేసి, ఎన్నో లోగిళ్లలో మంగళవాద్యాలు వినిపించిన ఈనాడు పెళ్లిపందిరి కొత్తశోభను సమకూర్చుకుంది. ఈనాడు పెళ్లిపందిరి.నెట్ ఇప్పుడు ఇంటర్నెట్ ద్వారా దేశవిదేశాల్లోని తెలుగువారందరికీ అందుబాటులోకి వచ్చింది, ఇక మీ ఇంట కల్యాణకాంతులు నింపుతుంది. త్వరపడండి!

ఈ సదవకాశాన్ని ఉపయోగించుకోవడానికి మీకిదే మా ఆహ్వానం!

మీకు నచ్చే సంబంధాల కోసం నేడే ఆన్‌లైన్ రిజిస్టర్ చేసుకోండి

| దేశవిదేశాల్లో మీ వివరాలు చూసే అవకాశం | ఉపయోగించుకోవడం ఎంతో తేలిక
| మీ సమాచారానికి భద్రత | మొబైల్, ఈమెయిల్ ద్వారా అలర్ట్స్ | ఆకర్షణీయమైన ప్యాకేజీలు.

R K SWAMY BBDO 0082

eenadu
pellipandiri.net
శీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు

నేడే రిజిస్టర్ చేసుకోండి



మరిన్ని వివరాలకు సంప్రదించండి: 93942 70030 / 31 / 32

email: info@eenadupellipandiri.net

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78